అపరాధ పరిశోధన అనుబంధం—161

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## గోవిందరావు మరణం

రచన: వసుంధర

## మాటువేసిన మృత్యువు

రచన: కె. వి. యస్. ఎన్. మూర్తి

## వజ్ర కిరీటం

రచన: వి. యస్. రావ్

## తెల్లపావురం

రచన: బొమ్మిడి అచ్చారావు

అన్వేషణ - పదకొండవ భాగం

**అపరాధ పరిశోధన సప్లిమెంట్—161**

మే, 1987

వెల: రు. 7-50

ఏడాది చందా: 90 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:

శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:

ఏ. వీ. మోహన్రావ్

బొమ్మిడి అచ్చారావు

వి. యస్. రావ్

సుంకరి రాంప్రసాద్

విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:

అపరాధ పరిశోధన కార్యాలయం

నారాయణగూడ, హైదరాబాదు-29

ఫోన్-64843

ముద్రణ:

క్రాంతి ప్రెస్,

2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1,

# గోవిందరావు పురాణం

## వసుంధర

"నా పేరు లక్ష్మణరావు—" అన్నా డా యువకుడు.

డిటెక్టివ్ వెంకన్న కుర్చీలో వెనక్కు వాలి కళ్ళు మూసుకుని—"ఊఁ" అన్నాడు.

సీతమ్మ, రాజమ్మ నోట్సు తీసుకుందుకు సిద్ధంగా ఉన్నారు.

"నన్నొక వ్యక్తి హత్యచేయాలని ప్రయత్నిస్తున్నాడు—...."

వెంకన్న కళ్ళు తెరిచి—"ఊఁ" అన్నాడు.

"మీరు నన్ను రక్షించాలి—"

వెంకన్న ముందుకు వంగి—"వివరంగా చెప్పండి. మిమ్మల్నెవరు చంపాలనుకుంటున్నారో — ఎందుకు చంపాలనుకుంటున్నారో — యెలా చంపాలనుకుంటున్నారో—మీకు తెలిసినదంతా వివరంగా చెప్పండి."

"మీకు నేను చాలా పెద్ద కథ చెప్పాలి." అన్నాడతడు.

సీతమ్మ, రాజమ్మ ముఖముఖాలు చూసుకున్నారు. నోట్సు రాయడానికి ఎక్సర్ సైజు కోసమన్నట్లుగా ఇద్దరూ కూడా తమ కుడిచేతులనోసారి విదిలించుకుని మళ్ళీ రెడీ గా వున్నారు.

లక్ష్మణరావుకేసి అదోలా చూసి — "ఎంత పెద్ద కథైనా ఫరవాలేదు. వింటాను. కానీ అనవసరమైనవేమీ చెప్పకండి. అవసరమైనవేమీ వదలకండి. ప్రొసీడ్ —" అన్నాడు వెంకన్న.

లక్ష్మణరావు చెప్పడం ప్రారంభించాడు.

లక్ష్మణరావు సరోజని ప్రేమించాడు. సరోజ అందమైనది. తల్లిదండ్రుల చాటు బిడ్డ. ఆమె కూడా అతడంటే యిష్టపడింది కానీ తల్లిదండ్రులు పెళ్ళికిష్టపడలేదు. సరోజ పెళ్ళి గోవిందరావుతో జరిగిపోయింది.

గోవిందరావుకు బ్యాంకులో ఉద్యోగం. తల్లిదండ్రులు అతడి దగ్గరే ఉంటున్నారు. తండ్రి రిటైరైనా ఊళ్ళోనే యేదో చిన్న ఉద్యోగం చేస్తున్నాడు. వాళ్ళతోపాటే గోవిందరావు తమ్ముడు గోపాల్రావు, చెల్లెలు రేఖ వుంటున్నారు. రేఖకు పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు.

తల్లిదండ్రులకు రేఖను చాలా పెద్దింట్లో యివ్వాలనుంది. అందుకు బాగా కట్నం కావాలి. ఆ డబ్బును సరోజద్వారా రాబట్టాలని వాళ్ళనుకునేవారు. అత్తగారు, ఆడపడుచు ఏకమై సరోజను సాధించేవారు. భార్యను సాధించమని గోవిందరావును వేధించేవారు. వారి బాధ పడలేక ఒకోసారి అతడు భార్యను మాటలనేవాడు. ఒకోసారి ఆమెకు తన అసహాయతను చెప్పుకునేవాడు.

గోవిందరావు తమ్ముడు గోపాల్రావు బియ్యే ప్యాస

య్యాడు. ఇంటర్మీడియేట్ ప్యాసయ్యాక అతడికో యాక్సిడెంటయింది. అప్పట్నించీ అతడికి మతి స్థిరంలేదు. ఒకోసారి తెలివిగా ఉంటాడు. ఒకోసారి పిచ్చివాడిలా ప్రవర్తిస్తాడు. అలాగే బియ్యే చదివి ప్యాసయ్యాడు.

ఒక సైకియాట్రిస్టుద్వారా అతడికి వైద్యం జరిగింది. జరుగుతోంది పెళ్ళిచేస్తే అతడు మామూలు మనిషవు తాడని సైకియాట్రిస్టు చెప్పాడు. పెళ్ళిచేయాలంటే అతడి విషయంలో సమస్యలున్నాయి.

బంధువుల్లో చాలామందికతడి గురించి తెలుసు. అందుకని యెవరూ పిల్లనివ్వరు. బయటి సంబంధం చేసుకోవాలంటే అతడికుద్యోగముండాలి. ఇంటర్వ్యూలో గోపాల్రావుకు తన ప్రవర్తనమీద తనకే అదుపులేదు కాబట్టి ఉద్యోగం వచ్చే అవకాశంలేదు. ఏ పేదింటి పిల్లనో చేసుకుందామంటే—కట్నంరాదు. తలిదండ్రులకు కట్నంమీద ఆశ.

గోపాల్రావంటే సరోజకిష్టంలేదు. అతడామె కళ్ళకప్పుడూ పిచ్చివాడిలాగే కనిపించేవాడు. ఏ క్షణంలో యెవరిమీదపడి కరుస్తాడోనని భయపడేదామె.

ఒకరోజున ఊరి చివర వెంకటేశ్వరస్వామి గుడివున్న కొండమీదకు నాలుగు కుటుంబాలు పిక్నిక్కు వెళ్ళాయి. అందులో గోవిందరావు కుటుంబమొకటి. అక్కడ ప్రమాదవశాత్తూ గోవిందరావు—కొండమీంచి క్రిందకు జారిపడి మరణించాడు.

అది ప్రమాదం కాదనీ అతడినెవరో తోసేశారనీ— అది తను చూశాననీ గోపాల్రావంటాడు. చుట్టుపక్కల వేరే మనుషులెవరూ మసలిన ఆధారాలులేవు. అతడివి పిచ్చివాడి మాటలుగా కొట్టి పారేశారు తలిదండ్రులు.

సరోజ పుట్టింటికి వెళ్ళిపోయింది. ఇరవై రెండేళ్ళ వయసుకే వైధవ్యమామెకు. అప్పుడు లక్ష్మణరావు సరోజను పెళ్ళిచేసుకుందుకు ముందుకు వచ్చాడు.

సరోజ తలిదండ్రులు వెంటనే యే నిర్ణయానికీ రాలేక గోవిందరావు తలిదండ్రులకు తెలియబర్చారు.

చెట్టంత కొడుకుపోయేక — వంశాంకురం మిగలక పోయేక కోడలేమైపోతే తమకెందుకన్నారు వాళ్లు.

కానీ గోపాల్రావు లక్ష్మణరావును కలుసుకున్నాడు. చూసీచూడగానే—"నువ్వే నా అన్నను చంపావ్—" అన్నాడు. అదే విషయమతడు సరోజకు చెప్పాడు.

అతడు చెప్పిందెవరైనా నమ్మేవారే! అదృష్టవశాత్తూ అతడికప్పుడు చాలా బలమైన ఎలిబీ ఉంది.

ఎవరూ గోపాల్రావు మాటలు నమ్మలేదు.

"నీ భర్తను చంపినవాణ్ని మళ్ళీ పెళ్ళిచేసుకోకు.." అని గోపాల్రావు సరోజకు మరీ మరీ చెప్పాడు. ఆమె అవుననలేదు, కాదనలేదు.

"నా అన్నను చంపినందుకే నిన్నేమైనా చేయాలి. నా వదిన జోలికి వెళ్లావా—నీ ప్రాణం తీస్తాను—" అని గోపాల్రావు లక్ష్మణరావును హెచ్చరించాడు.

లక్ష్మణరావతడి హెచ్చరికను లక్ష్యం చేయలేదు.

అతడు వెంటనే సరోజను పెళ్ళిచేసుకోవాలనుకున్నాడు. సరోజ తన మనసు బాగోలేదనీ—తనకు కొంత గడువు కావాలనీ అంది.

ఈలోగా లక్ష్మణరావుమీద ఒక హత్యాప్రయత్నం జరిగింది.

రోడ్డుమీద జనసమ్మర్దంలో నడుస్తూండగా ఎవరో తోసినట్లై లక్ష్మణరావు రోడ్డుకడ్డంగా పడిపోయాడు.

ఫుల్ స్పీడులో వస్తున్న ట్రక్కుకు సడన్ బ్రేకు పని చేయడంవల్ల అతడి ప్రాణాలు దక్కాయి.

జనసమ్మర్దం కారణంగా తన్ను తోసిందెవరో లక్ష్మణరావు తెలుసుకోలేకపోయాడు. ఆ సమయంలో గోపాల్రావుకు మంచి ఎలిబీకూడా వుంది. కానీ గోపాల్రావు—ఆ ప్రయత్నం తనదేనని లక్ష్మణరావు ఆఫీసుకు ఫోన్ చేసి మరీ చెప్పాడు.

లక్ష్మణరావు భయపడ్డాడు. సరోజ యిది విని — "నన్ను పెళ్ళిచేసుకోకు—" అంది.

"నా ప్రేమ బలంవల్ల నీ నాకు మళ్ళీ నిన్ను పెళ్ళాడే అవకాశం వచ్చింది. నా ప్రాణంపోయినా ఈ అవకాశం వదులుకోలేను—" అన్నాడు లక్ష్మణరావు.

"పెళ్ళిచేసుకుంటే రెండోసారి భర్తను పోగొట్టుకుంటావు—" అని గోపాల్రావు సరోజను బెదిరించాడు.

అందుకు హెచ్చరిక అన్నట్లుగా రెండోసారి అతడి మీద హత్యాప్రయత్నం జరిగింది.

ఆఫీసుకు లంచవర్లో క్యారియర్ తెప్పించుకుంటాడు లక్ష్మణరావు. భోజనానికి పదినిమిషాలముందతడికి ఫోన్ వచ్చింది.

"డియర్ మిస్టర్ లక్ష్మణరావ్! నీ ప్రాణాలు రక్షించాలని ఫోన్ చేస్తున్నానిపుడు. క్యారియర్లో నీ భోజనంలో విషం కలిసింది. తింటే చస్తావ్...."

"ఎవరు నువ్వు?"

"పేరు చెప్పకపోయినా నేనెవరో నీకు తెలుసు.."

"గోపాల్రావా?"

అందుకు బదులివ్వకుండా—"ఈసారికి నీ ప్రాణాలు రక్షించాను. సరోజను పెళ్ళిచేసుకుంటే నేనే నీ

ప్రాణాలు తీస్తాను....” అన్నా డతడు.

గోపాల్రావే ఆ ఫోన్ చేశాడని లక్ష్మణరావు గ్రహించాడు. భోజనం పరీక్ష చేయిస్తే విషముందని తేలింది. ఆపూట క్యారియర్ తెప్పించుకున్న వాళ్ళెవ్వరూ భోజనాలు చేయలేదు. క్యారియర్ తెచ్చేమనిషి తనకేమీ తెలియదని లబోదిబోమంది. ఆమెను పోలీసుల కూడా అప్పగించారు. పోలీసుల చేతులో తన్నులు భరించలేక ఆమె నోటికొచ్చిన అబద్ధాలేవో చెప్పింది. పోలీసులామెకేమీ తెలియదని గ్రహించి వదిలిపెట్టేశారు. ఆమె ఉద్యోగం ఊడింది.

హత్యాప్రయత్నం చేసిందెవరో తెలియలేదు.

ఇది జరిగేక లక్ష్మణరావు కూడా ప్రాణభయం పట్టుకుంది.

వెంకన్న కథ విని నిట్టూర్చి—“సరోజను పెళ్ళి చేసుకోవాలని మీకంత పట్టుదలెందుకు? ఆమె విధవ. ఆమె మానాన ఆమెను బ్రతకనివ్వండి—” అన్నాడు.

“వెంకన్న గారూ! మీ గురించి చాలా గొప్పగా విన్నాను. గొప్ప సంస్కారవంతులనీ.... మీరే యిలాగనడం ...”

వెంకన్న అతణ్ని మధ్యలో ఆపి గర్వంగా తన అసిస్టెంట్సు వంక చూసి — “నేనలా అనకపోతే—నా గురించి మీరేం విన్నారో యెలా తెలుస్తుంది? మీరు నా గురించి విన్నది పూర్తిగా నిజం. అందుకే అంటున్నాను. మీరు సరోజకు బదులు మరో విధవను వివాహం చేసుకోండి....” అన్నాడు.

“నేను సరోజను ప్రేమించాను....”

“అయితే సంస్కారణ గురించి మాట్లాడకండి. మీ

ఆసక్తి సంఘసంస్కరణ గురించి కాదు. అవునా?"

"మీరలాగనుకున్నా సరే— నేను సరోజను పెళ్ళి చేసుకోవాలి...."

"సరోజలోని ఆ ప్రత్యేకతేమిటి?"

"ఆ ప్రత్యేకత ప్రేమించినవాళ్ళకే తెలుస్తుంది...."

"నాకూ పెళ్ళయింది. నేనూ నా భార్యను ప్రేమిస్తున్నాననే అనుకుంటున్నాను. కానీ మగాడికో ఆడతోడు అవసరం తప్పితే—ఏ ఆడదానిలోనూ ప్రత్యేకత లేదన్నది నేను స్వానుభవంతో గ్రహించిన నిజం...."

వెంటనే బల్లమీద ఫోను రింగయింది.

వెంకన్న ఇబ్బందిగా కదిలి బల్లమీద ఫోన్ తీసి— "హలో — పద్మా! నేను నీకు సంజాయిషీ యిచ్చుకుంటాను. ప్రతి మాటకూ కారణముంటుందని నువ్వు గ్రహించాలి. ఇన్నేళ్ళ సాహచర్యంలో కూడా నువ్వు నన్నింతేనా అర్థంచేసుకున్నది!" అని ఫోన్ పెట్టేశాడు.

సీతమ్మ, రాధమ్మ ఒకరి వంక ఒకరు ఆదోలా చూసుకున్నారు.

"మీ సంగతి నాకు తెలియదు. సరోజలో ప్రత్యేకత ఉంది...."

"ఆ ప్రత్యేకత యేమిటో నేను తెలుసుకోవచ్చా?"

"మాటల్లో చెప్పలేను...."

"నేను మీకు సహకరిస్తాను...."

"ఎలా?"

"ఉదాహరణకు— మీరు సరోజను దారుణంగా ప్రేమించారు. అయినా ఆమెను పెళ్ళిచేసుకోలేకపోయారు. అందుక్కారణం సరోజలోని ప్రత్యేకత!"

ఆ మాటల్లో వ్యంగ్యం ధ్వనించి — "మీరు నన్ను

వేళాకోళం చేస్తున్నారు. సరోజని ప్రేమించడానికే తప్ప పెళ్లాడ్డానికి ప్రత్యేకత లేదని మీ ఉద్దేశ్యం? అదే నిజమైతే నేనిప్పుడామెను పెళ్ళి చేసుకోవాలనెందుకను కుంటాను?" అన్నాడు లక్ష్మణరావు.

"నేనూ అదే అంటున్నాను. సరోజ తల్లిదండ్రుల చాటు బిడ్డ. వారి నెదిరించి మిమ్మల్ని పెళ్ళి చేసుకోలేదు. ఆమె మనసును నొప్పించకూడదని మీకనిపించింది. అందుకే మీరామెను బలవంతపెట్టలేదు. ఎంతగానో ప్రేమించినా కూడా — ప్రతిమాలితే ఆమె మీమాట వింటుందని తెలిసికూడా — తాత్కాలికంగా మీ ప్రేమను త్యాగం చేశారు. మిమ్మల్ని త్యాగానికి పురికొల్పడం ఆమె ప్రత్యేకత...." అన్నాడు వెంకన్న.

లక్ష్మణరావు కళ్ళు మెరిశాయి — "కరెక్టుగా చెప్పారు...."

"అందుకే నేను మీకు సహకరిస్తున్నాను.... సరోజకు వివాహమై భర్తతో కాపురం చేసింది తర్వాత భర్తను పోగొట్టుకుంది. మీరామెనిప్పటికీ వివాహం చేసుకుందుకు సిద్ధంగా ఉన్నారు. అదికూడా ఆమె ప్రత్యేకత...."

లక్ష్మణరావు కళ్ళలోని వెలుగు ముఖమంతా పాకింది- "చాలా బాగా చెప్పారు. ఇంకా అడగండి....—" అన్నాడు ఉత్సాహంగా.

"సరోజకోసం మీరు పెళ్ళి మానేశారు. ఆమెనే పెళ్ళి చేసుకోవాలన్నది మీ జీవితాశయం. అది నెరవేరడానికి మీరేమైనా చేయగలరు...."

"అవును...."

"సరోజను పెళ్ళాడాలంటే—ఆమె విధవ కావాలి. అంటే ఆమె భర్త చనిపోవాలి..."

లక్ష్మణరావు కంగారుగా — "ఏమిటి మీర నేది?" అన్నాడు.

"సరోజలోని ప్రత్యేకత—మీ చేత ఆమె భర్తను చంపించగలదా అని ఆలోచిస్తున్నాను...."

బల్లమీద ఫోన్ మ్రోగింది. వెంకన్న యేదో అనే లోగా—"డిటెక్టివ్ వెంకన్నగారూ—ఇందాకటి మీ మాటలకార్కారణం తెలుసుకున్నాను. సంజాయిషీ అవసరంలేదు. యూ ఆరే జీనియస్....ప్రొసీడ్...." అన్న మాటలు వినబడి క్లిక్‌మంది ఫోన్.

"మీరు నన్నుమానిస్తున్నారు...." అన్నాడు లక్ష్మణరావు.

"సరోజలోని ప్రత్యేకత తెలుసుకుందుకు ప్రయత్నిస్తున్నాను."

"వెంకన్నగారూ— నేను ప్రేమికుణ్ణే కానీ హంతకుణ్ణి కాను...."

"ప్రేమకోసం దేశాలమధ్య యుద్ధాలు జరిగాయి. హత్య జరిగితే ఆశ్చర్యమేముంది?" అన్నాడు వెంకన్న.

"గోవిందరావు మరణించడం నా అదృష్టమేనని ఒప్పుకుంటాను. కానీ నేనతణ్ణి చంపలేదు...."

"అదృష్టం వెతుక్కుంటూ రావడం అరుదు. లాటరీలో పదిలక్షలొచ్చినవాడు కూడా-ఒక రూపాయపెట్టి టికెట్ కొంటాడు...."

"అంటే మీ ఉద్దేశ్యం?"

"ఏమీ లేదు. మీ అదృష్టాన్నభినందిస్తున్నాను."

"వెంకన్నగారూ—నాకు సాయపడతారని మీవద్ద కొచ్చాను. మీరు నన్నే అనుమానిస్తున్నారు. నా అదృష్టమిలాగుంది...." అన్నాడు లక్ష్మణరావు బాధగా.

"బాధపడకండి. ఒక పిచ్చివాడు మీపై హత్యా ప్రయత్నం చేస్తున్నాడు. మిమ్మల్ని నేను రక్షించాలి. ఈ కేసులో నేను విజయం సాధించడం మీ అదృష్టం మీద నే ఆధారపడి వుంది. కాబట్టి మీ అదృష్టం గురించి నేను తెలుసుకోవద్దూ?" అన్నాడు వెంకన్న.

తన జేబులోంచి అయిదు వందనోట్లు తీసి బల్లమీద పెట్టాడు లక్ష్మణరావు—"వెంకన్న గారూ! ప్రస్తుతానికిదే నేను మీకివ్వగల అడ్వాన్స్. మా ఇద్దరి వివాహం జరిగితే మీకు వెయ్యినూటపదహార్లిచ్చుకుంటాను...." అన్నాడతడు.

"సరే—నా ప్రయత్నాల్లో నేనుంటాను. కొంత కాలంపాటు మీరు సరోజను మర్చిపోండి—" అన్నాడు వెంకన్న.

## 2

"ఎవరో అమ్మాయి నీ కోసం వచ్చిందే"—అంది రాఘవమ్మ.

"ఎవరూ?" అంటూ వచ్చింది సరోజ.

గుమ్మం దగ్గర నిలబడ్డ రాజమ్మ సరోజవంక చూపింది.

సరోజ— తెల్లని చీర ధరించింది. అదే రంగు రవిక వేసుకుంది. జుత్తును జడగా వేసుకోకుండా అలాగే వదిలేసింది. మొఖాన బొట్టు లేదు.

అయినప్పటికీ ఆమె వైధవ్యమనుభవిస్తున్న విషాద మూర్తిలాకాక—స్వర్గంనుంచి శాంతి సందేశం తెచ్చిన దేవమాతలా వుంది.

'సరోజలో ప్రత్యేకత వుంది—' అనుకుంది రాజమ్మ.

"మీ రెవరో నాకు తెలియదు!" అంది సరోజ.

"కానీ మీరు నాకు తెలుసు. లోపలకు రావచ్చా?" అంది రాజమ్మ.

"రండి—" అంది సరోజ మర్యాదకి.

రాజమ్మ లోపలకు వెళ్ళింది. ఇద్దరూ ఓ గదిలో యెదురెదురుగా కుర్చీల్లో కూర్చున్నాక—రాజమ్మ తన్ను తాను పరిచయం చేసుకుంది.

"డిటెక్టివులకి నాతో ఏం పని?" అంది సరోజ.

రాజమ్మ ఆమెకు లక్ష్మణరావు చెప్పిన విశేషాలు చెప్పింది.

"రెండో పెళ్ళి నాకిష్టంలేదు. ఇలాంటుకాలం రాదని ఇంట్లో బాధిస్తున్నారు. ఏం చేయాలో నాకు తెలియడం లేదు...."

"మీరు మీ భర్తను మరిచిపోలేకపోతున్నారా?'

"అవును...." అంది సరోజ.

"లక్ష్మణరావు మీ భర్తను చంపివుంటాడని మా బాస్ అనుమానిస్తున్నారు...." అంది రాజమ్మ.

"అతడాయన్ను చంపలేదు...."

"మీరు సరిపెట్టుకుంటున్నారు...."

"సరిపెట్టుకోవడం నాకెందుకు? నిజం తెలుసుకాబట్టి చెప్పగలుగుతున్నాను...." అంది సరోజ.

"ఏమిటా నిజం?"

సరోజ చటుక్కున—"మీ వ్యానిటీ బ్యాగులో యేముంది?" అంది.

"ఏం?" అంది రాజమ్మ ఆశ్చర్యంగా.

"నేను నిజం చెబుతాను. నా మాటలు మీరు రికార్డు చేయకూడదు...." అంది సరోజ.

"ఎందుకంత భయం?"

"నిజం చెప్పేక మీకు తెలుస్తుంది...."

"అయితే నా వ్యానిటీ బ్యాగేం కర్మ — నన్నే శోధించుకోండి...." అంది రాజమ్మ నవ్వుతూ.

సరోజ ఆమెవద్ద టేపురికార్డరు లేదని రూఢిచేసుకున్నాక—"మావారు ప్రమాదవశాత్తూ మరణించలేదు. ఎవరూ వారిని చంపనూలేదు. ఆయన ఆత్మహత్య చేసుకున్నారు—" అంది.

"ఎలా తెలుసు మీకు?" అంది రాజమ్మ ఆశ్చర్యపడి.

"చాలాకాలంగా వారు విరక్తి భావంతో వున్నారు."

"కొత్తగా పెళ్ళయిందికదా — విరక్తికి కారణమేమిటి?"

"నా మామగారు చాలా కష్టపడి పైకి వచ్చారు. చిన్నతనంలో మావారుకూడా అంతులేని కష్టాలు చవిచూశారు. ఈనాడాయన ఉచ్ఛదశకు చేరుకుంటే అందుకు మామగారే కారణం. అందుకే ఆయనకు తలిదండ్రులంటే చెప్పలేనంత భక్తి. పెళ్ళిచేసుకున్నాక వారు నన్ను అభిమానించారు. అయితే నా అత్తమామలు బాగా డబ్బు మనుషులు. అవసరమున్నా లేకపోయినా అత్తమామల్నించి బాగా డబ్బు గుంజమని వారిని వేధించేవారు. వారి బాధ భరించలేక ఆయన నా తలిదండ్రుల్నడిగేవారు. మావాళ్ళేం ఉన్నవాళ్ళుకాదు. అంత్యనిష్ఠూరంకంటె ఆది నిష్ఠూరమే మేలని ముందే చెప్పేశారు. ఏదో ఏడాదికోసారి బట్టలు పెట్టడం మినహా తమవల్ల ఇంకేమీ కాదని. దాంతో యుద్ధం మొదలయింది...." సరోజ జరిగినవన్నీ గుర్తుచేసుకుంటూ నిట్టూర్చింది.

"తర్వాత?" అంది రాజమ్మ కుతూహలంగా.

"మావారిచేత నన్ను తిట్టించాలని చూసేదత్తగారు.

ఆయనకిష్టముండేది కాదు. నాకంటే నీకు పెళ్ళాం బెల్లమయిందా అనావిడ ఎత్తిపొడిచేది. అవన్నీ తృప్తిపరచడంకోసం ఆయన నన్ను తిడుతూండేవారు. అప్పుడప్పుడు చేయికూడా చేసుకునేవారు. ఇది చుట్టుపక్కల వారందరికీ కూడా తెలుసు."

"ఈ దేశంలో ఆడదాని జీవితం దుర్భరం. అందులోను పెళ్ళయ్యాక మరీను.." అంది రాజమ్మ బాధగా.

"నిజం. చాలామంది కథ ఇలాగే ఉంటుంది. ఎవరూ బైటకు చెప్పుకోరు. నేనుకూడా ఆఖరికి నా తలిదండ్రులక్కూడా చెప్పుకోలేదు. అత్తమామ లెలాంటివారైనా వారు మంచివారని మా ఇంట్లో అనుకునేలా చేశాను. కానీ యిలా యెంతకాలం కొనసాగుతుంది? ఒకసారి మావారు మా నాన్నగారితో పెద్ద గొడవ పెట్టుకున్నారు. మా నాన్నగారు రెచ్చిపోయి—"బాబూ—నువ్వు పెళ్ళాంకోసం పెళ్ళాడేవా—డబ్బుకోసమా?" అనడిగారు. ఆయనకూడా నాన్నతో—"మీరు కూతురి మీద ప్రేమతో పెళ్ళిచేశారా? వదుల్చుకుందుకా?" అనడిగారు ..."

"ఎంత దారుణం?" అంది రాజమ్మ.

"కానీ నిజంగా వారు చెడ్డమనిషి కాదు."

"ఆయన మంచివాడే అయితే మాత్రం—ఆ మంచితనంవల్ల మీకొరిగినదేమిటి? చాలామంది ఆడవాళ్ళు భర్త తప్పుచేసినా ఆ నేరాన్నితరులమీదకు నెట్టేస్తారు. మీరూ అంతే నా అభిప్రాయంలో. ఇందులో తప్పంతా మీవారిదే .... ఆయన తలిదండ్రులను నిరసించి వేరు కాపురం పెట్టాల్సింది."

"అదే మంచిదని ఆయనకూ తెలుసు. అప్పుడు పది

మందీ ఆయున్న పెళ్ళాం కొంగు పట్టుకొని తిరుగుతున్నాడంటారు. నన్నేమో తలిదండ్రులున్నించి కొడుకును విడదీసిన రాక్షసి అంటారు. రెండింటికీ యుద్ధం సిద్ధపడిలేము. తన అసహాయతకాయన నా దగ్గర బాధపడి కళ్ళమ్మట నీళ్ళెట్టుకునేవారు. అప్పుడు నాకు వారంటే జాలి యేర్పడింది. నేనే వారిని ఓదార్చేదాన్ని. ఏదో రోజున తనాత్మహత్య చేసుకుంటాననేవారాయన .... దీనికంతకీ మా నాన్నగారితో గొడవే కారణం....” అంది సరోజ.

కథ చాలా ఆసక్తికరంగా వుంది. రాజమ్మ కుతూహలం పెరుగుతోంది.

సరోజ కొనసాగించింది.

“మీరు కూతురు సుఖపడాలని పెళ్ళిచేశారా? వదుల్చుకుందుకా?” అన్న గోవిందరావు ప్రశ్నకు సరోజ తండ్రి రక్తం మరిగింది.

“వదుల్చుకుందుకే అయితే నేను దాన్ని లక్ష్మణరావుకే యిచ్చి పెళ్ళిచేసేవాణ్ని. కానీ కట్నంలేకుండా సింపుల్ గా రిజిస్ట్రారాఫీసులో పెళ్ళిచేసుకుంటానన్న కుర్రాణ్ని వదిలి మీ యింట్లో యిచ్చాను. ఇచ్చినందుకనుభవిస్తున్నాను—” అన్నాడాయన.

అప్పుడు గోవిందరావుకు లక్ష్మణరావు గురించి తెలిసింది. ఆరాలడిగాడు.

సరోజ తండ్రి నాలిక్కరుచుకున్నాడు. కానీ లక్ష్మణరావు కథ చెప్పక తప్పలేదాయనకు.

వేరే గొడవ పెంచకుండా గోవిందరావింటికి వెళ్ళిపోయాడు. జరిగిందింట్లో తెలిసేక పెద్ద రాద్ధాంతమయింది.

అత్తమామలు సరోజను కులట అన్నారు. గోవింద

రావుకన్యాయం జరిగిపోయిందన్నారు. తనకేమీ తెలియ దని సరోజ యెంత గోల పెట్టినా యెవరూ వినలేదు.

ఆ యింట్లో అత్తమామల బలం పెరిగింది. సరోజ, తలిదండ్రులకు తన బాధ తెలియచ్చేసని — "ఆ లక్ష్మణరావ్‌తో నాకే సంబంధమూ లేదని తెలిసీ మీరతడి సంగతాయనకెందుకు చెప్పారు? ఇప్పుడు నా జీవితం నరక మైపోయింది—" అని గోల పెట్టింది.

జరిగిందానికామె తండ్రికూడా బాధపడ్డాడు. కానీ ఏం చేయగలడు?

విషయం లక్ష్మణరావుకు చేరింది. ఏమనుకున్నాడో లక్ష్మణరావు హుటాహుటిని గోవిందరావింటికి వెళ్ళాడు.

"నాకూ, సరోజకూ ఏ సంబంధమూలేదు. నేనామెను ప్రేమించాను. ఆమె నన్ను ప్రేమించిందో లేదో తెలి యదు. మేమిద్దరం కలుసుకొని మాట్లాడుకోనైనా లేదు. ఆమె తలిదండ్రులు నాతో పెళ్ళి కొప్పుకోలేదు. మా పెళ్ళి జరగలేదు...."

"ఈ విషయం వాళ్ళు ముందే ఎందుకు చెప్పలేదు?" అన్నాడు గోవిందరావు తండ్రి.

"ఇందులో చెప్పాల్సిందేముంది?"

"ఏ సంబంధమూ లేకపోతే సరోజ గురించి నీకెందుకు బాధ? పనిగట్టుకని ఆమె పవిత్రత గురించి చెప్పడాని కిక్కడికెందుకొచ్చావు?" అంది గోవిందరావు తల్లి.

"బాధకూ సంబంధానికీ—సంబంధముండదు. కట్టు కున్న భర్త-గృహలక్ష్మిగా భావించాల్సిన అత్తమామలు సరోజను బాధించడం లేదూ?"

"సరోజను బాధిస్తున్నామని నీకెవరు చెప్పారు?

సరోజే నీకు చెప్పిందా? లేక ఆమె తలిదండ్రులు చెప్పారా? వాళ్ళకూ నీకూ సంబంధమేమిటి?"

"ఇప్పుడు సంబంధాల సంగతెందుకు? నేను మీకు నిజం చెప్పడానికి వచ్చాను. ఆమెపై లేనిపోని అపవాదులు వేయకండి—...."

"ఇంతవరకూ అపవాదుంటే — అది నీ రాకతో యథార్థమైపోయింది...." అంది సరోజ అత్త.

"అయితే మీరేం చేస్తారు?"

"ఏం చేసినా నీతో చెప్పిచేయం..." అంది సరోజ అత్త.

"సరోజకూ నాకూ సంబంధముందని మీరు నమ్ముతున్నారా?"

"నమ్ముతున్నాం."

"అయితే ఆమెకు విడాకులిప్పించండి. నేనామెను పెళ్ళిచేసుకుంటాను. చేతకాని భర్తతో యింతకాలమూ సుఖపడింది చాలామెకు...." అన్నాడు లక్ష్మణరావు.

సరోజ అత్తమామలు నిర్ఘాంతపోయారు.

"ఇష్టమైతే ఆమె మీ ఇంటి కోడలు. లేకుంటే ఆమెను వదిలిపెట్టండి. నాకు భార్య అవుతుంది. ఆమెను పెళ్ళిచేసుకుంటానని కాగితంకూడా రాసిస్తాను...." అనేసి లక్ష్మణరావు వెళ్ళిపోయాడు.

దీనిమీద సరోజ అత్తారింట్లో పిసుక్కుపోయారు.

సరోజ భర్తను కాదని మరో పెళ్ళి చేసుకుంటే ఆదా యింటికే అవమానం. నలుగురిలో గోవిందరావు నవ్వుల పాలవుతాడు. అతడికి మళ్ళీ పెళ్ళవుతుందన్న గ్యారంటీ లేదు.

అసలే గోపాలరావుకు మతి స్థిమితంలేదు. గోవింద

రావు విషయంలో ఇలా జరిగితే ఆ కుటుంబమే అప హాస్యం పాలవుతుంది. గోవిందరావు చెల్లెలి పెళ్ళి అసాధ్యమవుతుంది.

సరోజ పవిత్రతను శంకించి ఆమెను మానసికంగా బాధించాలనుకున్నారు. కానీ ఆమెనో వ్యక్తి కి పెళ్ళిచేసుకుందుకు సిద్ధంగా ఉండడంతో యిబ్బంది వచ్చింది.

వివాహిత స్త్రీ ప్రవర్తన శంకించబడితే—ఆమెను ప్రేమించే మగాడు పెళ్ళిచేసుకుంటానని ముందుకు వస్తే ఆమె సమస్యలు సగానికి సగం తొలగిపోతాయని లక్ష్మణరావు నిరూపించాడు.

అయితే కథ సుఖాంతం కాలేదు. తలిదండ్రులు లక్ష్మణరావుకీ సరోజకీ సంబంధముందని గోవిందరావుకు నూరిపోశారు. ఇంతకాలం రహస్యంగా కొనసాగిన సంబంధమిక మీదట బహిరంగంగానే కొనసాగుతుందని తలిదండ్రులతణ్ని భయపెట్టారు.

లక్ష్మణరావు గురించిన నిజం చెప్పమని గోవిందరావు భార్యను గుచ్చి గుచ్చి అడగసాగాడు.

"నేను నిన్ను తప్పుపట్టను. నిజం చెప్పు—" అంటాడతడు.

"నేనే తప్పు చేయలేదు. అదే నిజం—" అంటుందామె.

భార్య శీలవతి కావచ్చనలేదు. అవుననలేదు. తలిదండ్రులెన్నెదిరించలేదు. భార్యను నిరసించలేదు. ఆమె నాదరించలేదు.

తను కాదంటే ఆమె వేరే వివాహం చేసుకుంటుందన్న ఆలోచన భరించలేడు.

"నేనాత్మహత్య చేసుకుంటాను—" అన్నాడతను

చాలా పార్లు.

చివరికి ప్రమాదవశాత్తూ మరణించాడు.

"ఈ విషయం గోవిందరావు తలిదండ్రులకు చెప్పాల్సింది. కనీసం వాళ్ళకు బుద్ధొస్తుంది...." అంది రాజమ్మ.

"కొడుకాత్మహత్య చేసుకున్నాడని వాళ్ళకూ తెలుసు. నన్ను చెప్పొద్దని ప్రలోభపెట్టారు...."

"ప్రలోభమా?"

"వారు లైఫిన్సూర్ చేశారు — సుమారు లక్షరూపాయలకు. బ్యాంకునుంచి కూడా వారికి పెద్దమొత్తమే వస్తుంది. ఆత్మహత్యంటే యేమీ రాదు. అదీ వారి భయం. వచ్చే డబ్బులో నాకూ వాటా వుంది— నేనూ ఒక నామినీని...."

"కొడుక్కంటే వాళ్ళకు డబ్బెక్కువా?"

"పోయిన కొడుకెలాగూ తిరిగిరాడు. వస్తున్న డబ్బెందుకు పోగొట్టుకోవాలీ అంటారు వాళ్ళు...."

"మీ అభిప్రాయమేమిటి?"

"ప్రస్తుతం నాకు జీవితం ప్రశాంతంగా వుంది. మళ్ళీ పెళ్ళి చేసుకోకూడదనుకుంటున్నాను...." అంది సరోజ.

"అత్తమామలు లేకపోతే ఏ ఇబ్బందీ ఉండదుగా."

"నా మరిది నన్ను పెళ్ళిచేసుకోనివ్వడు. లక్ష్మణరావూ నేనూ కలిసి ఆలోచించి వారిని చంపేశామని అతడి అభియోగం. నన్ను పెళ్ళిచేసుకుంటే లక్ష్మణరావుని చంపేస్తానంటున్నాడు. నేను పెళ్ళిచేసుకుంటే నన్నే చంపేస్తాడు. కొంతకాలంపాటు పెళ్ళి ఆలోచన లేకుండా వుండాలని నా ఆలోచన...." అంది సరోజ.

"మీ మరిదెలాంటి వాడు?"

"అతడి గురించి నేనాట్టే చెప్పలేదు. అత్తవారింట్లో

అతడికెప్పుడూ దూరంగా ఉండేదాన్ని. అతడంటే నాకు భయం...." అంది సరోజ.

"మీకు వయసెంతో లేదు. పెళ్ళి గురించి అప్పుడే విరక్తి పుట్టడం విచారించాల్సిన విషయం...." అంది రాజమ్మ.

"నేను సంతోషంగానే వున్నాను. నాకిప్పుడు స్వేచ్ఛ లభించినట్లుంది...." అంది సరోజ.

"చాలా థాంక్స్—పనికొచ్చే సమాచారం చాలా చెప్పారు...." అంటూ సరోజవద్ద సెలవుతీసుకుంది రాజమ్మ.

## 3

గోపాలరావు కాఫీ హోటల్లో కూర్చున్నాడు. సర్వరుకు ఒక ఊతప్పం చెప్పాడు. ఎదురుచూస్తున్నాడు.

సర్వరుకంటే ముందతడి యెదుటి సీట్లోకి వెంకన్న వచ్చి — "నమస్కారం — మిస్టర్ గోపాలరావ్!" అన్నాడు.

గోపాలరావాశ్చర్యంగా — "నా పేరు మీకెలా తెలుసు?" అన్నాడు.

"నిన్నేకాంతంగా కలుసుకోవాలని నీ యింటినుంచి అనుసరించి వస్తున్నాను. నీతో నాకు పనుంది. టిఫిన్ కాగానే యే పార్కుకైనా వెడదాం—" అన్నాడు వెంకన్న.

"ఎవరు మీరు?"

"అన్నీ వివరంగా చెబుతాను.," అన్నాడు వెంకన్న.

ఊతప్పం వచ్చింది. గోపాలరావు వెంటనే తినడం ప్రారంభించాడు. సర్వరుతో అతడింకేమీ వద్దని చెప్పాడు.

బిల్లు వెంకన్నే ఇచ్చాడు. గోపాలరావు మొహమాట

పడ్డాడు.

తర్వాతిద్దరూ దగ్గర్లోని పార్కులోకి వెళ్ళారు. అక్కడప్పుడింకెవ్వరూ లేరు.

వెంకన్న తన్నుతాను గోపాల్రావుకి పరిచయం చేసుకున్నాడు.

"డిటెక్టివులకు నాతో ఏం పని?" అన్నాడు గోపాల్రావాశ్చర్యంగా.

వెంకన్న అతడిమాట తీరు గమనించి—"ఈ మనిషికి మతి స్థిమితంలేదని నమ్మడం కష్టం—" అనుకున్నాడు.

"నాతో మీకేం పని?" అన్నాడు గోపాల్రావు మళ్ళీ.

"నీ వదిన నన్ను నియమించింది."

"ఎందుకు?"

"ఇటీవల నీ అన్న ప్రమాదవశాత్తు మరణించాడు. అది ప్రమాదవశాత్తు సంభవించింది కాదనీ హత్య అనీ నువ్వన్నావుట. నీమాటలెవరూ నమ్మకపోయినా నీ వదిన నమ్మింది. హంతకుణ్ని పట్టుకోమని నన్ను నియమించింది."

గోపాల్రావు ముఖం గంభీరంగా అయిపోయింది—"డిటెక్టివ్ గారూ—అయిపోయిందేదో అయిపోయింది. మళ్ళీ ఆ కేసును తిరగతోడవద్దు—" అన్నాడు.

"ఎందుకని? నీ అన్నను చంపిన హంతకుణ్ని ఉరికంబం యెక్కించాలని లేదా నీకు?" అన్నాడు వెంకన్న.

"లేదు...."

"ఎందుకని?"

"నన్నేమీ అడగొద్దు. అన్నయ్యనెవరూ హత్య చేయలేదు. ప్రమాదవశాత్తు మరణించాడు. లేదా ఆత్మహత్య చేసుకొని వుంటాడు."

“ఆత్మహత్యా—ఎందుకు?”

గోపాల్రావు మాట్లాడలేదు.

“ఎవరూ హత్య చేయనప్పుడు నువ్వు లక్ష్మణరావు పేరెందుకు చెప్పావు. అతడి అదృష్టం బాగుండి ఎలిబీ లేకపోతే-అన్యాయంగా ఉరికంబమెక్కేవాడు కదా!”

“అన్నయ్య చావుకు లక్ష్మణరావే కారణం!”

“ఎలా?”

“వదినకు లక్ష్మణరావుతో అక్రమసంబంధముంది. అది అన్నయ్య భరించలేకపోయాడు. వదినను అదుపుచేయా అని యెన్నో ప్రయత్నాలు చేశాడు. ఫలించలేదు...”

“అయితే?”

“అన్నయ్య మెత్తటి మనిషి. తనకన్యాయం జరిగినా యెదిరించలేడు. ఇంట్లో అందరిమధ్యా మానసికంగా నలిగిపోతున్నాడు. చివరికి ఆత్మహత్య చేసుకున్నాడు.”

“నీ వదినకు లక్ష్మణరావుతో పూర్వపరిచయముంది కానీ అక్రమ సంబంధంలేదు. అది నీ అన్నయ్య కింట్లో వాళ్ళు కలిగించిన భ్రమ.”

“డిటెక్టివ్ గారూ....” అని యేదో అనబోయాడు గోపాల్రావు.

“నా పేరు వెంకన్న....” అన్నాడు వెంకన్న.

“వెంకన్నగారూ—వదినకు అక్రమ సంబంధమున్నదన్నది నిజం. అందుకు నేనే సాక్షిని....”

“ఎలా?”

గోపాల్రావేదో చెప్పబోయి ఆగిపోయాడు. అతడి ముఖం పాలిపోయింది. “డిటెక్టివుగారూ—అది చాలా అవమానకరమైన విషయం. వివరాలడక్కండి..” అన్నాడతడు.

"అడుగుతాను. చెప్పాలి."

"ఎందుకు చెప్పాలి?"

"హత్య విషయంలో చాలా ముఖ్యమైన విశేషమిది!"

"హత్య జరగలేదని నేను చెబుతున్నాగా...."

"కానీ—అందరూ ప్రమాదమంటుంటే నువ్వే హత్య అన్నావు. అందులోదో కారణముంది...."

"నాకు తెలుసు—లక్ష్మణరావు కారణంగానే అన్నయ్య ఆత్మహత్య చేసుకున్నాడని! అందుకని లక్ష్మణరావు నిందులో ఇరికించాలనుకున్నాను. అబద్ధం చెప్పాను. కానీ ఫలించలేదు."

"లక్ష్మణరావు తప్పులేదిందులో. ఒకవేళ అక్రమ సంబంధమే నిజమైతే ఆ తప్పు నీ వదినది. ఇప్పుడు వాళ్ళిద్దరూ పెళ్ళిచేసుకుంటే ఆ తప్పు సవరించబడుంది. నీ వదినను నువ్వు సానుభూతితో అర్ధంచేసుకో. లక్ష్మణ రావును కూడా నువ్వు క్షమించాలి. వారిద్దరూ పెళ్ళిచేసు కుంటే మధ్య నీకేం?"

"జరిగింది చెబుతాను. లక్ష్మణరావును మీరు మన్నించ గలరా?"

"చెప్పు...."

"వదినకూ అతడికీ అక్రమసంబంధమున్న ప్రచారం రాగానే ఇంట్లో కలకలం రేగింది. అది లక్ష్మణరావుకు తెలిసి మా ఇంటికొచ్చాడు. తామిద్దరికీమధ్య యేమీ లేదన్నాడు. వివాహానికి ముందు తనామెను ప్రేమించినా వివాహం కాగానే—తను నా అన్నను తనకూ అన్నగా భావించేట్ట. నా వదిన తనకూ వదినేనట. ఇలాంటి కబు ర్లన్నీ చెప్పి వెళ్ళాడు."

"చాలా మంచిపని చేశాడు. ఇందులో అతణ్ని తప్పు

పట్టాల్సినదేముంది?"

"ఇన్నీ చెప్పి వదినతో అక్రమ సంబంధం పెట్టుకున్నాడు...."

"అది నిజం కాదు."

"ఆ నిజానికి నేనే సాక్షిని."

"ఎలా?"

గోపాల్రావు తలపట్టుకొని—"డిటెక్టివ్ గారూ—ఎలా చెప్పను? వదిన పవిత్రమూర్తి. మాటిమాటికీ జరిగింది గుర్తు తెచ్చుకొని ఆ పవిత్రతను పాడు చేయలేను" అన్నాడు.

వెంకన్న అతడి కళ్ళలో బాధను చదివాడు—"సరే-చెప్పొద్దులే....కానీ లక్ష్మణరావు నీ వదినను పెళ్ళిచేసుకుందుకు సిద్ధంగా వున్నాడు. అది చాలా మంచి పని కదా! ఒప్పుకుంటావా?"

"నా వదిన తనకూ వదినే అన్నాడు. వదినను తాను పెళ్ళిచేసుకోవచ్చా?"

"ఈ వావివరుసలు అర్థంలేనివి. మనం చూడాల్సినది నీ వదిన భవిష్యత్తు. ఆమె లక్ష్మణరావును భర్తగా ఆదరించగలిగితే—నూరేళ్ళ జీవితం చక్కబడుతుంది."

"కానీ—అన్నయ్య ఆత్మ...."

"లేని అన్నయ్య గురించి వున్న వదినను బాధ పెట్టడం అన్యాయం! అన్నయ్య మంచివాడైతే—వదిన రెండో పెళ్ళికతడి ఆత్మ తృప్తిచెందుతుంది. అతడు చెడ్డవాడైతే-అతడి ఆత్మ గురించి పట్టించుకోనవసరంలేదు.."

గోపాల్రావాలోచనలో పడ్డాడు.

"ఆలోచించి చూడు. నీకంటే చాలా చిన్నది నీ వదిన. నీ అన్నతో పెళ్ళయినంతమాత్రాన ఆమె వయసు

మారిపోదు. అన్న వుంటే అది వేరే విషయం. అన్న పోయాక ఆమెను వదినగా కాక—అమాయక, అసహాయ స్త్రీగా భావించాలి.... ఆమె సుఖానికడ్డు రాకూడదు...."

గోపాల్రావాలోచనలో పడ్డాడు.

"మిష్టర్ గోపాల్రావ్! నీది నూరేళ్ళ జీవితం. అన్నయ్య గురించీ వదిన గురించి ఆలోచిస్తూ—నీ జీవితం పాడుచేసుకోకు. లక్ష్మణరావు నీ వదినను పెళ్ళిచేసుకుంటేనేం — లేకపోతేనేం? అనవసరంగా హత్యా ప్రయత్నాలుచేస్తే నీ నూరేళ్ళ జీవితం పాడైపోతుంది. నువ్వే లేకుండా పోతావు...." అన్నాడు వెంకన్న.

"ఏమిటి మీరనేది?"

"నువ్వు లక్ష్మణరావు ప్రాణాలు తీయాలనుకోకు...." అన్నాడు వెంకన్న.

గోపాల్రావు మాట్లాడలేదు.

"లక్ష్మణరావుకేమైనా అయితే—తొలి అనుమానితుడివి నువ్వే అవుతావు. మర్చిపోకు...." అన్నాడు వెంకన్న.

"గుర్తుంచుకుంటాను...." అన్నాడు గోపాల్రావు.

## 4

బ్యాంక్ మేనేజర్ వెంకన్నకు సాదరంగా సీటు చూపించాడు.

"ఇటీవల ప్రమాదవశాత్తు మరణించిన గోవిందరావు గురించి తెలుసుకుందామని వచ్చాను—" అన్నాడు వెంకన్న.

"మనిషి మంచివాడు. నెమ్మదస్తుడు. గుడ్ వర్కర్."

"అతడి గురించి ఇంకేమైనా పనికొచ్చే విశేషాలు చెప్పగలరా?"

మేనేజరు ముందుకు వంగి స్వరం తగ్గించి — "ఒక ముఖ్య విశేషముంది. తను పోతానని అతడికి ముందే తెలుసని నా అనుమానం...." అన్నాడు.

వెంకన్న ఆశ్చర్యంగా "చెప్పండి-" అన్నాడు.

"అర్ధాంతరంగా బ్యాంకు ఉద్యోగిపోతే—యెలాంటి సదుపాయాలున్నాయో నన్నడిగి తెలుసుకుంటూండే వాడు. ఒకసారైతే డైరెక్టుగానే—ప్రమాదవశాత్తు నేను పోయాననుకోండి—నా ఉద్యోగం నా భార్యకు వస్తుందా—తమ్ముడికొస్తుందా?—అనడిగాడు. నేనతణ్ని లాంటి ప్రశ్నలు వేయొద్దని మందలించాను. అయినా అతడు రూలు తెలుసుకునేదాకా వదలలేదు...."

"ఇంతకీ రూలేమిటి?"

"మాది నేషనలైజ్ బ్యాంకు కాదు. అయితే ఉద్యోగులకు బలమైన యూనియనుంది. మా మేనేజ్మెంట్ రూల్సు పాటించతీరాలి. రూలు ప్రకారం—ఒక ఉద్యోగి సర్వీసు కాలంలో మరణిస్తే—అతడి ఉద్యోగం—అతడి కొడుక్కివ్వాలి. పిల్లలు లేకుంటే భార్య కివ్వాలి. అర్హతలు లేకపోతే—వారి అర్హతకు తగిన ఉద్యోగమేదో ఒకటివ్వాలి...."

"రూలు తెలుసుకొని గోవిందరావేం చేశాడు?"

"భార్యకాకుండా తమ్ముడికే ఉద్యోగం వచ్చే ఏర్పాటుండదా అనడిగాడు. అప్పుడో రూలు చెప్పాను. దాని ప్రకారం—ఉద్యోగం అతడి భార్యకే కాకుండా ఆమె సూచించిన అతడి రక్తసంబంధీకుల కెవరికయినా యివ్వవచ్చు. అయితే జీతంలో సగానికి సగం డైరెక్టుగా అతడి భార్యకే అందజేయబడుతుంది. ఆ తర్వాత ఆమె ఆ రక్తసంబంధీకుడి పోషణలో ఉండాలి తప్ప వేరే

వివాహం చేసుకోకూడదు...."

"ఇది అన్యాయం కదా—ఒక విధవరాలి వివాహం గురించి శాసించే హక్కు మీ బ్యాంకు కుందా?" అన్నాడు వెంకన్న.

మేనేజరు రూలును మరింత తుణ్ణంగా వివరించాడు.

రూలు ప్రకారం ఉద్యోగం సరోజది. ఆమె వివాహం చేసుకుందుకు బ్యాంకు అభ్యంతరం పెట్టదు. సరోజకు బదులు మరో వ్యక్తికి ఉద్యోగమిస్తున్నామంటే అర్ధమేమిటి? ఉద్యోగం ఆమె కోసం. అతడికోసం కాదు. ఆమె వివాహం చేసుకుందంటే అర్ధం — ఉద్యోగం ఆమెకు అవసరం లేదని. లేదా అత్తమామలు సెంటిమెంట్లతో మొహమాట పెట్టి—బలవంతం పెట్టారని!

"అర్ధమయింది—" అన్నాడు వెంకన్న—"ఈ వివరాలన్నీ ఎందుకడుగుతున్నాడో మీరడగలేదా?"

"అడిగాను. ఊరికే కుతూహలం అన్నాడు. తనకు జీవితమెంతో బాగుందనీ—తన శాత్మహత్య చేసుకోవాల్సిన అవసరం లేదనీ కూడా అన్నాడు. అదీ నిజమే ననిపించింది. పెద్దగా బాధ్యతలేమీ లేవు. పెళ్ళయ్యింది...."

"అతడు సంతోషంగా ఉన్నట్లు కనిపించేదా?"

"చెప్పడం కష్టం.... కానీ మనిషి కాస్త దిగులుగానే ఉండేవాడని నాకు తోచేది. స్వతహాగా మనిషి నెమ్మదస్తుడు. చలాకీతనం తక్కువ...."

"మీ ఆఫీసులో అతడితో యెవరైనా క్లోజ్ గా మూవౌతారా?"

"అతడు బాగా యెక్కువగా దిలీప్ తో తిరుగుతాడు..."

"నేను దిలీప్ తో మాట్లాడాలి—" అన్నాడు

వెంకన్న.

"ఇక్కడే మాట్లాడుతారా? ..."

"లేదు. బైటకు తీసుకుని వెడతాను. ఓ గంట పర్మిష నివ్వండి...."

"సరే—" అని మేనేజర్ ఇంటర్ కాంలో వెంకన్న గురించి దిలీప్ కు చెప్పాడు.

"ఇంకొక్క ప్రశ్న అడుగుతాను. ఇప్పుడు గోవింద రావు ఉద్యోగం పొజిష నేమిటి?...." అన్నాడు వెంకన్న.

"అతడి తమ్ముడు గోపాల్రావు కా ఉద్యోగం ఇవ్వాల్సిందిగా సరోజ సిఫారసు చేసింది. తానతడి పోషణలో ఉంటానందామె...."

"అతడి ఉద్యోగం వచ్చాక ఆమె పెళ్ళి చేసుకుంటే...."

"మామూలుగా అయితే రెండేళ్ళు ప్రొబేషన్. ఈ కేసులో అయిదేళ్ళుంటుంది. ఆమె వివాహం జరిగితే— గోపాల్రా వుద్యోగం పోతుంది. అయిదేళ్ళవరకూ ఆమెకు వివాహం కాకూడదు...."

"చాలా యూజ్ ఫుల్ యిన్ఫర్మేషన్. మెనీ మెనీ థాంక్స్—" అంటూ లేచాడు వెంకన్న.

"అసలు మీ రిదంతా యెందుకు పరిశోధిస్తున్నట్లు? ఏమైనా తిరకాసుందా?" అన్నాడు మేనేజరు కుతూహలంగా.

"జరిగిందాంట్లో తిరకాసేమీ లేదు. భవిష్యత్తులో తిరకాసు తెలుసుకోవాలని నా ప్రయత్నం. గోపాల్రావు ఉద్యోగం ఎప్పుడొస్తుంది?"

"బహుశా మాసో నెలరోజులు పడుతుంది...."

అన్నాడు మేనేజరు.

వెంకన్న అక్కణ్ణించి కదిలాడు. అయితే మేనేజరుకి అతడితో ఇంకా మాట్లాడాలనే వుంది. ఒక డిటెక్టివ్‌తో మాట్లాడే అవకాశం ఆయనకు మొదటిసారిగా లభించినట్లుంది.

## 5

పార్కులో దిలీప్, వెంకన్న ఒకరికొక రెదురుగా కూర్చున్నారు.

“మీ గురించి చాలా విన్నాను. మీ వంటి గొప్ప వారితో మాట్లాడే అవకాశం వచ్చింది. నే నదృష్ట వంతుణ్ణి—....” అన్నాడు దిలీప్.

“మీ అదృష్టం మీరు తెలుసుకున్నారు. నా అదృష్ట మెలాగుందో?....” అన్నాడు వెంకన్న అదోలా.

దిలీప్ ముఖం చిన్నబోయింది—“అంటే?” అన్నా డతడు.

“మీ నుంచి యేదో పనికొచ్చే సమాచారం లభిస్తుం దని నా ఆశ. ఆశ నెరవేరాలంటే అదృష్టముండాలి కదా!” అన్నాడు వెంకన్న. అతడిక ఆట్టే తాత్సారం చేయకుండా గోవిందరావు గురించి వివరాలడిగాడు. నలుగురూ చెప్పినవే అతడూ చెప్పాడు.

వెంకన్న నిట్టూర్చి—“మీ ఇద్దరూ బాగా క్లోజ్‌గా తిరుగుతారని విన్నాను. అతడు మీకేమీ తన గురించిన ప్రత్యేక విశేషాలేమీ చెప్పినట్లు లేదు. నలుగురూ చెప్పి నవే మీరూ చెప్పారు—” అన్నాడు.

“ప్రత్యేక విశేషాలంటే?”

“సంసారజీవితం గురించి....”

దిలీప్ చటుక్కున—“నా కో ముఖ్య విశేషం

తెలుసు. కానీ యిప్పుడు చెప్పి గోవిందరావుకు కీడ్డ పేరు తేవడ మిష్టంలేదు నాకు—" అన్నాడు.

వెంకన్న బలవంత పెట్టగా అతడు చెప్పిన విశేష మేమిటంటే....

గోవిందరావుకీ భార్యకీ వయసులో పదేళ్ళు తేడా ఉంటుంది. ఇంకా కాస్త యెక్కువున్నా ఆశ్చర్యంలేదు. అతడికి భార్య బాగా చిన్నపిల్లలా తోచేది. ఆమెతో అతడికంత తృప్తిలేదు. తనకు తగిన వయసు పిల్లతో సంపర్కం పెట్టుకోవాలని అతడికుండేది. ఆ సందర్భంగానే అతడికి దిలీప్‌తో చనువు పెరిగింది.

దిలీప్ వయసు పాతిక్కీ ముప్పైకీ మధ్య. అతడు బ్రహ్మచారి. కుటుంబ పరిస్థితుల కారణంగా అతడు వివాహాని కింకా కనీసం రెండు సంవత్సరాలాగాలి.

దిలీప్‌కి పవిత్రత పట్టింపులేదు. అతడికి కాల్‌గర్ల్సతో సంబంధా లున్నాయి.

గోవిందరావు వేశ్యలతో సంపర్కం పెట్టుకుందుకు భయపడి దిలీప్ సాయం కోరాడు. దిలీప్ ఒక బ్రోకరు అడ్రసిచ్చాడు. అతడిద్వారా గోవిందరావొకే ఒక్కసారి ఓ కాల్‌గర్ల్‌ను కలుసుకున్నాడు. తర్వాత అతడు దిలీప్‌నే అడిగాడు—డాక్టరు కావాలని!

సుఖవ్యాధుల స్పెషలిస్టు—డాక్టర్ తరుణ్ పేరు దిలీపే గోవిందరావుకు సూచించాడు. గోవిందరావు చాలా తరచుగా డాక్టర్ని కలుసుకుంటూండేవాడు.

"పాపం—అంతా మీ మూలంగా వచ్చిందన్న మాట...." అన్నాడు వెంకన్న.

"వెంకన్నగారూ! ఇందులో నా తప్పేమీ లేదు. నేను తెలుసుకున్న నిజమొకటుంది. గోవిందరావుకు

సంసార జీవితంలో యేదో అసంతృప్తి వుంది. నా అనుమాన మేమిటంటే—అతడు కాల్‌గర్ల్‌ను కలుసుకోక మునుపే సుఖవ్యాధులున్నాయి. నా ఊహ ప్రకారం వివాహమైనాకే అతడికి సుఖవ్యాధులు సోకాయి. అది బయటకు చెప్పుకోలేడు. ఏ స్పెషలిస్టునైనా సంప్రదిస్తే నా బోంట్లకు తెలిసే అవకాశముంది.

ఆ అవమాన నుంచి తప్పించుకుందుకతడు కాల్‌గర్ల్‌ని సాకుగా తీసుకున్నాడని నా అనుమానం. అతడి సుఖవ్యాధికి కారణం కాల్‌గర్ల్ అని నేననుకోవాలని అతడు తాపత్రయపడ్డాడు. తర్వాత డాక్టర్ తరుణ్‌ని కలుసుకోసాగాడు. ఈ విషయమై నేను వివరా లడగలేదు....”

వెంకన్న దిలీప్ ఆలోచనాసరళిని మెచ్చుకుని—“చాలా బాగా ఊహించారు. వివాహమైనాక గోవిందరావుకు సుఖవ్యాధులు వచ్చేయంటారా? లేక వివాహం కాగానే ఆ వ్యాధి తన ద్వారా భార్యకు సంక్రమించకూడదన్న అభిప్రాయంతో అతడు డాక్టర్ని కలిశాడంటారా?” అన్నాడు.

“గోవిందరావు నాలాంటివాడు కాదు. నా అనుమానం అతడికి సుఖవ్యాధి భార్య ద్వారానే సంక్రమించిందని!....”

వెంకన్న ఆశ్చర్యంగా—“ఆమె మీకు తెలుసా?” అన్నాడు.

“ఆమెను నే నెప్పుడూ చూడలేదు. నాకూ గోవిందరావుకూ ఆఫీసులో మాత్రమే పరిచయం. బయట మే మెప్పుడూ కలుసుకోలేదు. కానీ వివాహమైనప్పట్నించీ గోవిందరావులో కొత్త దిగులు ప్రారంభమైందని చెప్ప

గలను...."

"మీరెప్పుడయినా డాక్టర్ తరుణ్‌ని కలిశారా?...."

"ఇప్పటికి నాలుగుసార్లు నాకాయన అవసరమొచ్చింది. చాలా మంచి డాక్టరాయన. ఆయన సలహాలు నా బోటి బ్రహ్మచారులకు వరం...."

"ఆయన అడ్రసు నాక్కావాలి...."

దిలీప్ చెప్పగా వెంకన్న ఆ అడ్రస్ నోట్ చేసుకున్నాడు.

## 6

డాక్టర్ తరుణ్‌కి ఓ పట్టాన గోవిందరావు యెవరో అర్థంకాలేదు. అలాంటి మనిషెవరూ తన వద్దకు రాలేదనే అతడన్నాడు.

వెంకన్న చివరకు గోవిందరావు ఫోటో చూపించాడు. ఆ ఫోటో నతడు గోవిందరావింటికి వెళ్ళి తలిదండ్రుల నడిగి తెచ్చుకున్నాడు.

ఫోటో చూడగానే—"ఇతడా?" అన్నాడు డాక్టర్ తరుణ్.

"హమ్మయ్య—ఇతడు మీకు తెలుసు గదా—" అన్నాడు వెంకన్న.

"తెలుసు. కానీ మీరన్నట్లితడికి సుఖవ్యాధులేమీ లేవు...."

"మరి—అతడికి మీతో అవసరమేమిటి?"

"నా క్లయింట్స్‌కు సంబంధించిన విశేషాలు రహస్యంగా ఉంచాలి...."

"డియర్ డాక్టర్—అతడికి లేదు, అతడి చావో

విచిత్ర పరిస్థితుల్లో సంభవించింది. నేనది పరిశోధిస్తున్నాను. మీరు చెప్పే వివరాలు వాటి సహాకరిస్తాయి....”

“మైగాడ్—అతడు పోయాడా? ఎలా?....”

వెంకన్న క్లుప్తంగా గోవిందరావు చావు గురించి చెప్పాడు.

“పాపం—అయితే యిది ఆత్మహత్యేమో.... ...” అన్నాడు తరుణ్.

“ఎందుకని?”

“అతడికి వివాహమైంది. భార్యంటే యెంతో యిష్టం. కానీ అతడామెను తృప్తిపరచలేక పోయేవాడు ...”

“అతడు నపుంసకుడా?”

“కాదు. అతడిలో పరిపూర్ణ ఆరోగ్యముంది. ఏ లోపమూ లేదు....”

“మరి?”

“నే నతణ్ణి చాలా ప్రశ్నలు వేశాను. అతడి సమస్య మానసికం....”

“మానసికమంటే?”

డాక్టరు వివరించిన ప్రకారం—గోవిందరావుకు స్త్రీలంటే భయం. ఒక రకమైన కాంప్లెక్సుతో పెరిగాడు. ఇంట్లో అంతా డబ్బు మనుషులు. తల్లి అతడికోసం చాలా పెద్ద సంబంధాలు చూసింది. అతడి ఆర్థిక పరిస్థితి మరీ గొప్పదికాక ఆ సంబంధాలు కుదరలేదు. ఒకటి రెండు మధ్యతరగతి సంబంధాలలో—ఆమె కట్న మెక్కువ అడిగితే ఓ ఆడపిల్ల దై గట్టిగా అతడి వ్యక్తిత్వాన్ని నిరసించి—యింత కట్నం పుచ్చుకునే అర్హత నీ కుందా

అనడిగింది. అలా అలా అతడి వివాహం ఆలస్యమయింది.

వయసు రేపే కోరికలు, వివాహం జరగదన్న బెంగ, కొందరాడపిల్లల నిరసన—అతణ్ని మానసికంగా దెబ్బతీశాయి. వివాహమయింది. మనసులోని అనుమానం పెనుభూతమయింది. తన అసమర్థత కతడు కృంగిపోసాగాడు. దానికి తోడు తలిదండ్రులు అతణ్ని భార్యకు వ్యతిరేకంగా ప్రోత్సాహిస్తున్నారు. వారి మాటను కాదనలేక ఆమెను వేధించలేక—అతడి అసమర్థత ఇంకా పెరిగింది. అతడి కామె అంటే భయం ప్రారంభమయింది.

తన శక్తి సామర్థ్యాలను పరీక్షించుకుందుకతడు కాల్ గర్ల్ని కలిశాడు. ఏమీ మార్పులేదు. తర్వాత డాక్టర్ని కలిశాడు. డాక్టరతనికి మానసికంగా బల మివ్వాలని చూశాడు. ఇంట్లో తలిదండ్రులు మారాలి. వాళ్ళు మారలేదు. చివరికది గోవిందరావు చావుకు దారితీసింది.

వెంకన్న ఆశ్చర్యంగా—"నే ననుకున్న దొకటి—తెలుసుకున్న దొకటి—" అని అక్కణ్నించి లేచాడు.

## 7

సైకియాట్రిస్టు సచ్చిదానంద—ఏదో కేసు చూస్తున్నాడు. అందువల్ల వెంకన్న అక్కడ అరగంటసేపు ఎదురుచూడాల్సి వచ్చింది. తర్వాత సచ్చిదానంద వెంకన్నకు సారీ చెప్పుకున్నాడు.

"నేనే మీకు సారీ చెప్పాలి. మీ వ్యాపారానికి అంతరాయం కలిగించాను—" అన్నాడు వెంకన్న.

"మీవంటివారితో కాసేపు మాట్లాడితే నా మెదడు పదునెక్కుతుంది. అది నా వృత్తికెంతో మంచిది ..." అన్నాడు సచ్చిదానంద.

"థాంక్స్ ఫర్ యువర్ కాంప్లిమెంట్ .... నేను మీ క్లయింట్ ........గోపాల్రావు గురించి మాట్లాడాలని వచ్చాను...." అన్నాడు వెంకన్న.

"ష్యూర్ — మీకేం సమాచారం కావాలో అడగండి. చెబుతాను—" అన్నాడు సచ్చిదానంద గౌరవాభిమానాలతో.

"గోపాల్రావు గురించి మీ అభిప్రాయమేమిటి?"

"విచిత్రమైన కేసతడిది. సాధారణంగా నార్మల్ గా ఉంటాడు. ఉన్నట్లుండి అతడికేదో ఆవేశం ప్రకోపింప జేస్తుంది. అలాంటప్పుడతడు చాలా ప్రమాదకారి. నేనతణ్ని పరీక్షించి తెలుసుకున్నదేమిటంటే అతడు మనిషి స్వతహాగా మంచివాడు. చెప్పాలంటే చాలా మంచివాడు, ఆవేశంలో ఉన్నప్పుడు తనేం చేస్తున్నాడో అతడికే తెలియదు. అలాంటప్పుడతడిని ఆకర్షణతో, మంచి మాటలతో లొంగదీయాలి. అతడు పురుషుడు కాబట్టి—అతడి నాకర్షించి లొంగదీయడం స్త్రీకే సాధ్య పడుతుంది....అందుకే నేనతడి తలిదండ్రులకు సూచించాను—వివాహం చేయమని....!" అన్నాడు సచ్చిదానంద.

"వివాహమే ఎందుకు? అతణ్ని ముందుగా ఏ వేశ్యా సంపర్కానికో గురిచేసి ప్రయోగ ఫలితం చూడవలసింది...." అన్నాడు వెంకన్న.

"సమస్యేమిటంటే — గోపాల్రావుకు స్త్రీ వ్యామోహం లేదు. అది క్రమంగా అలవడాలి. అందుకే వివాహం సూచించాను నేను...."

గోవిందరావు మరణం గురించి వెంకన్న అప్పుడు సచ్చిదానందకు చెప్పాడు.

"విన్నాను. చాలా విచారకరమైన విషయం...."

"గోపాలరావు తన్ను అన్నగారని తనకు తెలియకుండా నే మతివిభ్రమితంలేని ఆవేశంలో చంపేసే అవకాశముందా?" అన్నాడు వెంకన్న.

సచ్చిదానంద ఆశ్చర్యంగా—"ఏమన్నారు మీరు?" అన్నాడు.

వెంకన్న తన ప్రశ్నను రిపీట్ చేశాడు.

"మీ కీ అనుమానమెందుకొచ్చింది?"

"నేను డిటెక్టివ్‌ను. అన్ని కోణాల నుంచీ ఆలోచించడంలో — యిలాంటివన్నీ స్ఫురిస్తూంటాయి...." అన్నాడు వెంకన్న.

"ఫర్ హెవెన్స్ సేక్ .... మీరు గోపాల్రావు ననుమానించకద్దు, అతడిప్పుడు నార్మల్ మనిషి...." అన్నాడు సచ్చిదానంద.

"వివాహమైతే కానీ అతడు నార్మల్ కాడని మీరే అన్నారు...."

"అన్నాను. కానీ అతడి అన్నగారి వివాహమైనాక— కొద్దికాలంలోనే అతడిలో గొప్ప మార్పొచ్చింది. చెప్పాలంటే అది అపూర్వం..."

"ఎలా వచ్చిందంటారు?"

"ఆలోచిస్తే ఊహించడం కష్టంకాదు...."

"నా ఊహకేమీ స్ఫురించడంలేదు—" అన్నాడు వెంకన్న.

"నేను నమ్మను—...." అన్నాడు సచ్చిదానంద నవ్వుతూ.

"గోపాల్రావు తన వదినతో సంబంధం పెట్టుకున్నాడన్న మీ ఊహను నేనూ నమ్మలేను...." అన్నాడు

వెంకన్న.

"కానీ అది నిజం...."

"ఎలా తెలుసు మీకు?"

"గోపాల్రావు మొదట్లో నాకు నిజం చెప్పే వాడు.....''

"ఏమిటా నిజం?"

సరోజకు భర్తంటే కోపం కావచ్చు. లేదా అత డసమర్థుడు కావచ్చు. ఏ కారణంవల్లనైతే నేం ఆమె గోపాల్రావును ఆకర్షించడానికి రహస్యంగా ప్రయత్నించి విజయం సాధించింది. ఆమె పరిచయం గోపాల్రావులో మార్పు తీసుకుని రాసాగింది. అప్పుడప్పుడు సచ్చిదానందకు జరిగింది చెబుతూండేవాడు. తన క్లయింట్ బాగు పడుతున్నందుకు సచ్చిదానంద సంతోషించి అతడినందుకు ప్రోత్సహించాడు.

క్రమంగా గోపాల్రావు పూర్తి నార్మల్ అయ్యాడు. అప్పుడతడిలోని సంస్కారం, సంప్రదాయం మేల్కొన్నాయి. తను తప్పు చేస్తున్నానని అతడు గ్రహించి సచ్చిదానంద దగ్గర ఏడ్చాడు.

"నువ్వు తప్పు చేయలేదు. నీలో రుగ్మత వుంది. దానికి మందు కావాల్సొచ్చింది. నీ అన్న నా సలహా మీద నీ వైద్యానికి తన భార్యనుపయోగించాడు. నీ విప్పుడు మామూలు మనిషివి. జరిగింది మర్చిపో. మామూలుగా జీవితం కొనసాగించు...." అని సచ్చిదానంద అతడికి సలహా యిచ్చాడు.

"నాకు వివాహం చేసుకోవాలనుంది. అన్నయ్యలా ఉద్యోగం చేయాలనుంది....కానీ....నాకుద్యోగం దొరకదు. వేరే స్త్రీని నేను వివాహం చేసుకోలేను. జరిగిన

తప్పును నేను మరిచిపోలేక పోతున్నాను—" అన్నాడు గోపాలరావు.

ఆ తర్వాతనుంచి అతడు తన వదిన దరిదాపులక్కూడా వెళ్ళలేదు.

"దీన్నిబట్టి స్పష్టంగా తెలుస్తోంది. అన్న మరణిస్తే గోపాలరావుకుద్యోగం వస్తుంది. వదిన్ని పెళ్ళిచేసుకో వచ్చు. కాబట్టి అతడే ప్రమాదాన్ని సృష్టించి అన్నను చంపేసి ఉంటాడని నా అనుమానం...."

"డియర్ డిటెక్టివ్! ఆ అన్నదమ్ములిద్దరూ ఒకరి కోసం ఒకరు ప్రాణాలిస్తారు. ఆ సంగతి నాకు తెలుసు. గోవిందరావు తమ్ముడి వైద్యంకోసం—నా దగ్గర ఒక్క నాగాకూడా పెట్టలేదు.... ఈ వైద్యం కారణంగా వారి కుటుంబానికి బాగా ఖర్చయినా భరిస్తున్నాడతడు.... ఆవేశంలో ఉన్నప్పుడే అన్న నేమీ చేయలేదు గోపాలరావు. ఇప్పుడు నార్మల్ గా ఉన్నప్పుడెందుకు హత్యచేస్తాడు?" అన్నాడు సచ్చిదానంద.

"అయితే గోవిందరావే తమ్ముడికోసం త్యాగంచేసి ఉండాలి..." అన్నాడు వెంకన్న. అతడు సచ్చిదానంద అభిప్రాయం గురించి ఎదురు చూడకుండా అక్కణ్ణించి కదిలాడు.

సచ్చిదానంద చెప్పింది విన్నాక ఎన్నో రహస్యాలు ఛేదించబడినట్లే ఫీలయ్యాడు వెంకన్న.

# 8

డిటెక్టివ్ వెంకన్న యిల్లు చేరుకునేసరి కింట్లో ఎదురు చూస్తున్నాడు గోపాలరావు.

"ఎంత సేపయింది వచ్చి?" అన్నాడు వెంకన్న.

"గంటంపావు—" అన్నాడు గోపాలరావు.

వెంకన్న తన అసిస్టెంట్సు వంక చూశాడు.

"వచ్చి—గంట పదహారునిముషాలయింది—" అంది సీతమ్మ.

రాజమ్మ వెంకన్నకో కాగితం అందించి—"ఇవి నేను సేకరించిన సమాచార విశేషాలు—" అంది.

వెంకన్న ఆ వివరాలు చదువుతున్నాడు. తర్వాత గోపాల్రావుతో—"నాతో యేదైనా పని పడిందా?" అన్నాడు.

"అవును. మీకో ముఖ్య విశేషం చెప్పాలని వచ్చాను...." అన్నాడతడు.

వెంకన్న మరోసారి తన అసిస్టెంట్సు వంక చూసి—"మిస్టర్ గోపాల్రావ్! నీతో ఏకాంతంగా మాట్లాడాలి. ఇక్కడ కాదు..." అన్నాడు.

ఇద్దరూ పక్కనే వున్న గదివైపు నడిచారు.

సీతమ్మ, రాజమ్మ తామూ లేవబోయారు.

"డియర్ గర్ల్స్—మీరు వినకూడదనే మేము పక్క గదిలోనికి వెడుతున్నాం..." అని నవ్వాడు వెంకన్న.

సీతమ్మ, రాజమ్మ తిరిగి తమ సీట్లో సర్దుకున్నారు.

గదిలోకి వెళ్ళాక వెంకన్న తలుపువేసి—"చెప్పు—" అన్నాడు.

"లక్ష్మణరావు మంచివాడు కాదు. సరోజ నతడు మోసం చేస్తాడు—...." అన్నాడు గోపాల్రావు.

వదిన అనడానికి బదులు సరోజ అనడం—వెంకన్నకు రవంత ఆశ్చర్యాన్ని కలిగించినా—"ఎలా తెలుసు నీకు?" అన్నాడు.

"తెలుసుకోవాలంటే మీకూ సాధ్యపడుతుంది. శాంసన్ అండ్ కంపెనీలో టైపిస్టుగా పని చేస్తున్న లీల

నడగండి— చెబుతుంది...."

"ఏమని?"

"ఆమె నతడు పెళ్ళి చేసుకుంటా నని మాటిచ్చాడు—...."

వెంకన్న ఆశ్చర్యంగా—"సరోజ పెళ్ళి జరిగిందని తెలిసేక నేమో—", అన్నాడు.

"కాదు—రెండ్రోజుల క్రితం.... వారి మధ్య ప్రేమాయణం రెండేళ్ళుగా కొనసాగుతోంది...."

"రెండ్రోజుల క్రితమా—....అయితే అతడు నీ బెదిరింపులకు భయపడ్డా డేమో—...." అన్నాడు వెంకన్న.

"నేనెవర్నీ బెదిరించలేదే!" అన్నాడు గోపాల్రావాశ్చర్యంగా.

"బుకాయించకు....ఇప్పటికి నీ వతడిమీద రెండు హత్యాప్రయత్నాలు చేశావు...." అంటూ వెంకన్న అతడికా వివరాలు చెప్పాడు.

"ఎలా తెలిశాయి మీ కివి?" అన్నాడు గోపాల్రావాశ్చర్యంగా.

"నా పద్ధతులు నా కున్నాయి... నీ గురించి మొత్తం వివరాలన్నీ నేను తెలుసుకున్నాను—...." అన్నాడు వెంకన్న.

"ఏమిటవి?"

"నీ తలిదండ్రుల ప్రవర్తన—నీ అన్నను మానసికంగా బలహీనుణ్ణీ, సెక్సుపరంగా అసమర్థుణ్ణీ చేసింది. ఆ కారణంగా సరోజ నీతో అక్రమసంబంధ మేర్పరచుకుంది. మొదట్లో యేమనుకున్నా క్రమంగా నీలో పాపభీతి యేర్పడి సరోజకు దూరంగా ఉండసాగావు. నీ అన్నకు

మీ గురించి తెలిసింది. ఏం చేయాలో తెలియని పరిస్థితుల్లో జీవితమంటే విరక్తి పుట్టి ఆత్మహత్య చేసుకున్నాడు. నీ అన్న ఆత్మహత్యెందుకు చేసుకున్నాడో నీకు తెలుసు. అందుకే నీ అన్న చావుకు నీవే కారణమని బాధపడుతున్నావు. అవునా?"

"వెంకన్నగారూ! మీరు చెప్పింది నిజం. మీరు చాలా విశేషాలు తెలుసుకున్నారు. నేనిప్పుడేం చేయాలో కూడా మీరే చెప్పండి...."

వెంకన్న నవ్వి—"నిన్ను కలుసుకున్నప్పుడు లక్ష్మణరావుమీద నెపంవేసి అడుగుతున్నవన్నీ నీ గురించేనని నాకు తర్వాత అర్థమయింది...." అన్నాడు.

"మీతో మాట్లాడినప్పుడు నాకు మానసికంగా కొంత తృప్తి కలిగింది.... మీ సలహా పాటిస్తాను. నేనేం చేయాలో చెప్పండి...." అన్నాడు గోపాల్రావు.

"నీ అన్న చావుకు కారణమెవరో తెలుసా?"

"నేను—లేక వదిన!"

"కాదు—నీ తలిదండ్రులు...." అన్నాడు వెంకన్న "ఏ సంప్రదాయం వారినలా తయారుచేస్తున్నదీ తెలియదు. ఇలాంటి తలిదండ్రులు చాలా కుటుంబాల్లో వున్నారు-... వారికి బిడ్డల సుఖసంతోషాలతో నిమిత్తం లేదు. అన్నింటికీ మించి డబ్బు కావాలి. కోడళ్ళను కష్టపెట్టాలి. కొడుకు అత్తమామలనుంచి డబ్బు గుంజాలి. ఆ ప్రయత్నంలో—కన్నకొడుకేమైపోతున్నాడో కూడా వారు గ్రహించరు. జీవితంలో సుఖపడాలంటే నువ్వు నీ తలిదండ్రులకివ్వాల్సినంత గౌరవం మాత్రమే యిచ్చి-నీ వ్యక్తిగత విషయాల్లో జోక్యం చేసుకోకుండా ఆపాలి...."

"మీమాట పాటిస్తాను...." అన్నాడు గోపాలరావు.

"అయితే నువ్వు సరోజను పెళ్ళిచేసుకో" అన్నాడు వెంకన్న.

గోపాలరావు మాట్లాడలేదు. అతడి కళ్ళు మెరిశాయి.

*  •  *

గోపాలరావిలా వెళ్ళగానే—అలా ఓ ఫోన్ కాల్ వచ్చింది వెంకన్నకు.

"హలో—వెంకన్నగారూ—సరిగ్గా పదినిమిషాల క్రితం నామీద హత్యాప్రయత్నం జరిగింది. ఈసారి సరాసరి గోపాలరావే నా యింట్లో నన్ను కత్తితో పొడవాలని ప్రయత్నించాడు. వెంట్రుకవాసిలో తప్పించుకున్నాను. మీరే నన్నలాగో రక్షించాలి...." అన్నాడు లక్ష్మణరావు.

"లక్ష్మణరావుగారూ! మిమ్మల్ని నేను రక్షించాను. నా ఫీజుగా మరో అయిదువందలు తీసుకురండి...." అన్నాడు వెంకన్న.

"అంటే?" అన్నాడు లక్ష్మణరావాశ్చర్యంగా.

"ఓ గంటనుంచీ గోపాలరావు నాతో మాట్లాడుతున్నాడు. ఇంకా ఇక్కడే వున్నాడు. ఇది మొదటి విషయం. ఇక రెండో విషయం—మీరు సరోజ నొచ్చుకుంటుందని లేనిపోని అసత్యాలు సృష్టించకండి. గోవిందరావు మరణం మిమ్మల్ని చాలా యిబ్బందిలో పెట్టింది. అయినా భయపడకండి. సరోజ గోపాలరావుని వివాహం చేసుకుంటుంది. మీరు లీలని పెళ్ళిచేసుకోవచ్చు..."

"లీల....లీల గురించి మీకెలా తెలుసు?"

"నేను డిటెక్టివ్ వెంకన్నను—" అని ఫోన్ పెట్టేశాడు వెంకన్న.

అంతవరకూ గోపాలరావింకా అక్కడే ఉన్నాడంటారేమిటా అని అంటూ యిటూ చూస్తున్న అసిస్టెంట్లు సీతమ్మకూ, రాజమ్మకూ కూడా అతడిమాటే సమాధానంగా తోచింది.

—: అయిపోయింది :—

# మాటువేసిన మృత్యువు

## కె.వి.యస్.యస్. మూర్తి

అర్థరాత్రి పన్నెండు గంటలు కావస్తోంది.

ఆ ప్రాంతం అంతా చిక్కగా చీకటి పరుచుకొని వుంది. కీచురాళ్ళ రొద భయంకరంగా వినిపిస్తోంది.

నెమ్మదిగా అడుగులు వేస్తూ ముందుకు వెళుతున్నాడతను.

పచ్చటి శరీర ఛాయ, ఆరడుగుల రెండంగుళాల ఎత్తు, కసరత్తు చేయుటంవలన కండలు తిరిగిన శరీరం, వంకీలు తిరిగిన వత్తయిన జుత్తు, అందరినీ ఆకట్టుకునేలా వుండే కళ్ళు. అతని కళ్ళు—కనుబొమలక్రింద దివిటీల్లా మెరుస్తాయి. అతడి చూపులు ఎదుటి మనిషిలోంచి దూసుకుపోతోంటాయి. తన చుట్టూ వుండే ప్రతి కదలికను ఇట్టే పసికడతాయి—అతని కళ్ళు.

వీధి దీపపు కాంతి సన్నగా రోడ్డుమీద పడుతోంది. ఆ దీపపు కాంతి తనమీద పడకుండా తప్పించుకుంటూ ముందుకు వెళ్ళాడతను. చిన్న పెంకుటింటిముందు ఆగాడు.

నెమ్మదిగా యింటి వెనకకు వెళ్ళాడు. మునివ్రేళ్ళతో దొడ్డిగుమ్మపు తలుపుమీద మూడుసార్లు సున్నితంగా కొట్టాడు.

ఆ శబ్దంకోసమే కాచుకున్నట్లుగా, అప్పటివరకు మూసుకొని వున్న తలుపులు ఒక్కసారిగా తెరుచుకున్నాయి. తలుపు వెనుక ఒక వయసు మళ్ళిన వ్యక్తి నిలబడి వున్నాడు. "రా! శివూ! రా!" అన్నాడతడు, బయట నిలబడ్డ యువకుడు లోపలకు రావటానికి వీలుగా తలుపుకు అడ్డం తొలుగుతూ.

శివరావు లోపలకు వచ్చాడు. "నమస్కారం మాస్టారూ!" అన్నాడు.

మాస్టారు తలుపుమూసి గడియవేశారు. శివరావు తలను ఆప్యాయంగా నిమిరాడు. "కులాసానా?" అన్నారు.

శివరావు మౌనంగా తలాడించి, గదిమధ్య పరచిన మంచంమీద కూర్చున్నాడు. "ఉత్తరాలేమయినా వచ్చాయా మాస్టారూ?" అడిగాడు.

మాస్టారు గోడవారగా వున్న బల్లదగ్గరకు వెళ్ళారు. సొరుగులాగి యిన్‌లాండ్ కవరును బయటకు తీశారు. శివరావుకు ఆ కవరును అందించారు.

శివరావు కవరందుకున్నాడు.

మాస్టారు హరికేన్ లాంతరు వత్తిని పెద్దదిచేశారు. దీపపు కాంతిలో వుత్తరాన్ని ఆత్రంగా చదివాడు శివరావు.

ఆ ఉత్తరాన్ని చదువుతోంటే అతడి మొహంలో ఒకరకమైన కాంతి కనపడుతోంది. ఉత్తరాన్ని మడిచి జేబులో పెట్టుకున్నాడు శివరావు. మాస్టారి మొహంలోకి

ఒక్కసారి చూశాడు. ఆయన మొహంలో ఏ భావం కనపడలేదు.

"ఏం చేద్దాం — అనుకుంటున్నావు?" అడిగారు మాస్టారు.

"చెల్లెలు పెళ్ళి అవుతోంటే ఏ అన్నమాత్రం పెళ్ళికి వెళ్ళకుండా ఊరుకోగలడు మాస్టారూ?"

"అవును, కానీ — రేవుపాలెం సబ్ ఇన్‌స్పెక్టర్ సత్తిరాజు గురించి నీకు తెలుసున్నది చాలా తక్కువ. చండశాసనుడు. ఇప్పటికే మీ ఇంటిమీద కన్ను వేసి ఉంచాడు. నువ్వు పెళ్ళికి వచ్చితీరుతావని వూహించి పథకం తయారుచేసుకొని కూర్చున్నాడు. నువ్వుగానీ రేవుపాలెం వెళ్ళావో — అతడికి పట్టుబడటం ఖాయం."

శివరావు నిర్లిప్తంగా నవ్వాడు. అతడి నవ్వులో తెగింపు తప్ప మరొకటిలేదు. "మాస్టారూ! అన్నిటికీ తెగించినవాడిని. ఈమాత్రం చొరవ చెయ్యలేనా! నేను సరిగ్గా పెళ్ళి ముహూర్తానికి వస్తాను. మీరు ముందు వెళ్ళి పెళ్ళి యేర్పాట్లు చూడండి" అని, భుజానికి తగిలించుకున్న తోలుసంచీని మంచంమీద బోర్లించాడు శివరావు. మంచంమీద నోట్లకట్టలూ — బంగారు నగలూ కుప్పగా పడ్డాయి.

మాస్టారు ఆ నోట్లకట్టలవైపూ, నగలవైపూ అనుమానంగా చూశారు.

మాస్టార్ని చూశాడు శివరావు. "ఏం మాస్టారూ? అలా చూస్తున్నారు?" అన్నాడు.

"శివూ! నిన్నో బందిపోటుగా చూస్తానని ఏనాడూ అనుకోలేదురా? నువ్వు సంపాదించిన ఈ సొమ్ము ఎంత మంది రక్తంతో తడిసిందో! ఎంతమంది ఉసురు పోసు

ఉందో?"

శివరావు కళ్ళలోంచి నీళ్ళు రాలాయి. "మాస్టారూ! ఇంతవరకూ నేను యెవరి ప్రాణమూ తియ్యలేదు. నేను కొల్లగొట్టేది, పేదల రక్తం రుచిమరిగిన ధనమదాంధులను మాత్రమే! కండకావరంతో కళ్ళు మూసుకుపోయిన భూస్వాములను మాత్రమే! నన్ను నమ్మండి మాస్టారూ!" అన్నాడు.

మాస్టారు అతడిని ఆప్యాయంగా చూశారు. "చాలయ్యా! నాకు అమాత్రం సంతృప్తిచాలు" అన్నారు.

"నేను వెళ్తాను మాస్టారూ! మళ్ళీ తెల్లవారితే వెళ్ళటం కష్టం" అన్నాడు శివరావు.

"జాగ్రత్త నాయనా!" అన్నాడు మాస్టారు.

శివరావు మంచంమీదనుండి లేచి నిలబడ్డాడు. అమాంతం మాస్టారి కాళ్ళమీద పడ్డాడు. మాస్టారు కంగారుపడ్డారు. శివరావుని పైకి లేపారు. "ఛ! ఏమిటిది?" అన్నారు.

"మీ ఋణం ఈ జన్మకు తీర్చుకోలేను మాస్టారూ! నా చర్మంతీసి మీకు చెప్పులు కుట్టించి యిచ్చినా అది తీరదు మాస్టారూ!"

అతడు అంత బేలగా ప్రవర్తించటం మాస్టారు యెప్పుడూ చూడలేదు. "మీ నాన్న — నా కుటుంబానికి చేసిన సాయం అంతా యింతా కాదురా! మీ గురించి నేను ఈ మాత్రం చెయ్యకపోతే పురుగులు పట్టి పోతాను" అన్నారు మాస్టారు.

శివరావు ఇంకేమీ మాట్లాడలేదు. మౌనంగా బయటకు వెళ్ళిపోయాడు.

రామయ్య మాస్టారు అతను వెళ్ళినవైపే చూస్తూ

నిలబడిపోయారు. ఎందుకో ఆయన కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి.

నారాయణరావే కనక బ్రతికి ఉంటే....శివు.... మరోలా ఉండి ఉండేవాడు. పాపం శివుతల్లి తాయారమ్మగారు కొడుకుని చూడాలని — కళ్ళలో వత్తులు వేసుకొని మరీ చూస్తోంది. దీప్తి అయితే అన్నగారిని చూసీగాని పెళ్ళిచేసుకోనని మొరాయించింది. పాపం వాళ్ళకేం తెలుసు — శివు చుట్టూ ఉచ్చులు యెలా బిగుసుకున్నాయో! ఆ దేవుడు చల్లగా చూసి పెళ్ళి యే యిబ్బందీ లేకుండా జరిగిపోతే బావుండును.

రామయ్యగారు తలుపు దగ్గరగా వేశారు. దీపంవత్తి చిన్నదిచేసి మంచంమీద నడుం వాల్చారు. నెమ్మదిగా కళ్ళుమూసుకున్నారు. ఆయన మనసు అంతా తన బాల్య స్నేహితుడు నారాయణరావు తాలూకు వూహాలతో నిండి పోయింది.

అలా ఆలోచిస్తూనే మరి కాస్సేపటిలో నిద్రలోకి జారుకున్నారు రామయ్యగారు.

## 2

ఆ రోజు విక్టోరియా కాలేజి ఆవరణ అంతా చాలా కోలాహలంగా ఉంది.

మైదానం మధ్య పెద్ద స్టేజిని తయారుచేశారు. స్టేజ్ మీద వరుసగా కుర్చీలు వేశారు. ప్రిన్సిపాల్ గారయితే కాలుకాలిన పిల్లిలా అటూ యిటూ తిరుగుతున్నారు.

ఆ వేళకి సరిగ్గా ఆ కాలేజీ స్థాపన జరిగి పాతిక సంవత్సరాలయింది. అందుకే ఆ రోజు సిల్వర్ జూబ్లీ జరుగుతోంది. ఆ రోజు కార్యక్రమానికి రాష్ట్రపతి ఛీఫ్

గట్టు.

అడుగడుగునా సెక్యూరిటీగార్డులు నిలబడి వున్నారు. మైదానంలోపలకు వెళ్ళే జనాన్ని పూర్తిగా చెక్ చేసి మరీ పంపుతున్నారు. మెటల్ డిటెక్టర్ సహాయంతో సైకిలు తాళాలనుకూడా బయటకు తీసి చూస్తున్నారు.

సాయంత్రం నాలుగు గంటలయ్యేటప్పటికి మైదానం అంతా విద్యార్థులతోనూ, వారి తల్లిదండ్రులతోనూ, ఆహ్వానితులతోను నిండిపోయింది. ఫంక్షన్ ప్రారంభమయ్యింది. వేదికమీద ప్రముఖులు ఆశీనులయ్యారు. ఉత్తమ విద్యార్థులకు బహుమతులు అందింపబడ్డాయి.

ప్రిన్సిపాల్ లేచి మైకు దగ్గరకు వచ్చారు. తమ ఆహ్వానాన్ని మన్నించి ఫంక్షన్‌కు వచ్చినందుకు కాలేజీ కమిటీ తరుపునా, విద్యార్థుల తరపునా, అధ్యాపక సిబ్బంది తరఫునా రాష్ట్రపతికి ధన్యవాదాలు సమర్పించాడు. తరువాత తన కాలేజీ గొప్పతనాన్నీ, ఆ కాలేజీలో చదువుకున్నవారు ఎంతెంత పెద్ద స్థానాలలో ఉన్నారో వివరించి చెప్పాడు. అలా చెప్తున్నప్పుడు ఆయన స్వరంలో గర్వం తొణికిసలాడింది. ప్రిన్సిపాల్ తను చెబుతున్నది ఒక్క క్షణం ఆపాడు.

"ఈ శుభ సమాహారంలో, ఒక చేదును ప్రస్తావించక తప్పదు" అంటూ మళ్ళీ తన ఉపన్యాసాన్ని కొనసాగించాడు ప్రిన్సిపాల్.

"రాముడు పుట్టిన ఈ దేశంలో రావణుడూ పుట్టేడు, గాంధీలున్న సమాజంలో గాడ్సేలూ ఉంటారు. అలాగే ఎంతోమంది విజ్ఞానవేత్తలనూ, దేశభక్తులనూ తయారు చేసిన మన కాలేజీ, ఒక పచ్చి రౌడీని, దోపిడీ దొంగను కూడా తయారుచేసింది. అతడి పేరు శివరావు.

అతడు మన కాలేజీలో ఉన్నంతకాలం చాలా చక్కగా బుద్ధిమంతుడిలాగా ప్రవర్తించాడు. ఎప్పుడూ ఫస్టే వచ్చేవాడు. అతడికి మంచి భవిత ఉందని మేమందరం ఉద్దేశపడ్డాం. కానీ అతడి తెలివి మంచికి పనికి రాకుండా పోయింది. పెడదారి పట్టింది. ఏమొచ్చిందో యేమో మన ఎమ్.ఎల్.ఏ, నాయుడిని అమానుషంగా హత్యచేశాడు. పోలీసులకు దొరకకుండా పారిపోయాడు. ప్రస్తుతం నల్లమలై అడవుల్లో జరుగుతున్న దోపిడీల వెనుక అతని హస్తం ఉందని నిశ్చయంగా తెలిసింది.

శివరావును పట్టుకున్నవారికి పోలీసుశాఖ పాతికవేల రూపాయల బహుమానాన్ని ప్రకటించింది. మన కాలేజీ విద్యార్థులు యెవరైనా సాహసంచేసి శివరావును పట్టుకుని చట్టానికి అప్పజెబితే మన కాలేజ్ తరఫున మరో పాతికవేల రూపాయల నగదును బహుకరించాలని నిర్ణయం జరిగింది. ఈ గౌరవాన్ని పొందడానికి ప్రతీ విద్యార్థీ కృషిచేస్తారని ఆశిస్తాను. మన కాలేజీ తయారు చేసిన ఒక సంఘ విద్రోహక శక్తిని మనమే అంత మొందిద్దాం" అంటూ తన ఉపన్యాసాన్ని ముగించారు ప్రిన్సిపాల్.

తరువాత రాష్ట్రపతి ప్రసంగించారు.

వందన సమర్పణ అయింది.

ఒక్కొక్కరూ బయటకు వెళుతోన్నారు.

ఎవరి నోటంట విన్నా శివరావు ప్రస్తావనే.

"నాకు రెండేళ్ళు సీనియర్ రా!"

"మా అన్నయ్యకు క్లాస్‌మేట్ ....రోజూ మా ఇంటికి వచ్చేవాడు."

"శివాలయం వీధిలో ఉండేవాడు."

"మన ఓల్డు స్టూడెంట్సు అసోసియేషన్‌కు ప్రెసిడెంట్ ...."

ఇలా యెవరికి తోచింది వాళ్ళు చెబుతున్నారు.

అందరి తలంపూ శివరావు గురించే. అతడిని యెలా పట్టుకోవాలా?....బహుమతి సొమ్ము, ఏభైవేల రూపాయలన్నా యెలా సంపాదించాలా? ఎలా పేరు తెచ్చుకోవాలా? అన్న ఆలోచనలతో అందరి వూహాలూ నిండిపోయాయి.

ఎవరితోటీ సంబంధంలేనట్లుగా వసుధ మాత్రం అన్యమనస్కంగా నడుస్తోంది. ఆమెకు కూడా శివరావు విషయంలో ఎడ్వంచర్ చెయ్యాలని ఉంది. డబ్బు గురించీ, పేరు గురించీ, కాకపోయినా, సంఘ విద్రోహక శక్తులను అణచటం ఒక భారతనారిగా తన ధర్మం అనుకుంది వసుధ.

వెనక — కారు హారన్ వినేటప్పటికి వసుధ ఉలిక్కిపడి వెనక్కి చూసింది.

తెల్లటి అంబాసిడర్ కారులో కూర్చుని వసుధను చూసి వెకిలిగా నవ్వుతున్నాడు అంజిబాబు.

"కమిన్ బేబీ! వచ్చి కారులో కూర్చో! ఇంటి దగ్గర దింపుతాను" అన్నాడు అంజిబాబు.

వసుధ అతడిని అసహ్యంగా చూసింది. కానీ ఆ అసహ్యాన్ని పైకి కనపడనీయకుండా మొహానికి నవ్వు పులుపుకుంది. "వద్దు. డాడీ వస్తానన్నారు" అంది.

అంజిబాబు సంగతి వసుధకు బాగా తెలుసు. అతడి తండ్రే యిందాక ప్రస్తావనకు వచ్చిన నాయుడుగారు. నాయుడు పదవిలో ఉండగా చెయ్యని అక్రమంలేదు. తండ్రి బుద్ధులన్నీ పుణికిపుచ్చుకు పుట్టేడు అంజిబాబు.

పగపట్టేడో నాగుపాముకన్నా భయంకరంగా మారి పోతాడు అంజిబాబు.

వసుధపై అంజిబాబు కన్ను ఈ మధ్యనే పడింది.

వసుధ బాగా తెలివయినది. అంజిబాబును ఎక్కడ ఉంచాలో అక్కడ ఉంచింది. 'అతడిని ఛీకొట్టి బ్రత కడం కష్టం' అని తెలుసుకుంది. అందుకే అతడితో యెప్పుడు మాట్లాడినా ముఖానికి నవ్వు పులుముకుంటుంది. అతడు అతిక్రమించినట్లయితే అతడిని మౌనంగా తిరస్క రిస్తుంది. సిగ్గును అభినయిస్తుంది.

వసుధ మనసును తెలుసుకోలేక తికమక పడిపో తోన్నాడు అంజిబాబు. ఏమాత్రం తొందరపడినా మొదటికే మోసం వస్తుందని గ్రహించి నిదానంగా ప్రవ ర్తిస్తోన్నాడు. అతడి ప్రవర్తనలోని ఆంతర్యాన్ని పసి గట్టింది వసుధ. అది తుఫాను వచ్చేముందు ఏర్పడే నిశ్శబ్దం అని ఆమెకు తెలుసు. అందుకే మరీ జాగ్రత్తగా ప్రవర్తిస్తోంది ఆమె.

"ఏం? నా కారు ఎక్కకూడదా?" అన్నాడు అంజి బాబు.

"ఎందుకు ఎక్కకూడదు? నువ్వేమయినా పరాయి వాడివా?"

"మరయితే వచ్చి కూర్చో!" డోర్ ఓపెన్ చేశాడు అంజిబాబు, మైకంలో.

"అలా కాదు! నాన్నగారు నా గురించి వస్తారుకదా? ఇక్కడ నేను లేకపోతే బాధపడతారు."

"అయితే మీ నాన్నగారు వచ్చేవరకూ నీ దగ్గరే కూర్చుని సరదాగా కబుర్లు చెపుతాను" కారులోంచి కిందకు దిగబోయాడు అంజిబాబు.

వసుధ పై ప్రాణాలు పైనే పోయాయి. అతడు తనను మామూలుగా వదలడని గ్రహించింది. ఏదో చేసి అతడి నుండి తప్పించుకోవాలి....

డోర్ దగ్గరకు అడుగులు వేసింది. "ఎందుకు అంజిబాబూ నీకు అనవసరమైన శ్రమ? అందులోనూ, అందరూ మనల్నే చూస్తున్నారు. ఏం బావుంటుంది చెప్పు?" అంది సుతారంగా డోర్ తీస్తూ, వసుధ.

ఆ మాటలు అంజిబాబుమీద బాగానే పని చేశాయి. వసుధ బుగ్గమీద చిటిక వేసి కారు స్టార్టు చేశాడు. "బాయ్!" అంటూ ముందుకు పోనిచ్చాడు.

వసుధ బుగ్గను కంగారుగా తుడుచుకుంది. కోపంతో ఆమె మొహం కందగడ్డలా తయారయింది. కోపంతో ఆమె ఎద పొంగింది. అంజిబాబు వెళుతోన్న కారువైపు అసహ్యంగా చూసింది.

ఆమె గుండెల్లో రగులుతోన్న మంటలను ఆర్పటానికే అన్నట్లు భూషణంగారి కారు వచ్చి ఆమె ప్రక్కనే ఆగింది.

"ఏం డాడీ! ఇంత ఆలస్యం?"

"కొద్దిగా లేటయిందిరా! రా! కూర్చో" అన్నాడు భూషణంగారు. ఆయన వసుధ మొహంలో కనిపిస్తోన్న కోపపు రేఖలకు తన ఆలస్యమే అని భాష్యం చెప్పుకుని వూరుకుండిపోయాడు.

మరో పావుగంటలో కారు యింటికి చేరుకుంది. వసుధ కారు దిగి లోపలకు వెళ్ళింది. భూషణంగారు కారును గరేజ్ లో పెట్టి వచ్చారు.

టేబుల్ మీదున్న శుభలేఖనూ, దాంతో పాటు వున్న ఉత్తరాన్నీ చూసి ఎగిరి గంతేసింది వసుధ.

"ఏంట్రా! అంత హుషారుగా వున్నావు?" అడిగాడు భూషణం.

"అన్నయ్య పెళ్ళట!"

"ఎవరికి? గోపాలానిదా?"

"అవును! పెదనాన్న మనల్ని వున్నపళంగా బయలు దేరి రమ్మని వ్రాశారు!"

"మొన్నే కదా గోపాలం వచ్చాడు! అప్పుడే పెళ్ళి ..."

"అంతా అలా జరిగిపోయిందట!" అంటూ, ఉత్తరాన్ని శుభలేఖనూ తండ్రి చేతిలో పెట్టి లోపలకు తుర్రుమంది వసుధ.

# 3

రామయ్య మాష్టారు పందిట్లో అటూ యిటూ తిరుగుతున్నారు. ఆయనకు ఒకవైపు సంతోషంగాను, మరో వైపు బాధగాను వుంది. కానీ ఆయన మొహంలో అటు సంతోషంగానీ యిటు విచారంగానీ ఏ మాత్రం బయట పడటంలేదు. అన్నేళ్ళ జీవితంలో ఆయన సాధించగలిగింది అదే.

"ఏం మాష్టారూ? కులాసానా?"

తృళ్ళిపడి వెనక్కి తిరిగారు రామయ్యగారు.

ఎదురుగా సత్తిరాజు నవ్వుతూ నిలబడ్డాడు.

"నమస్కారం ఇన్‌స్పెక్టర్ గారూ!" మాష్టారు గొంతు వణికింది. ఎంత దాచుకుందామన్నా, ఆయన మొహంలోని కంగారు ఆయనలోని గాభరాను బయట పెడుతూనే వుంది.

"మీరు పిలవకపోతే మాత్రం—ఈ వూళ్ళో జరిగే పెళ్ళికి నేను రాకుండా వుంటానా?" కుర్చీలో

కూర్చుంటూ, మాస్టారి మొహంలోకి చూశాడు సత్తిరాజు.

అతని అంతర్యాన్ని కనిపెట్టారు మాస్టారు. నిబ్బరం తెచ్చుకున్నారు. "మిమ్మల్ని పిలవటానికి నేనే స్వయంగా వద్దామనుకున్నా, కుదరలేదు. మరోలా భావించకండి" ఆయన మాటలు చాలా తాపీగా వున్నాయి.

మాస్టార్లో వచ్చిన ఈ మార్పును చూసి ఆశ్చర్యపోయాడు సత్తిరాజు. ఆశ్చర్యాన్ని కప్పిపుచ్చుకుంటూ చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు.

సత్తిరాజు వస్తాడని రామయ్యగారు యెప్పుడో వూహించారు. పెళ్ళికి వచ్చిన జనంలో కలిసిపోయిన పోలీసు మొహాలను ఆయన ఏనాడో గమనించాడు. ఆ విషయం సత్తిరాజుకు తెలియదు.

మరో పదినిముషాలు సత్తిరాజుతో మాట్లాడి లోపలకు వెళ్ళారు రామయ్య మాస్టారు.

లోపల పెళ్ళికూతురికి ముస్తాబు చేశారు ముత్తయిదువలు.

ఆకుపచ్చటి పట్టుచీర, ఎర్రటి పట్టు జాకెట్, మెళ్ళో వజ్రాల హారం, చేతులకు నాలుగేసి బంగారు గాజులు, వాటి మధ్య ఆకుపచ్చటి గాజు గాజులు, నెత్తిన పాపిట పింది, మొగలిరేకుల జడ—నయాపైసంత బొట్టు నుదుటిన మెరుస్తోంది. బుగ్గన నల్లటిచుక్క. భూలోకరంభలా వుంది దీప్తి.

ఆమెను ఒక్కనిముషం ఆప్యాయంగా చూశారు రామయ్య మాస్టారు.

హుషారుగా వుండాల్సిన ఆ పిల్ల కళ్ళలో నీళ్ళు నిలిచి

వున్నాయి.

రామయ్య మాష్టారు, నెమ్మదిగా దీప్తి దగ్గరకు నడిచారు. ఆమె కళ్ళు తుడిచారు. "పిచ్చిపిల్లా!" అంటూ జుత్తు సవరించారు.

అంతవరకు లోపల అణగారి వున్న దుఃఖం, దీప్తి గుండెల్లోంచి ఒక్కసారిగా వెల్లుబికింది.

"ఛ! ఏమిటిది?" అన్నారు మాష్టారు.

"నా వల్ల అన్నయ్య యిబ్బందుల్లో పడుతున్నాడు...."

"వాడికేం కాదమ్మా! వాడు అజేయుడు. వాడికి తెలియకుండా నీ పెళ్ళి జరిగిపోతే వాడు భరించగలడా? తెలిస్తే వూరుకోగలడా? వూరుకో. జరగాల్సింది జరక్క మానదు. అన్నిటికీ ఆ పైవాడే వున్నాడు."

"అదికాదు మాష్టారూ! ఆ ఇన్‌స్పెక్టర్...." అనబోతోంది దీప్తి. అంతలో తలుపు దగ్గర చప్పుడయింది. మాష్టారు ఆమెను మాట్లాడవద్దని సంజ్ఞ చేశారు. నెమ్మదిగా తలుపు దగ్గరకు వెళ్ళారు. మళ్ళీ ఏదో అనుమానం వచ్చి వెనక్కి వచ్చేశారు. దీప్తికి సంజ్ఞ చేశారు. దీప్తి మౌనంగా తలాడించి "అయితే అన్నయ్య రాడంటారా?" అంది బిగ్గరగా.

"ఎలా వస్తాడమ్మా? వాడికి నీ విషయం తెలియొద్దా?" అన్నారు రామయ్య మాష్టారు.

"అయితే ఎలా మాష్టారూ?"

"ఏం చేస్తాం తల్లీ? అంతా నీ దురదృష్టం. కనీసం వాడు ఎక్కడ వున్నాడో తెలిస్తే కబురో—కాకరకాయో—చేద్దుము. మనకి అదీ తెలియదాయె!" మరీ బిగ్గరగా అన్నారు రామయ్యగారు.

లోపలనుండి వినబడుతున్న మాటలను విన్నాడు—అప్పటివరకు తలుపుబయట నిలబడి వున్న కానిస్టేబుల్. సంతృప్తిగా తలాడించి—తను విన్నది చెప్పటానికి—ఇన్‌స్పెక్టర్ సత్తిరాజు దగ్గరకు వెళ్ళిపోయాడు.

తలుపు దగ్గరనుండి అడుగుల చప్పుడు దూరం అవటం గమనించారు రామయ్యగారు. చిన్నగా నవ్వుకుంటూ తలుపు దగ్గరకు వెళ్ళి తలుపుతీసి బయటకు చూశారు. బయట యెవ్వరూ లేరు.

"ఏమిటి మాస్టారూ! యిదంతా? ..." అని అడిగింది దీప్తి.

"ఎత్తుకు పై ఎత్తు" అన్నారు రామయ్యగారు.

"అన్నయ్యగారూ! పెళ్ళివారు వచ్చారు" అంటూ లోపలకు వచ్చింది తాయారమ్మ.

"సరే! నువ్వు లోపలి విషయాలు చూడమ్మా!" అంటూ పైతుండు సవరించుకుంటూ బయటకు వెళ్ళారు రామయ్యగారు.

తెల్లటి అంబాసిడర్ కారులోంచి హుందాగా దిగాడు గోపాలం. అతనితోపాటే దిగిన అందాల బొమ్మ మీద అందరి కళ్ళూ నిలిచిపోయాయి.

కారులోంచి దిగిన గోపాలం తల్లి "వసుధ! మా మరిదిగారి అమ్మాయి" అంటూ ఆ అమ్మాయిని అందరికీ పరిచయం చేస్తోంది.

రామయ్య మాస్టారు పెళ్ళివారికి స్వాగతం చెప్పారు.

పెళ్ళికొడుకుని మంగళస్నానికి తీసుకుని వెళ్ళారు.

వసుధ—కాబోయే వదినను పరిచయం చేసుకోటానికి లోపలకు వెళ్ళింది.

గడియారం ముళ్ళు పదకొండు గంటలను చూపిస్తో న్నాయి.

సత్తిరాజు పందిట్లో కాలుకాలిన పిల్లిలా తిరుగు తోన్నాడు. తన మనుషులను హుషారుపరుస్తోన్నాడు.

ముహూర్తం దగ్గరపడుతోంది. శివరావు వచ్చే సూచనలు ఎక్కడా కనపడటంలేదు. ఒకవేళ కానిస్టేబుల్ తెచ్చిన సమాచారం నిజమయినదే నేమో! అమ్మో! నమ్మటానికి వీలులేదు. ఆ మాస్టార్ని తక్కువగా అంచనా వెయ్యటానికి వీల్లేదు. తనకన్నా రెండాకులు యెక్కువే చదివాడు. తను అతడి ట్రిక్‌లో పడకూడదు—

అలా సాగుతోన్నాయి అతని ఆలోచనలు.

“అమ్మా! పెళ్ళికూతుర్ని తీసుకురండి!” అరిచాడు పురోహితుడు.

దీప్తిని పెద్ద బుట్టలో పెట్టి వంటబ్రాహ్మణులు తీసుకువచ్చారు. బుట్టమీద రామయ్యమాస్టారు చెయ్యి వేశారు.

పందిరంతా సన్నాయి వాయిద్యాలతో మారుమ్రోగి పోతోంది.

ఒక యువకుడు గబ గబా నడిచి లోపలకు వచ్చాడు.

సత్తిరాజు దృష్టి ఆ యువకుడిమీద పడింది. ఆ యువకుడు అది గమనించాడు. చటుక్కున అతని మెదడులో మెరుపులాంటి ఆలోచన మెరిసింది. పెళ్ళికొడుకు వెనకాల నిలబడిన వసుధ ప్రక్కకు వెళ్ళి నిలబడ్డాడు. నెమ్మదిగా ఆమెతో మాటలు కలిపాడు. వసుధ కూడా అతనితో నవ్వుతూ మాట్లాడుతోంది.

అప్పటివరకూ ఆ యువకుడినే గమనిస్తోన్న సత్తిరాజు

ఎప్పుడయితే వసుధ, అతనితో నవ్వుతూ మాట్లాడటం చూశాడో, మౌనంగా తల వూపి పందిట్లోని జనాన్ని చూడ్డంలో మునిగిపోయాడు.

సత్తిరాజు అటు తిరగ్గానే, ఆ యువకుడు రామయ్య మాస్టారి దగ్గరకు ఒక గెంతు గెంతాడు. మాస్టారి చెవులో యేదో చెప్పాడు. మాస్టారి మొహంలో కోటి కాంతులు వెలిగాయి. ఆయన ఆ యువకుడిని కృతజ్ఞతతో చూసి, నెమ్మదిగా పురోహితుడివైపు వెళ్ళారు. పురోహితుడితో ఒక్క నిముషం గుసగుస లాడారు. పురోహితుడు అంగీకారంగా తల వూపాడు.

సత్తిరాజు యిదంతా ఓరకంటితో చూస్తోన్నాడు.

రామయమాస్టారు లోపలకు వెళ్ళారు.

మరో అయిదు నిముషాల తర్వాత అందరికీ డ్రింకులు అందాయి, అందరూ డ్రింకులను త్రాగుతోన్నారు. మాస్టారు డ్రింక్ బాటిల్‌ను తీసుకువచ్చి సత్తిరాజుకు అందించారు.

సత్తిరాజు నవ్వుతూ బాటిల్‌ను అందుకున్నాడు. కుర్చీలో కూర్చున్న మరో పెద్దమనిషికి అందించాడు.

మాస్టారు గతుక్కుమన్నారు. కాని ఆ గుర్పాటును బయటకు కనపడనీయకుండా కప్పిపుచ్చుకున్నారు. మరో బాటిల్ తెసి ఇన్‌స్పెక్టర్‌కు అందించి అక్కడ నుండి వెళ్ళిపోయారు.

ఆయన సత్తిరాజును అభినందించకుండా వుండలేక పోయారు.

సత్తిరాజు తను వూహించినదానికంటే తెలివయిన వాడు!

ఆయన గుండె వేగం హెచ్చింది.

సత్తిరాజు డ్రింకు తాగుతూ చుట్టూ చూశాడు.

తనవాళ్ళందరూ మాస్టారి ట్రిక్‌లో పడిపోయి వుంటారు. మత్తుమందు కలిపిన డ్రింకులను తాగి ఈపాటికి జోగుతూ వుంటారు.

సత్తిరాజు తన ప్రక్కన కూర్చున్న వ్యక్తివయిపు చూశాడు.

ఆ వ్యక్తి మగతగా కళ్ళు మూసుకుంటున్నాడు.

ముందు అందించిన డ్రింక్ త్రాగితే తన పని కూడా యింతే అన్నమాట—అనుకున్నాడు సత్తిరాజు.

అంతలో ఆ ఇంటి ముందు చిన్న గుర్రబ్బండి ఆగింది. అందులోంచి ముగ్గురు వేదపండితులు క్రిందకు దిగారు, ముగ్గురూ చాలా హుందాగా పట్టుపంచలతో చేతికి కడియాలతో, నొత్తిన పిలకలతో, గురుభావం కలిగించేలా వున్నారు.

కల్యాణవేదికలో వున్న పురోహితుడు వాళ్ళను చూసి లేచాడు. "నమస్కారం ప్రభాకరశాస్త్రిగారూ! మీరు వస్తున్నారని యిప్పుడే తెలిసింది" అంటూ వాళ్ళదగ్గరకు అడుగులు వేశాడు.

రామయ్య మాస్టారు ప్రభాకరశాస్త్రి ముందుకు వచ్చాడు. "రండి! వధూవరులను ఆశీర్వదించండి!" అంటూ అక్షితలను ఆయన చేతిలో పోశారు.

ప్రభాకరశాస్త్రి అక్షితలు అందుకున్నాడు. ముందుకు అడుగు వేశాడు.

కొంచెం పొడుగ్గావున్న వేదపండితుడు చిరునవ్వు నవ్వి ముందుకు అడుగులు వేశాడు.

పెళ్ళికూతురు ముందుకు వచ్చి నిలబడ్డాను.

దీప్తి కళ్ళెత్తి ప్రభాకరశాస్త్రిని చూసింది. ఆమె

కళ్ళలో నీరు నిలిచింది. ప్రభాకరశాస్త్రి ఆమె నెత్తి మీద అక్షితలు వేశాడు. మరికొన్ని అక్షితలను గోపాలం నెత్తిమీద కూడా వేశాడు.

సత్తిరాజు అతని మొహాన్నే పరీక్షగా చూస్తు న్నాడు. అతడి మొహంలో వస్తున్న మార్పులను జాగ్ర త్తగా గమనిస్తున్నాడు.

రెండు నిముషాలు పోయాక సత్తిరాజు నెమ్మదిగా శాస్త్రి పక్కకు వచ్చాడు.

శాస్త్రి ఓరకంటితో సత్తిరాజును చూశాడు. ఎడమ చేత్తో తొడను కొట్టుకున్నాడు.

అదే అతని కొంప ముంచింది.

చేసిన తప్పును తెలుసుకుని నాలిక్కొరుకున్నాడు శాస్త్రి.

కానీ అప్పటికే ఆలస్యం అయిపోయింది.

శివరావు మానరిజమ్స్ గురించి పూర్తిగా తెలుసుకున్న సత్తిరాజు—ప్రభాకరశాస్త్రి ఎడమచేత్తో తొడను చరచుకోగానే, అతడు ప్రభాకరశాస్త్రి కాడనీ, ఆ వేషంలో వచ్చిన శివరావేననీ గ్రహించాడు. చటుక్కున జేబులో చెయ్యిపెట్టి పిస్టల్ బయటకు తీశాడు.

అది గమనించి శివరావు చటుక్కున ప్రక్కకు వురి కాడు.

గోపాలం వెనుక నిలబడివున్న వసుధ పెదపండి తుడిగా వచ్చిన మనిషిలో అంత కంగారు చూసి ఆశ్చర్యపోయింది.

"మిస్టర్ శివరావ్! లొంగిపో!" అంటూ అరిచాడు సత్తిరాజు.

శివరావు అతడి మాటలను లక్ష్యపెట్టలేదు. అంత

మంది మధ్యన సత్తిరాజు తనమీద పిస్తోలు వుపయోగించ లేడని శివరావు నమ్మకం.

సరిగ్గా సత్తిరాజు కూడా అదే విధంగా ఆలోచిస్తు న్నాడు.

తన చేతిలో వున్న ఆయుధాన్ని వుపయోగించటం కష్టం. అందుకే శివరావు అంత ధైర్యంగా వున్నాడు. ఏదో చేసి శివరావుని పట్టుకోవాలి—ఎలా?

అంతలోనే ఒక నిశ్చయానికి వచ్చాడు సత్తిరాజు. పందిట్లో వున్న జనాన్ని ఒక్కసారి పరికించి చూశాడు. "దయవుంచి ఎవరూ అటూ యిటూ పరుగెట్టకండి. ఎక్కడివాళ్ళు అక్కడ నేలమీద కూర్చుండిపొండి!" గట్టిగా అరిచాడు సత్తిరాజు.

అప్పటికే శివరావు విషయం అక్కడున్న వాళ్ళంద రికీ తెలిసిపోయింది.

ఒక్కొక్కరే సత్తిరాజు చెప్పిన ప్రకారం క్రింద కూర్చుండిపోవటం ఆరంభించారు.

శివరావుకు మతిపోయింది. దిక్కుతోచనట్లుగా అని పించింది. సత్తిరాజు చెప్పినట్లు అందరూ నేలమీద కూర్చుండిపోతే తనపని సరి. తను దొరికిపోవటం ఖాయం. అలా జరగడానికి వీలులేదు. ఏదో చేసి అక్కడ నుండి తప్పించుకోవాలి. ఎలా? అంతలోనే వేదికదగ్గర వయ్యా రంగా నిలబడ్డ వసుధమీద అతని చూపు నిలిచింది. వెంటనే అతడి మెదడులో ఒక ఆలోచన తళుక్కున మెరిసింది.

పండితుడు వేషంలో వచ్చింది శివరావు అని తెలియ గానే వసుధ దవడ కండరాలు బిగుసుకున్నాయి. ఒక్క నిముషం ఆశ్చర్యంతో నిశ్చేష్టురాలయింది. వెంటనే

స్పృహలోకి వచ్చింది. ఫ్లాష్ లో కాలేజీలో ప్రిన్సిపాల్ చెప్పిన మాటలు ఆమెకు గుర్తుకు వచ్చాయి. ఆమె రక్తం కవోష్ణమయింది. కోంకు బిగించింది. ఎలాగయినా శివరావును పట్టుకోవాలి. ఆలోచిస్తూ ముందుకు చూసింది.

శివరావు తనవైపు వస్తూ కనిపించాడు. ఆమెకు శివరావు మనస్సులోని అభిప్రాయం తెలియదు. ఆమె కోంకు బిగించి శివరావును పరికించి చూస్తోంది. ఆమె శివరావుని ఆటకాయించి ఇన్ స్పెక్టర్ సత్తిరాజుకు అప్పగించాలనుకుంది.

అంతలోనే శివరావు అమాంతం ముందుకు దూకాడు. వసుధను చేతుల్లో యిరికించుకున్నాడు. పిస్తోలును ఆమె కణతకు గురిపెట్టాడు. "ఎవరూ ముందుకు రావటానికి సాహసించకండి. అనవసరంగా ఈ పిల్ల ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోతాయి" శివరావు గొంతు పెళ్ళి పందిట్లో ఖంగుమంది.

వసుధ ఒక్క నిముషం ఊపిరి తీసుకోవటం మర్చిపోయింది. అప్పటివరకూ ఆమెలో వున్న తెగువ మటుమాయమయిపోయింది.

పెళ్ళిపందిర్లో వున్నవాళ్ళందరూ ప్రేక్షకులుగా మారిపోయారు.

సత్తిరాజు పళ్ళు బిగపట్టాడు: తను అనవసరంగా ఒక ఆడపిల్లను యిందులో యిరికించానేమో అన్న బాధ అతడిని నిలువెల్లా తినేస్తోంది. అతని కళ్ళు కోపంతో ఎరుపెక్కాయి. తన అనుచరులందర్నీ ఒక్కసారి చూసి శివరావువైపు తిరిగాడు. "శివరావ్! మర్యాదగా లొంగిపో! ఇప్పటికే నువ్వు చేసిన నేరాలు చాలా

వున్నాయి. మళ్ళీ యిప్పుడో కొత్త నేరం చెయ్యకు' కమాన్! నీకు శిక్ష తగ్గ యేర్పాటు చేస్తాను" అంటూ అరిచాడు.

శివరావు ఇన్‌స్పెక్టర్ మాటలను లెక్కపెట్టలేదు. వసుధను బలవంతంగా నెట్టుకుంటూ ముందుకు సాగి పోయాడు. అందరూ అడ్డు తప్పుకొని అతడికి బయటకు వెళ్ళటానికి దారి యిచ్చారు. శివరావు గుమ్మం దగ్గర ఆగాడు. ఒక్కసారి మళ్ళీ వెనక్కి తిరిగిచూశాడు. "నన్ను ఎవరూ వెంబడించటానికి ప్రయత్నం చెయ్యొద్దు" అనేసి బండి ఎక్కాడు.

మరుక్షణం బండి ముందుకు వురికింది.

## 4

అదో చిన్న కొండగుహ.

గుహ ద్వారం వద్ద దట్టంగా పెరిగిన చెట్లవలన గుహ లోపలిభాగంలోకి అంతగా వెలుతురు రావటంలేదు. బాగా పరీక్షగా చూస్తేగాని అక్కడో గుహ వుందని మానవమాత్రు డెవడూ పసిగట్టలేడు.

గుహ బయట నిలబడి ఓసారి చుట్టూ పరికించి చూశాడు శివరావు. మోటారుసైకిల్‌ను తోసుకుంటూ లోపలకు వెళ్ళాడు.

గుహలోపల ఒక ప్రక్కగా బులెట్‌కు స్టాండ్ వేశాడు.

చాలా పెద్ద గుహ అది. కొండలో ప్రకృతిసిద్ధంగా ఏర్పడిన తొర్ర. ప్రవేశప్రాంతం సన్నగా వుండి లోపలకు వెళ్ళేకొద్దీ చాలా వెడల్పుగా వుంది.

శివరావు పూర్తిగా లోపలకు వచ్చేశాడు. ఉండ

టానికి వీలుగా గుహాలోపల అతడు ఒక చక్కటి మంది గాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. చిన్న మోటారు సహాయంతో ఎలక్ట్రిక్ సప్లయ్‌ని యేర్పాటు చేసుకున్నాడు. గాస్ స్టవ్, ఫ్రిజ్, సంసారానికి కావలసిన యితర సామాన్లు యేర్పాటు చేసుకున్నాడు. కాలు బయట పెట్టకుండా కనీసం నెలరోజులయినా ఆ గుహాలో హాయిగా గడపవచ్చు.

గుహాలోపల చివరగా ఏర్పాటుచేసిన నలుచదురపు పాలరాతిమీద కూర్చుని ఉంది వసుధ. ట్యూబ్ లైట్ కాంతిలో ఆమె శరీరం పాలరాయిలా మెరుస్తోంది.

శివరావు ఆమెను ఒక్కక్షణం పరిశీలనగా చూశాడు.

ఆమె శివరావును చూసి మొహం అటుప్రక్కకు తిప్పుకుంది.

శివరావు టేబుల్ వైపు చూశాడు. ఆమెకోసం అక్కడ ఉంచిన ఆహారపదార్థాలన్నీ అలానే ఉన్నాయి. శివరావు మనసు గతుక్కుమంది.

"భోజనం చెయ్యలేదా?" అడిగాడు శివరావు.

వసుధ మాట్లాడలేదు.

శివరావు ఆమె ముందుకు నడిచాడు. "ప్లీజ్ భోజనం చెయ్యండి!" అన్నాడు.

వసుధ అక్కడకు వచ్చి మూడురోజులయింది. అప్పటి నుండీ పచ్చి మంచినీళ్ళయినా ముట్టుకోలేదు. చాలా నీరసరగా ఉంది. శివరావుకు ఆమెను చూస్తే జాలివేసింది. తన చేతిలో ఉన్న పేకెట్‌ను వసుధమీదకు విసిరాడు. "దీనిలో, చీరలు, బ్లవ్‌జులు ఉన్నాయి" అనేసి గాస్ స్టవ్ దగ్గరకు వెళ్ళాడు. వంటపనిలో మునిగిపోయాడు.

వసుధకు యేడుపు ముంచుకు వచ్చేస్తోంది. కానీ ఏం

చెయ్యగలదు. తనో అబల. పోనీ శివరావు బయటకు వెళ్ళగానే పారిపోదాం అంటే, అది జరగని పని. శివరావు బయటకు వెళ్ళేముందు గుహాద్వారం దగ్గర ఎలక్ట్రిక్ సర్క్యూట్ ఆన్ చేసి వెళ్ళిపోతున్నాడు. ఆ సర్క్యూట్ దాటి బయటకు వెళ్ళటం చాలా కష్టం. దానికీ లోపల పని చేసే మోటారుకు యేమీ సంబంధంలేదు.

గుహకు వచ్చిన కొత్తలో బయటకు వెళ్ళటానికి ప్రయత్నంచేసి మరీ విఫలమయింది. అప్పటినుండీ శివరావు మరీ జాగ్రత్తగా వుంటున్నాడు. అతని మనసులోని వుద్దేశ్యం కూడా సరిగా అర్థంకావటంలేదు.

వసుధ నీరసంగా మంచంమీద వాలిపోయింది.

స్టవ్ దగ్గర శివరావు గిన్నెలు సర్దుతున్నాడు.

పదినిముషాలు పోయాక అతడు ఆమె దగ్గరకు వచ్చాడు. "నేను బయటకు వెళుతున్నాను. తిరిగి యిక్కడకు రావటానికి ఆలస్యం కావచ్చు టేబుల్ మీద భోజనం రెడీగా వుంది. చల్లారిపోకుండా భోజనం చేసి విశ్రాంతి తీసుకోండి" అంటూ మోటారుసైకిల్ వైపు అడుగులు వేశాడు.

"ఆగండి!" అరిచింది వసుధ.

శివరావు వెనక్కి తిరిగాడు. "ఏం?" అన్నాడు. గుహలోకి వచ్చాక మొదటిసారిగా వసుధ పెదవి విప్పింది.

"నన్ను యెందుకు బంధించారు....?" అడిగింది వసుధ.

"నన్ను నేను కాపాడుకోవటానికి!"

"అందుకు ఆడదానిని నేనే దొరికానా?"

"సారీ! తప్పలేదు! నేను ఎంతో బాధపడుతున్నాను"

అతడి మాటల్లో సంస్కారం వుంది.

"మీరు సత్తిరాజా నుండి తప్పించుకోవటానికి నన్ను అడ్డం పెట్టుకొన్నారు. మీ పని అయిపోయింది కదా? ఏ దురుద్దేశం లేకపోతే మీరు నన్ను యెందుకు బంధించి వుంచుతారు?"

"నన్ను వెంబడించవద్దు—అంటే వినకుండా సత్తిరాజు నా వెంట పడ్డాడు. మిమ్మల్ని యిక్కడకు తీసుకరాక తప్పలేదు. ఇప్పుడు మీకు నా స్థావరం గురించి పూర్తిగా తెలుసు. మిమ్మల్ని బయటకు వదిలితే చాలా ప్రమాదం."

"అయితే నా బ్రతుకు యిక్కడే తెల్లారిపోవాలా?" వసుధకు యేడుపు ముంచుకొస్తోంది.

"అక్కర్లేదు! నేను మరో స్థావరం వెదుకుతున్నాను. ఆ పని పూర్తవగానే మిమ్మల్ని వదిలేస్తాను!" అని యిక ఆమె మాట వినకుండా బైక్ స్టార్టు చేశాడు.

వసుధ రెండు నిముషాలు అతడు వెళ్ళినవైపే చూస్తూ వుండిపోయింది.

నెమ్మదిగా మంచంమీద నుండి లేచింది. ఒళ్ళు విరుచుకుంది. టేబుల్ మీద వున్న ఆహారపదార్థాలను చూడగానే ఆమెకు ఆకలి గుర్తుకు వచ్చింది. ఆవురావురంటూ భోజనం చేసింది. వంట్లోకి శక్తికిరణాలు ప్రవేశించాయి. ఒళ్ళంతా మకిలి పట్టివుంది. బాత్ రూమ్ వెళ్ళి తలారా స్నానం చేసింది.

శివరావు తెచ్చిన బట్టలపాకెట్ తెరిచింది. పేకెట్లో నాలుగు చీరలు, నాలుగు బ్లవుజులూ వున్నాయి. నాలుగూ చక్కటి రంగులు. అందులో తనకు యిష్టమైన సంపెంగ రంగు చీర, మేచింగ్ బ్లవ్ జూ తీసి వేసుకుంది.

మంచంమీద కూర్చుని ఆలోచనల్లో మునిగిపోయింది.

తనని యిప్పటి వరకూ శివరావు మర్యాదగానే చూశాడు. ఎంతైనా మొగాడు. ఒంటరిగా తను ఒక మగవాడి దగ్గర....అతనుమటుక్కు ఎంతకాలం నిగ్రహంగా వుండగలడు. అందులోనూ పచ్చి రౌడీ, హంతకుడు....తను ఇక్కడనుండి తప్పించుకుతీరాలి....ఎలా?....ఎలా?....

రెండు నిముషాలు కళ్ళు మూసుకుని కూర్చుంది వసుధ....

ఆమెకు ఒక ఆలోచన స్ఫురించింది.

నెమ్మదిగా లేచి గుహంతా వెతికింది. చిన్న పెన్సిల్ ముక్క దొరికింది. బట్టల పేకెట్ లోపల వున్న రేపర్ తీసింది. తనను యిక్కడకు తీసుకువచ్చినపుడు దారంతటిని స్పష్టంగా గుర్తు పెట్టుకుంది. నెమ్మదిగా రేపర్ మీద తను వున్న గుహ ఎక్కడో స్కెచ్ గీసింది. తన గురించి స్పష్టంగా వ్రాసింది. రేపర్ను మడచి తను విడిచిన చీర కొంగుకు ముడివేసింది. పథకాన్ని మరోసారి నెమరు వేసుకుంది. శివరావు గురించి తయారుగా కాసుక్కూర్చుంది.

చీకటి పడుతోందనగా శివరావు వచ్చాడు. మనిషి చాలా అలసటగా వున్నాడు. కానీ ఆ అలసట అంతా లోపల తను తెచ్చిన చీర కట్టుకుని కూర్చున్న వసుధను చూడగానే మటుమాయమయ్యింది. "గుడ్! భోజనం కూడా చేశారన్న మాట! థాంక్యూ!" అన్నాడు.

వసుధ అతడిని ఆశ్చర్యంగా చూసింది. "థాంక్స్ దేనికి?" అంది.

"మిమ్మల్ని నేను యిక్కడికి బలవంతంగా తీసుకు వచ్చాను. మీరు తిండీ నిద్రా మాని కూర్చుంటే మీ

కేదయినా జరిగితే ఆ పాపం నాకు చుట్టుకుంటుంది కదా! నన్ను ఆ పాపానికి గురి కాకుండా రక్షించారు. అదీ కాకుండా నా మాట మన్నించి నేను తెచ్చిన చీర కట్టుకున్నారు" అంటూ వసుధవైపు చూశాడు.

వసుధ అతడిని విచిత్రంగా చూసింది. ఏమిటీ మనిషి- ఇతడికి కూడా పాపభీతి, దైవచింతన వుందా?—అయితే మరి హంతకుడుగా యెందుకు మారాడు?—కారణం తెలుసుకోవాలనిపించింది వసుధకు. అంతలోనే మనసు మార్చుకుంది—అమ్మో అతడి మాటల ధోరణిని బట్టి అతడిని ఒక మంచిమనిషిగా అంచనా వేసి అతడి మోసంలో పడకూడదు. అందుకే తన పథకాన్ని అమలు జరపాలనే నిశ్చయానికి వచ్చేసింది. "మిస్టర్ శివరావ్?" అంది ఎంతో సౌమ్యంగా!

ఆమె అంత సౌమ్యంగా మాట్లాడటం శివరావును ఆశ్చర్యపరచింది. అయినా ఆశ్చర్యాన్ని లోపలే అణచుకొని "యస్! ప్లీజ్!" అన్నాడు.

"నాకు యిక్కడ చాలా బోర్ గా వుంది! ఒక్కసారి అలా బయటకు తీసుకు వెళ్ళండి" అంది.

శివరావు మాట్లాడలేదు.

"పోనీ లెండి! మీకు యిబ్బంది అయితే వద్దు లెండి" అంది.

"అబ్బే! యిబ్బంది—అని కాదు—చీకటి పడిపోయింది కదా! రాత్రివేళ యేం బయటకు వెళతాం లెండి! రేపు ఉదయం వెళదాం!" అన్నాడు.

"పగలు యెందుకు లెండి! రాత్రయితే మనల్ని ఎవరు చూడరు."

శివరావు కాదనలేక పోయాడు. "సరే రండి!"

అన్నాడు.

"ఇలా గేనా? ముందు మీరు స్నానం చేసి రండి!" అంది.

శివరావు తల వూపి బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు.

అతడు అలా వెళ్ళగానే, వసుధ నెమ్మదిగా లేచి, తను విడిచిన చీరలో చిన్న పీలికను చింపింది. ఆ పీలిక చివరే తను స్కెచ్ గీచిన పేపరు వుంది. ఆ పీలికను చిన్నగా మడచి బ్లౌజ్‌లో దాచేసింది.

ఈలోగా స్నానం ముగించుకొని శివరావు బయటకు వచ్చాడు.

వసుధ లేని ఆప్యాయతను తెచ్చిపెట్టుకొని అతడితో మాట్లాడటం ఆరంభించింది.

మరో పావుగంటలో యిద్దరూ గుహ వదలి బయట పడ్డారు.

## 5

"మీరు అతడిని పట్టుకోక పోగా ఒక అమాయకు రాల్ని అతిడిపాలు చేశారు! ఛ! వాట్ షేమ్ టు అవర్ డిపార్టుమెంట్" అసహనంగా నుదురు రుద్దుకున్నారు కమీషనర్ శ్రీపతి.

సత్తిరాజు సర్వీస్‌లో జాయిన్ అయినాక మొట్ట మొదటిసారిగా పై అధికార్ల చేత చీవాట్లు గాస్తున్నాడు. అతడి అహం దెబ్బతింది. కానీ పై అధికార్లను యేమీ అనలేని అసహాయత. అందులోనూ, తన సర్కిల్ కమీష నర్ జ్యూరిస్‌డిక్షన్‌లోనిది కాదు. అయినా శ్రీపతి తన మీద అధికారం చెలాయిస్తుంటే యేమీ చెయ్యలేక మౌనంగా ఉండిపోయాడు. కానీ పై అధికార్ల మీద తన కున్న కోపం శివరావు పట్ల కసిగా మారిపోయింది.

"వాట్ మిస్టర్ రాజా! ఏం మాట్లాడకుండా బెల్లం కొట్టిన రాయిలా నిలబడిపోయావ్?" కమీషనర్ గొంతు ఉరిమింది.

సత్తిరాజు సర్దుకున్నాడు. "సారీ సార్! వాడిని తప్పకుండా పట్టుకుతీరతాను సార్! నన్ను నమ్మండి! ఇట్సే ఛాలెంజ్ టు మి!" అన్నాడు.

"ఎస్! ఎస్! మీమీద నాకు నమ్మకం వుంది. శివ రావు తనతో తీసుకు వెళ్ళిన అమ్మాయి తండ్రి భూషణం నాకు క్లోజ్! అందుకే నేను రంగంలోకి దిగాల్సివచ్చింది. మరోలా భావించకండి."

"ఎంత మాట సర్! ఇట్సే ప్లజర్ టు మి!"

"దెన్! గో ఎ హెడ్." అన్నాడు శ్రీపతి.

"యస్! సర్!" అంటూ అతనికి సెల్యూట్ చేసి బయటకు వచ్చేశాడు ఇన్ స్పెక్టర్ సత్తిరాజు.

బయట అతనికోసమే కాచుకొని వున్న జీప్—అతను ఎక్కగానే ముందుకు ఉరికింది.

సత్తిరాజు జీపులో కూర్చుని కళ్ళు మూసుకొన్నాడు. డ్రైవర్ మాట్లాడకుండా జీపు నడుపుతున్నాడు.

"టాంక్ నిండా డీసెల్ వుందా?" అడిగాడు సత్తిరాజు.

"ఉంది సార్!"

"రెండు ఫుల్ టిన్స్ కొట్టించి జీపులో పెట్టు!"

డ్రైవర్ జీపును పెట్రోల్ బంకు దగ్గర ఆపాడు. జీపు వెనక్కి వెళ్ళి రెండు టిన్నులు తీసి వాటినిండా ఆయిల్ కొట్టించి జీపులో పెట్టాడు. సత్తిరాజు జేబులోంచి పర్సు తీసి బిల్ చెల్లించాడు. "స్టేషన్‌కు పోనీ!" అన్నాడు.

జీపు స్టార్టయ్యింది. మరో పావుగంటలో జీపు స్టేషన్

ముందు ఆగింది.

సత్తిరాజు కానిస్టేబుల్స్‌ను పిలిచాడు. "మనం వెంటనే నల్లమలై ఫారెస్టుకు బయలుదేరి వెళ్ళాలి" అన్నాడు.

కానిస్టేబుల్స్‌కు గుండెల్లో రాయి పడింది. "ఇదెక్కడి తద్దినంరా!" అనుకొన్నారు.

సత్తిరాజు వాళ్ళ మనోభావాలను కనిపెట్టాడు. "మనం చేసే ఉద్యోగం అలాంటిది. మనం కత్తిమీద సాము చెయ్యక తప్పదు. ఇప్పుడు మన పరువుకు దెబ్బ తగలబోతోంది. ఇంతవరకు మనం సంపాదించుకొన్న పరువంతా మంటగల్సి పోతోంది. ఆ శివరావుగాడు మన కళ్ళల్లో దుమ్ముకొట్టి పారిపోయాడు. మనం వెంటనే వాడిని పట్టుకోకపోతే మనం యింక డిపార్టుమెంటులోని మిగతావాళ్ళ ముందు తలెత్తుకు మసలలేము. మీరు రానంటే నేనొక్కడినే బయలుదేరుతాను" అన్నాడు.

సత్తిరాజు మహా మొండిమనిషి. ఒకటి అనుకొన్నాడంటే—అది జరిగేదాకా నిద్రపోడు. ఆ విషయం కానిస్టేబుల్స్‌కు బాగా తెలుసు. అందుకే యింకేమీ మాట్లాడకుండా ఆయనతో బయలుదేరటానికి ఒప్పుకొన్నారు.

సత్తిరాజు యింటికి ఫోన్ చేసి తనకు నాలుగురోజుల వరకు రావటం కుదరదని చెప్పాడు.

సాయంత్రం నాలుగవుతోందనగా జీపు కానిస్టేబుల్స్‌నీ, సత్తిరాజునీ తీసుకుని బయలుదేరింది.

సత్తిరాజు ముందు సీట్లో కూర్చుని శివరావు తాలూకు ఫైలు చూస్తోన్నాడు. ఫైలులోని కాగితాలు తిరుగుతోంటే అతని గుండె భారంగా తయారయిపోతోంది.

అంత మంచి కుర్రవాడు, ఒక దొంగగా తయారయ్యాడంటే, పూర్తిగా యీ సమాజానిదే బాధ్యత—కాదని యెవరూ అనరు. అంతమాత్రాన తను ఒక దొంగమీద జాలి చూపలేడు. వ్యక్తిగతం వేరు — ఉద్యోగ ధర్మం వేరు — ఉద్యోగ ధర్మానికే ఎక్కువ ప్రాధాన్యతనిస్తాడు తను. డ్యూటీ కోసం ప్రాణాన్నయినా యిస్తాడు.

జీపు గంటకు అరవై మైళ్ళ వేగంతో పోతోంది. జీపులోనికి చల్లని గాలి రివ్వుమని వీస్తోంది. సత్తిరాజు ఫైలును మూసి, నెమ్మదిగా కళ్ళు మూసుకున్నాడు.

# 6

వసుధ కేరింతలు కొడుతూ ఆ ప్రాంతాన్నంతటినీ కలయతిరుగుతోంది. చిన్నపిల్లలా గెంతులు వేస్తోంది. శివరావు ఆమెను విచిత్రంగా చూస్తోన్నాడు.

ఎందుకో అతను కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఇంత అమాయకురాలినా, తాను చెరపట్టింది—ఒక వేళ తను వదలినా బయటకు వెళ్ళి తలెత్తుకు తిరగగలదా? ఆమెకు పెళ్ళవుతుందా?—ఆమె జీవితాన్ని తాను నాశనం చెయ్యలేదు కదా?

“క్షమించు భగవాన్—నన్ను క్షమించు” శివరావు కళ్ళు మూసుకున్నాడు.

వసుధ నెమ్మదిగా తన జాకెట్లో దాచుకొన్న గుడ్డ పేలికను బయటకు తీసింది. శివరావు దగ్గరకు వచ్చి “ఒక సారి మీరు అలా దూరంగా వెళ్ళండి” అంది సిగ్గు పడుతూ.

శివరావు ఏమనుకొన్నాడో ఏమో తల వంచుకొని దూరంగా వెళ్ళాడు.

అతను వెళ్ళిన వెంటనే వసుధ కొండవాలుకి వచ్చింది. కొండ అంచున ఆనుకొని వలయంగా సన్నని తారు రోడ్డు పరచుకొని వుంది. వసుధ ఆ రోడ్డువైపు ఒక్కసారి చూసింది. రోడ్డువయిపుకు బాగా క్రిందకు వంగి వుంది ఓ చెట్టు.

వసుధ నెమ్మదిగా ఆ చెట్టును ఎక్కడం ఆరంభించింది. కిందకు చూస్తే కళ్ళు తిరుగుతోన్నాయి. ధైర్యం తెచ్చుకుంది వసుధ. తన చేతిలో వున్న చీర చెరగుకు ఓ చెట్టుకొమ్మని బిగించింది. చెరగు రెండో చివరను చెట్టు కొమ్మకు ముడివేసింది. వేసింది. రెండో చెరగుకు కట్టిన కొమ్మవలన చీర చెరగు క్రిందకు వేలాడుతోంది.

వసుధ నెమ్మదిగా చెట్టు దిగి క్రింద నిలబడింది. తను చెట్టుకు కట్టిన చీర చెరగు రోడ్డున పోయేవాళ్ళకు తప్పక కనిపిస్తుంది. వసుధ హాయిగా వూపిరి పీల్చింది.

శివరావు మరో రెండు నిముషాలలో అక్కడకు వచ్చాడు.

"ఇంకా ముందుకు వెళదామా?" అన్నాడు.

"అవసరంలేదు. వెనక్కు వెళ్ళిపోదాం!" అంది వసుధ.

శివరావు ఆమెను విచిత్రంగా చూశాడు. "అదేమిటి! అడవంతా చూద్దామన్నారుగా? అప్పుడే వెనక్కి వెళ్ళిపోదాం—అంటారేమిటి?" అన్నాడు.

వసుధ చిన్నగా నవ్వింది. నిండు పున్నమి కాంతిలో ఆమె మొహం వింతగా మెరిసిపోతోంది. "ఏంచూస్తాం? ఎక్కడ చూసినా ఒకటేగా? అంతా అడవేగా? ఇంక చూడ బుద్ధి కావటంలేదు" అంది.

ఇద్దరూ నడుస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

మాటల సందర్భంలో వసుధ అతన్ని గూర్చి తెలుసుకోవాలనే కుతూహలాన్ని బయట పెట్టింది.

శివరావు చిన్నగా నవ్వి వూరుకున్నాడు. ఇద్దరూ హోండా హీరోపై సువాక బయలుదేరారు. "ఎవరూ పుట్టగానే దొంగ కారు. పరిస్థితుల ప్రభావంవలన మనుషులు దొంగలుగా మారుతారు. ప్రతీ దొంగ వెనకా, హంతకుడి వెనకా, గూండా వెనుకా ఏదో ఒక చరిత్ర వుంటుంది. సమాజం మంచివాళ్ళతో పాటు చెడ్డవాళ్ళను కూడా తయారు చేస్తూ వుంటుంది. మీరు యిలా మారటానికి కారణం యేమిటో చెబుతారా?" అంది.

శివరావు మొహం కందగడ్డలా మారిపోయింది. పళ్ళు పటపటా కొరికాడు. అంతలోనే తేరుకొని, మామూలు మనిషయ్యాడు. ఆవేశాన్ని లోపలే అణగదొక్కుకొన్నాడు. "క్షమించండి. నా గత చరిత్రను చెప్పి మిమ్మల్ని బాధ పెట్టను" అన్నాడు.

వసుధ అతడిని జాలిగా చూసింది. "పర్వాలేదు చెప్పండి. మనసులోవున్న బాధను యెవరితోనో ఒకరితో చెప్పుకోవాలి. లేకపోతే గుండె బద్దలయిపోతుంది" అంది.

"ఫర్వాలేదు. ఇప్పుడు నా గుండె పగిలిపోయినా, నాకు బాధలేదు. నా చెల్లెలి పెళ్ళి జరిగిపోయింది. నాకిక నిశ్చింత. ఇంతకాలం నేను పడిన కష్టాలకు ఓ అర్థం కనిపించింది. ఇక నాకే బాధా లేదు."

"అయితే మీరు యింతకాలం కష్టపడింది మీ చెల్లెలి గురించా?"

"అవును. నేను చేసింది, చేస్తోన్నదీ తప్పని తెలుసు-కానీ నా చెల్లెలు అందరి ఆడవాళ్ళలా మంచి మొగుడితో

కాపురం చెయ్యాలని కలలు గన్నాను. ఇంత కాలానికి ఆ కలలు నిజం అయ్యాయి."

వసుధ యేదో అనబోయింది. అంతలోనే తమాయించుకుంది. "మీ గతం చెప్పండి" అంది.

"సరే! మీరు అంతగా అడుగుతున్నారు కాబట్టి తప్పే దేముంది?" అని చెప్పడం మొదలు పెట్టాడు శివరావు.

## 7

గలగల పారే గోదారి మధ్యన వున్న చిన్న కుగ్రామం తిర్ళకుప్ప.

అన్నం పున్నం తెలీని అమాయకులు—ఒకరికోసం ఒకరు బ్రతికే ప్రజల సముదాయం ఆ గ్రామం—ఒక వయిపు ఎత్తుగా పెరిగిన కొబ్బరి తోటలూ, పండ్ల చెట్లూ, మరో వయిపు పచ్చటి తివాచీలలా పెరిగిన వరిచేలూ.... ఆ గ్రామానికి వింత అందాలు కూరుస్తోన్నాయి.

ఆ గ్రామంలో చిన్నపిల్లలకోసం ఒక స్కూల్ వున్న దేకానీ, వసతిలేదు. స్కూల్ కు బిల్డింగ్ లేదు. ఒక పూరిపాక. దాంట్లో ప్రెసిడెంట్ గారి గొడ్లను కడుతోంటారు. అటు పిల్లలకు గానీ, యిటు వారి తల్లిదండ్రులకు గానీ, చదువంటే యిష్టం లేదు.

అటువంటి పరిస్థితులలో నారాయణరావుగారు ఆ ఊరి మాస్టరుగా వచ్చారు.

ఆయన వచ్చిన దగ్గరనుండీ ఆ ఊరి పరిస్థితే మారిపోయింది స్కూల్ చక్కబడింది. పిల్లలకు చదువు మీద శ్రద్ధ పెరిగింది.

నారాయణరావుగారు ఆ ఊళ్ళోని అందరి తలల్లోనూ నాలుకగా మారిపోయారు. ఆ గ్రామ సర్పంచ్ తో

సమానంగా హోదాను సంపాదించుకున్నారు.

ప్రతీ గ్రామంలో లాగానే ఆ ఊళ్లో కూడా నాయుడని ఓ రావణాసురుడు వున్నాడు. అతడు పైకి మాత్రం యెంతో మంచిగా ఉండేవాడు. తనకున్న రాజకీయ చతురతతో ఆ ప్రాంతానికి ఎమ్. ఎల్. ఏ. అయ్యాడు.

నారాయణరావుగారి భార్య తాయారమ్మ. నలభై యేళ్ళ పడిలో పడినా ఇరవై ఏళ్ళ పడుచులా ఉండేది ఆమె. నాయుడిగారు కన్ను ఆమెమీద పడింది. తరచూ ఆ యింటికి వచ్చిపోతూండేవాడు అతని మనస్సులోని దుగుద్దేశాన్ని గ్రహించని మాష్టారు దంపతులు, యింటికి వచ్చినప్పుడల్లా అతనికి సకల మర్యాదలూ చేసేవారు.

మాష్టారుకు యిద్దరు పిల్లలు.

పెద్దవాడు శివరావు, టౌన్‌లో వున్న విక్టోరియా కాలేజీలో చదువు పూర్తి చేసి ఉద్యోగ ప్రయత్నంలో ఉన్నాడు. చాలా తెలివైనవాడూ, చురుకైనవాడూను. ఐ.ఏ.ఎస్‌కు కృషి చేద్దాం—అనుకున్నాడు.

రెండోది అమ్మాయి. దీప్తి—చలాకీ అయిన పిల్ల.

ఆ రోజు మాష్టారి కుటుంబం చెల్లాచెదరయిపోయిన రోజు. శివరావు జీవితాన్ని మార్చేసిన రోజు—శ్రీరామనవమి.

తిళ్ళకుప్పలో శ్రీరామనవమి — అంటే ఆ చుట్టుప్రక్కల గ్రామాలకే సందడి. నవరాత్రులు చాలా హడావుడిగా జరుగుతోన్నాయి.

నవమి రోజు సినీమా నటులచే నాటకం అరేంజి చేశారు. నవరాత్రులకు శివరావే అధ్వర్యం వహించాడు.

పందిరంతా కలయ తిరుగుతోన్నాడు. కొడుకు చలాకీతనానికి మురిసిపోయి నారాయణరావుగారు అతడికి చిన్న చిన్న పనుల్లో సాయపడుతోన్నారు.

రాత్రి ఎనిమిది గంటలయింది.

"ఒరేయ్ భోజనం చేద్దాం రారా! మళ్ళీ అతిథులు వచ్చేస్తే నీకు కుదరదు" అన్నాడు నారాయణరావు కొడుకును ఉద్దేశించి.

"మీరు వెళ్ళండి నాన్నా. యిక్కడ ఎవరో ఒకరు ఉండాలి. లేకపోతే బావోదు. రామయ్య మాష్టారు వస్తానన్నారు. ఆయన వస్తే నేను వస్తాను. లేకపోతే మీరు వచ్చాక వస్తాను" అన్నాడు.

నారాయణరావుగారు తలవూపి వెళ్ళిపోయారు.

అంతలో రామయ్య మాష్టారు అక్కడకు వచ్చారు. ఆయన ఆ ప్రక్క ఊళ్ళో వున్న స్కూల్లో పనిచేస్తున్నారు. నారాయణరావుగారి ఆప్తమిత్రుడు. "ఏరా! శివూ యింకా యింటికి వెళ్ళలేదా!" అన్నాడాయన వస్తూనే.

"లేదు. మాష్టారూ! మీరు వస్తే వెళదామని."

"సరే వెళ్ళు!"

శివరావు యింటికి బయలుదేరాడు. శివరావు చిన్నతనంనుండీ రామయ్య మాష్టారి దగ్గరే చదువుకున్నాడు. అందుకు అతనికి, ఆయనంటే ఎనలేని గౌరవం. ఆయనకు కూడా శిష్యుడంటే వల్లమాలిన అభిమానం. ఆ గురుశిష్య అనుబంధం అనిర్వచనీయం.

గ్రామం అంతా చీకటిగా వుంది.

నారాయణరావుగారి ఇల్లు ఊరికి ఉత్తరంగా వున్న కొబ్బరి తోటలో వుంది.

శివరావు ఏటిగట్టుమీంచి నడుస్తున్నాడు. చలిగాలి రివ్వున వీస్తోంది. దూరంగా వుత్సవం తాలూకు సందడులు వినిపిస్తోన్నాయి శివరావు వేగంగా నడుస్తూ యింటికి చేరుకున్నాడు.

ఆ యింటి చుట్టుప్రక్కల మరో యిల్లు లేదు.

ఇంటికి చేరుకున్న శివరావుకు వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి. ఏదో అనుమానం వచ్చింది. తాత్సారం చెయ్యకుండా తలుపును బలంగా తన్నాడు.

తలుపులు తెరచుకున్నాయి.

లోపలి దృశ్యాన్ని చూసిన శివరావు రక్తం వుడికిపోయింది.

తండ్రి క్రింద రక్తం మడుగులో పడున్నాడు. మంచం మీద తల్లిని నాయుడు ఆక్రమించుకుంటున్నాడు.

శివరావు వడిగా లోపలకు వెళ్ళాడు. నారాయణరావు గుండెల్లో వున్న కత్తిని బయటకు లాగాడు. నాయుడుని కసిదీరా పొడిచాడు. తల్లి మానాన్ని కాపాడాడు. తండ్రి చావుకి ప్రతీకారం తీర్చుకున్నాడు.

నాయుడిగారి హత్యావార్త ఆ వూళ్ళో చాలా అలజడిని లేపింది.

పెద్దవాళ్ళందరూ ఒకటైపోయారు.

నారాయణరావు; తన భార్యను నాయుడికి తార్చేవాడనీ, విషయం తెలిసిన శివరావు అవమానంతో కుమిలిపోయాడని, అవకాశంకోసం కాచుకున్నాడనీ, అవకాశం రాగానే తండ్రినీ, నాయుడినీ చంపేశాడనీ__ మరి తల్లిని ఎందుకు చంపలేదో తెలియదని__సాక్ష్యాలు సృష్టించారు. శివరావు పారిపోయాడు.

ఆ వూరికి క్రొత్తగా వచ్చిన ఇన్‌స్పెక్టర్-సత్తిరాజు

యిదంతా నిజం అని నమ్మాను. శివరావుని పట్టుకుంటా
నని ప్రతిజ్ఞ చేశాడు.

శివరావుకు తరువాత ఏం చెయ్యాలో అర్థం కాలేదు. అతనికి ఆ సమయంలో ఏం చెయ్యాలో తెలియక అలా ప్రవర్తించాడు. తీరా తెలివి వచ్చాక, తను చేసిన తప్పును తెలుసుకుని పశ్చాత్తాపపడ్డాడు. చేసిన తప్పుకు తను శిక్షను అనుభవించటానికి సిద్ధమే. కానీ తనపై కన్న తండ్రిని చంపిన నేరాన్ని మోపారు. రెండు హత్యలను చేశాడన్న ఆరోపణను నమ్మిన న్యాయస్థానం ఉరిశిక్ష ఖాయం చేసి తీరుతుంది.

ఉరిశిక్షే గనక ఖాయం అయితే తన తల్లీ, చెల్లీ యేమయిపోతారు.

తల్లి పోలీస్ స్టేషన్‌లో తనపై అత్యాచారం జరుగుతోండగా శివరావు వచ్చాడనీ, తన తండ్రిని చంపి తల్లిని పాడుచెయ్యబోతోన్న నాయుడును, తన మాన రక్షణకోసం చంపాడనీ స్టేట్‌మెంటు యిచ్చింది.

కానీ ఆమె స్టేట్‌మెంటును పట్టించుకునే నాథుడే లేకపోయాడు.

చేసేదిలేక శివరావు నల్లమలై అడవులకు పారిపోయి వచ్చాడు. దొంగతనాలు మొదలు పెట్టాడు.

# 8

చెప్పడం ఆపి శివరావు గట్టిగా ఊపిరితీశాడు.

వసుధ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "ఆ ఘోరం జరిగే టప్పుడు మీ చెల్లి అక్కడ లేదా!" అంది.

"లేదు. నవమి పండిట్లో వుంది! దాన్ని మళ్ళీ నేను వెళ్ళి పండిట్లో చూడటమే."

వాళ్ళిద్దరూ యింకా అనేక విషయాల గురించి మాట్లాడుకున్నారు.

మెల్ల మెల్లగా వసుధ అతనిపట్ల ఆకర్షితురాలయి పోతోంది.

రాత్రంతా ఎలా గడిచిందో వాళ్ళకే తెలియదు.

తూర్పున తెల్లగా తెలవారుతోంది.

"మీ సంగతి తెలిస్తే, మీ తల్లి భర్త ఆమెను ఏలుకుంటాడనుకుంటున్నారా?" అని అడిగింది వసుధ.

"నా గురించి అతనికి తెలుసు. కానీ యిప్పుడు ఇంత బరితెగించానని తెలిస్తే ఏం చేస్తాడో మాత్రం తెలియదు."

వున్నట్టుండి వసుధకు తను చెట్టుకు కట్టిన చీర చెరగు గుర్తుకు వచ్చింది. ఆమె మనసు విలవిలలాడిపోయింది. తనకు ఏ అపకారం చేయని ఒక మంచి వ్యక్తిని మోసం చేస్తున్నానేమో అని బాధపడింది. శివరావుతో యేదో చెప్పబోయింది.

కానీ అప్పటికే ఆలస్యం అయిపోయింది.

మృత్యువు శివరావుకోసం గుహ బయట కాపుకాసిందని ఆమెకు తెలియదు. మాటేసిన మృత్యువుకు శివరావు బలికావటానికి నూటికి నూరుపాళ్ళు తనే కారణం అని గ్రహించగలగటం తప్ప ఆమెకు చివరకు ఏమీ మిగలదు.

ఆమె ఏం చెప్పబోతుందో—అని ఎదురుచూస్తోన్న శివరావుకు వెన్ను జలదరించింది. వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి. చురుకుగా లేచి నిలబడ్డాడు. గుహ బయటకు వచ్చాడు. అదే అతనుచేసిన పొరబాటు.

# 9

సూర్యుడు తూరుపు కొండల పైకి వస్తోన్నాడు. అతడి కిరణాలు తీక్ష్ణతను పుంజుకుంటున్నాయి.

నల్లమలై ఘాటురోడ్డుమీద జీపు పరుగెడుతోంది.

శివరావు నల్లమలై అడవులలో వున్నాడని మాత్రం బలమైన ఆధారాలు వున్నాయి. కానీ యెక్కడున్నాడో మాత్రం చూచాయిగానైనా తెలియదు. పోనీ ఫోర్సును పెట్టి వెతికిద్దామా! అంటే అతని చేతిలో యిప్పుడు వసుధ వుంది. పొరపాటు జరిగితే ఆమె ప్రాణానికి ముప్పువాటిల్లే అవకాశం వుంది. సత్తిరాజుకు చేతులు కట్టేసినట్టయింది.

జీపు పెద్ద కొండవాలు దగ్గరకు వచ్చింది.

"ఇక్కడ దిగి మొహాలు కడుక్కొని ముందుకు వెళదాం!" అన్నాడు సత్తిరాజు.

అతని నోటినుండి ఆ మాట వచ్చిందో లేదో—కానిస్టేబుల్స్ ఒక్క వుదుటున క్రిందకు దూకేశారు.

సత్తిరాజు జీపు దిగి—నోట్లో పందుంపుల్ల పెట్టుకుని నములుతో పచార్లు ఆరంభించాడు.

పచార్లు చేస్తోన్న వాడల్లా పైకి చూశాడు.

కొండవాలుగా ఒక చెట్టు వ్రేలాడుతోంది. క్రింద నుండి పైకిచూసేవాళ్ళకు అది మీదపడుతుందేమో అనిపిస్తుంది. ఆ చెట్టుకు చుట్టబెట్టుకొని ఒక కొండచిలువ క్రిందకూ మీదకూ జారుతోంది.

సత్తిరాజును ఆకర్షించింది, ఆ చెట్టు కాదు, దానికి వున్న కొండచిలువకాదు. సన్నటి ఆధారానికి వ్రేలాడుతోన్న చిన్న చెట్టు కొమ్మ. అది అతనికి ఏదో అసహజంగా అనిపించింది. అడవిలో ఓపికగా యెవరూ అలాటి

పనులు చేయటానికి రారు. ఎవరో కావాలని అలా చేశారు. అంటే దీని వెనుక బలమైన కారణం వుండి తీరుతుంది. అతని పోలీసు మెదడు తీవ్రంగా పని చేసింది.

వెంటనే తనవాళ్ళను తీసుకొని జీపెక్కాడు, వలయంలా తిరిగి జీపు ఆ చెట్టు దగ్గరకు వచ్చింది. పిస్టల్ తీసి కొండచిలువకు గురిచూసి కాల్చాడు సత్తిరాజు.

అది గింగిరాలు కొడుతూ, క్రింద పడిపోయింది. సైలన్సరు అమర్చి వుండటంవలన పిస్టల్ ప్రేలిన మోత అంతగా లేదు.

ఒక కానిస్టేబుల్ నెమ్మదిగా చెట్టుమీదకు పాకి చీర చెరగును విప్పి తీసుకొని వచ్చాడు సత్తిరాజు ఆ చెరగును బాగా పరిశీలించాడు. అందులో వున్న కాగితాన్ని బయటకు తీశాడు.

అది శివరావు గుహను తెలిపే కాగితం.

వసుధ తెలివితేటలకు సత్తిరాజు జోహార్లర్పించి జీపును ముందుకు వురికించాడు. డ్రైవింగ్‌ను స్వయంగా చేశాడు.

పదినిముషాలలో కాగితం ప్రకారం గుహ పరిసరాలకు వచ్చారు.

జీపును దూరంగా ఆపి నెమ్మదిగా అడుగులు వేస్తూ గుహ దగ్గరకు నడిచాడు సత్తిరాజు. అతడి అనుచరులు కూడా అతడిని అనుసరించారు.

అందరి చేతులలోనూ పిస్తోళ్ళు ప్రత్యక్షమయ్యాయి.

సత్తిరాజు అనుచరులకు సూచనలు ఇచ్చాడు— వాళ్ళందరూ వలయంగా యేర్పడి ముందుకు నడిచారు.

అంతలో శివరావు సుడిగాలిలా బయటకు వచ్చాడు

పోలీసుల చేతుల్లోని పిస్తోళ్ళన్నీ ఒకేసారి గర్జించాయి.

గిలగిలా తన్నుకుంటూ నేలమీద పడిపోయాడు శివరావు.

ఆ దృశ్యాన్ని చూసి కళ్ళుతిరిగి పడిపోయింది వసుధ.

సత్తిరాజు మాత్రం తన విధిని సక్రమంగా నిర్వహించానన్న తృప్తితో శివరావు శవాన్నీ, అదే స్థితిలో వున్న వసుధను తీసుకొని వెనుదిరిగాడు.

—: అయిపోయింది :—

# వజ్ర కిరీటం

ఎ. యస్. రావ్

(గత సంచిక తరువాయి)

## 12

అతను పద్మాసనం వేసుకొని, మంచంమీద వినాయకుడిలా కూచున్నాడు. చేతికి అందేంత దూరంలో వున్న టెలిఫోన్ మీదే అతని చూపులు నిలిచాయి; మూతి పెట్టిన పాలగిన్నెమీదున్న పిల్లి చూపుల్లా అసహనంగా అతను నాలుగు చెంచాల పాన్‌పరాగ్‌ని నోట్లో పోసుకున్నాడు. కరకర నముల్తూ ఇండియా కింగ్స్ సిగరెట్ వెలిగించాడు. ఇరవై నిమిషాల క్రితమే ఫోన్ మోగి వుండాలి. అతనెందుకు ఇంకా తనని కాంటాక్ట్ చేయలేదు? చివరి నిమిషంలో మనసు మార్చుకొని, లంకె బిందెలతో తోక ఝాడించాడా? నగ్నంగా వున్న తన ఛాతీని, బొజ్జనీ అతను అర చేత్తో రుద్దుకున్నాడు. మోసం జరిగితే తను ఏం చేయాలి?

సలుపు పుట్టిస్తూ అతనిలో సాగుతున్న వెయ్యి ఆలో

చనల్ని చెల్లాచెదురు చేస్తూ టెలిఫోన్ మోగింది. ఉలిక్కిపడిన అతని చేతిలోంచి సిగరెట్ కిందికి జారింది. ఏనుగు తొండంలాంటి అతని చెయ్యి రిసీవర్ని తటాలున లాగి, చెవికి ఆన్చింది.

"యస్!" అన్నాడతను బొంగురుగా.

"మిస్టర్ గుప్తా, సరుకు మీ గోడౌన్‌లో డెలివరీ ఇవ్వబడుతుంది. బిల్లు పైకం రెడీగా వుంచండి...." అవతలి కంఠం స్పష్టంగా, సన్నగా ధ్వనించింది.

గుప్తా మొహం వెడల్పుగా సాగింది. అతని కళ్ళు వజ్రాల్లా మెరిశాయి. "వెల్‌కమ్! త్వరగా రండి!" ఉత్సాహంతో అరిచాడతను.

"పది నిమిషాల్లో అక్కడుంటాను."

"ఒక్క క్షణం.........ఇప్పుడెక్కడున్నావు?" గుప్తా ఆత్రంగా అడిగాడు.

"అది మీకు అనవసరం!" అవతలి కంఠం కటువుగా అంది.

"నాన్సెన్స్! అది ఆవశ్యకరం! లాస్ట్ మోమెంట్‌లో ఎవరైనా నిన్ను ఫాలో చేస్తూ నా దగ్గరికి రావచ్చు. అలా జరగడం నాకు ఇష్టంలేదు. ఎక్కడున్నావో చెప్తే, ఎలా ఇక్కడికి రావాలో చెప్తాను...." గుప్తా తొందర తొందరగా అన్నాడు.

బొంగురు కంఠం సగర్వంగా అతని చెవిలో నవ్వింది. "మిస్టర్ గుప్తా, అరణ్యంలో ఎలా నడవాలో చిటారే సింహానికి ఎవ్వరూ చెప్పనక్కర్లేదు! బీ రెడీ అండ్ కీప్ ఎవ్వరిథింగ్ రెడీ!"

ఫోన్ క్లిక్ అంది. గుప్తా నిట్టూరుస్తూ రిసీవర్ని పెట్టేశాడు. అతని రొడమ చెయ్యి మంచంకిందికి పాములా

పాగింది. చూపుడువేలు చిన్న నాబ్ ని నొక్కింది. గుప్తా ఉషారుగా కొత్త సిగరెట్ వెలిగించాడు.

ఐరన్ సేఫ్ డోర్ లా వున్న తలుపు చప్పుడు కాకుండా తెరుచుకుంది. చప్పుడు చేయకుండా అక్కడ ప్రత్యక్షమైన వ్యక్తిని గుప్తా చిరునవ్వుతో చూశాడు.

అతను సన్నగా, పొడుగ్గా వున్నాడు. నల్లటి వెంట్రుకలతో నిండిన అతని ముంజేతులు ఎలుగ్గొడ్డు కాళ్ళలా వున్నాయి. పల్చటి జుట్టు నున్నగా వెనక్కి దువ్వబడింది. బాగా బలిసిన గొంగళిపురుగుల్లా వున్న కనుబొమలు మధ్యలో కలుసుకున్నాయి. వాటికింద చిన్నచిన్న కళ్ళు నల్లటి తెరలోని రెండు చిల్లుల్లా అవుపిస్తున్నాయి. రెండు చెవుల్లోంచీ పొడుగ్గా పొడుచుకువచ్చిన వెంట్రుకలు విసరడానికి ఎవరో పట్టుకున్న విసనకర్రల్లా వున్నాయి. పొగమూరిన పెదవుల సందులోంచీ పసుప్పచ్చరంగులో ఉన్న గొగ్గిరిపళ్ళని చూపిస్తూ అతను గుప్తా వైపు నవ్వుతున్నాడు.

గుప్తా అతన్ని దగ్గరగా రమ్మని సైగ చేశాడు. అతను నీడలా కదిలి గుప్తా దగ్గరగా ఆగాడు. అతను నడుస్తూంటే ఏమాత్రం చప్పుడూ అవలేదు.

“మంగూ, కాస్సేపట్లో వెన్న మనకి డెలివరీ ఇవ్వబడుతుంది. పావు గంటలో అది కరిగి, ఆకారం మారిపోవాలి! అర్థమైందిగా?” గుప్తా నవ్వుతూ అడిగాడు.

మంగూ తల వెనక్కి ముందుకీ ఊగింది.

“సరుకు ఇచ్చినతనికి మనం పేమెంట్ ఇవ్వాలి. రెడీగా ప్యాక్ చేశావా?” గుప్తా మళ్ళీ ప్రశ్నించాడు.

“సూట్ కేసులో సర్ది వుంచాను....” మంగూ కంఠం ఎద్దు కాలికింద నలిగిన బోదురుకప్ప కంఠంలా ఉంది.

"గుడ్. వెళ్ళి మేడగదిలో కిటికీ ముందు నిలబడు. బీరువాలోంచి పవర్‌ఫుల్ బైనాక్యులర్స్ తీసుకెళ్ళు. పార్టీ ఒకడే వస్తున్నాడో, వెంట ఎవరేనా వున్నారో చూడు. మన కాంపౌండ్‌లో ప్రవేశించే అతన్ని మరెవ రేనా రహస్యంగా ఫాలో అవుతున్నారేమో జాగ్రత్తగా గమనించి, తిరిగిరా. నువ్వొచ్చేదాకా అతనితో బేర మాడుతూ వుంటాను" గుప్తా అధికారపూర్వకంగా అన్నాడు.

మంగూ మరబొమ్మలా కదిలాడు. కాస్సేపట్లో అతన్ని మాయం చేస్తూ తలుపు మూసుకుంది....

## 13

చిన్న గదిమధ్యలో వున్న కుర్చీలో బలరామ్ ఠీవిగా కూచున్నాడు. వయిట్ సూట్‌లో వున్న అతని ముందు ముగ్గురూ వరసగా నిలబడ్డారు. అంతకు ముందే గీయబడిన వాళ్ళ గెడ్డాలు నున్నగా మెరుస్తున్నాయి. పంచాజుబ్బా తీసేసిన విశ్వకర్మారావు తన మామూలు దుస్తులు—పైజామా, జుబ్బా—ధరించాడు. ఆనందంతో నిండిపోయి ఉబ్బినట్టున్న వాళ్ళ ముహాల్లోకి బలరామ్ చిరునవ్వుతో చూశాడు. పెదవుల చివర్లలో వంకీలు తిరిగిన సన్నటి మీసాల్ని సగర్వంగా వేలితో అదుముకున్నాడు.

"నేను అయిదునిమిషాల్లో బయల్దేరుతాను. నా అంచనా ప్రకారం పన్నెండు తరువాత, తిరిగొస్తాను; సరుకును క్యాష్‌గా మార్చుకుని. తరువాత ఎవరి వాటా వాళ్ళకి పంచబడుతుంది........" బలరామ్ ఆగి, చూశాడు.

విశ్వకర్మారావు కళ్ళద్దాల్ని తీసి, ఆవేశంతో తుడిచి, మళ్ళీ తగిలించాడు. రాంజోగి ఉద్రేకంతో మెటికలు

విరుచుకొని, ధారాళంగా నవ్వుతూ చూశాడు. గజపతి కళ్ళల్లో తడి విపరీతంగా ఎక్కువైంది.

"విశ్వకర్మారావ్, వాటాలు పంచుకున్నాక మీరు వొళ్ళు మరిచిపోకూడదు! అకస్మాత్తుగా మీకు ఐశ్వర్యం అబ్బినట్టు లోకానికి అనుమానం రాకూడదు. కనీసం ఏడాదిపాటు మీరు ముగ్గురూ గతంలోలాగే సింపుల్ గా జీవించాలి. వెలుగు వెలిగే ప్రయత్నం చేశారా, అందరం ఆరిపోతాం!" బలరామ్ నవ్వుతూ అన్నాడు.

విశ్వకర్మారావు నిరుత్సాహంగా చూశాడు. "పండించిన విస్తరిముందు నోరూ చేతులు లేనివాడిలా కూచోడం అంత సులువైన పనికాదు! నూర్చిన పంటను నోరారా తినడం నా కిష్టం...."

బలరామ్ అతని మొహంలోకి తీక్షణంగా చూశాడు. "విశ్వకర్మారావ్, కోసుకున్న పళ్ళను గుట్టుచప్పుడు కాకుండా తిను! నువ్వు తినడం ఇతర్లకు కనబడకూడదు; త్రేన్చడం ఇతర్లకి వినపడకూడదు!"

విశ్వకర్మారావు మాట్లాడకుండా, జేబులోంచి సిగరెట్ తీసి వెలిగించాడు. బలరామ్ సలహా అతనికి నచ్చలేదని అతని వాలకం చెప్తోంది.

గజపతినీ, రాంజోగినీ చూశాడు బలరామ్. "నేను చెప్పింది మీ బుర్రల్లోకి ఎక్కిందా?"

ఇద్దరూ బుర్రలు ఆడించారు. "అర్నెల్లు గడిచేదాకా అతి సాదాగా బతుకుతాం. ఆ తరువాత ఏదో మారుమూల ప్రదేశాలకు వలస వెళ్ళిపోయి, కొత్త జీవితం ప్రారంభిస్తాం!" అన్నాడు గజపతి నవ్వుతూ.... అవునన్నట్టు రాంజోగి తలాడించాడు.

"విశ్వకర్మారావ్, అంతా ఒకేసారి అందిస్తే నీకు

అజీర్తి చేసేలా వుంది! వాయిదాల పద్ధతిమీద కొద్ది కొద్దిగా ఇస్తాను" బలరామ్ కంఠంలో ఏదో నిర్ణయం గంటలా ధ్వనించింది.

విశ్వకర్మారావు వేళ్ళ సందుల్లోంచీ సిగరెట్ కిందికి జారిపడింది. సిగరెట్‌ని మరిచిపోయి అతను కంగారుగా బలరామ్ మొహంలోకి చూశాడు. బలరామ్ మొహంలో వ్యంగ్యం కనిపించడంలేదు.

"అయామ్ సారీ....మిష్టర్....బల....సారీ బాస్.... మీరు చెప్పినట్టే జాగర్తగా వుంటాను. ఏడాది కాక పోతే, రెండేళ్ళపాటు ఇదే పైజామా జుబ్బాతో గడిపేస్తాను....ఇన్‌స్టాల్‌మెంట్స్ వొద్దు. ఒకేసారి, ఈ రోజే నా వాటా నాకు పంచండి!" అన్నాడతను కంగారుగా.

బలరామ్ చిన్నగా నవ్వాడు. "మీ ముగ్గుర్నీ నమ్ముతున్నాను. ఈ క్షణందాకా ఎంత జాగర్తగా వున్నామో, ఇకముందు కూడా, జరిగిందాన్ని అంతా మరిచిపోయేదాకా—అంతే జాగర్తగా వుండాలి. మీ ముగ్గుర్నీ ఓ కంట కనిపెట్టి వుంటాను. రెక్కలు పూర్తిగా విప్పితే, కత్తిరించేస్తాను!"

ముగ్గురూ గతుక్కుమంటూ చూశారు. గజపతి ముందుగా తెప్పరిల్లాడు. తడికళ్ళతో చిరునవ్వుతో చూశాడు. "మన క్షేమం కోసమే మీరు యిదంతా చెప్తున్నారు. మీ సూచనల్ని ఖచ్చితంగా పాటిస్తాం!"

"అది మీకే మంచిది!" అంటూ బలరామ్ కుర్చీలోంచి లేచాడు. "నేను తిరిగొచ్చేదాకా మీరిక్కడే వుండండి!"

విశ్వకర్మారావు కిందికి వొంగి ఆరిపోతున్న సిగరెట్‌ని

అందుకున్నాడు. "బాస్ .... ఇక్కణ్నుంచీ బరువు మోసు కుంటూ వెళ్ళాలంటే కంగారుగా వుంది. నా యింట్లో నేలమాళిగలో వుంటాం. మీరు .... మీరు అక్కడికే రండి...." అన్నాడతను తడబడుతూ.

బలరామ్ అతన్ని చిరునవ్వుతో చూశాడు. "అదే మంచిదనిపిస్తోంది. నువ్వు సులువుగా ఎక్సైట్ అయి పోతావు. కిరీటాన్ని చూస్తూన్నప్పుడు శోషొచ్చి పడి పోతావేమో అనుకున్నా!" అంటూ మంచం కిందున్న వెడల్పాటి లెదర్ బాగ్ ని అందుకున్నాడతను.

"పన్నెండున్నర దాటేక...."

"బాస్, వస్తారుగా?" విశ్వకర్మారావు వణికే కంఠంతో ప్రశ్నించాడు.

రెండడుగులు వేసిన బలరామ్ తటాలున ఆగాడు. మెల్లిగా తల తిప్పి విశ్వకర్మారావుని తదేకంగా చూశాడు. విశ్వకర్మారావు మొహం భయంతో చెమటతో తడుస్తోంది. అతని కళ్ళు అద్దంబిళ్ళలా మినుకు మినుకుమంటున్నాయి.

"విశ్వకర్మారావ్, బుద్ధితక్కువ ప్రశ్న వేశావ్! నేను రాను. మొత్తం సొమ్ముతో పరారై పోతాను; మీ అందరి నోళ్ళలో దుమ్ముకొట్టి! తెల్లారేక పోలీస్ స్టేషన్ కెళ్ళు. అప్రూవర్ గా మారిపో. నా గురించి నీకంతా తెలుసు. అంతా చెప్పెయ్. గజపతీ, రాంజోగీ సాక్ష్యం పలుకుతారు. తరువాత పోలీసులు వేటాడి నన్ను పట్టే స్తారు. పట్టిచ్చిన మిమ్మల్ని వొదిలేస్తారు. అప్పుడు, మిత్ర ద్రోహం చేసిన బలరామ్ కి తగిన శిక్ష విధించిన తృప్తి మీకు మిగులుంది! ఓకే?" బలరామ్ గంభీరంగా అన్నాడు.

విశ్వకర్మారావు రెప్ప వేయడం మరచిపోయి చూస్తూండిపోయాడు, ఎగతాళిగా బలరామ్ అన్న మాట లోని అంతరార్థం గ్రహించడానికి అతనికి రెండు క్షణాలు పట్టింది. మెల్లిగా కదిలి బలరామ్ చేతిని పట్టు కొన్నాడు.

"బాస్ ...క్షమించండి. బెల్లంరాశిని చూసిన చీమలా బెంబేలు పడిపోయాను!" అతని కంఠం వణికింది.

బలరామ్ చిన్నగా నవ్వాడు. "విశ్వకర్మారావ్, చీమ లాగే చివరిదాకా వుండొద్దు. ఎదుగు!"

విశ్వకర్మారావు గుటకలు మింగుతూ చూశాడు. బల రామ్ దూరం దూరంగా అంగలు వేసుకుంటూ గుమ్మం వైపు కదిలాడు.

"బాస్ .." విశ్వకర్మారావు కంఠం అతన్ని ఆపింది. వెనుదిరిగి విసుగ్గా చూశాడతను.

"మళ్ళీ ఏమిటి?"

"బాస్ ... కుంకుమ ....ఎక్కడుంది? వాటా ...." విశ్వ కర్మారావు కంఠం మూగవోయింది.

"ఎక్కడ వుండాలో అక్కడుంటుంది. ఆమెకి చేరా ల్సింది ఆమెకి చేరుతుంది నీకు ...."

"బాస్ ....అంత డబ్బు చేతికొచ్చాక ఆడదానికి.... మగతోడు వుండటం మంచిది...." విశ్వకర్మారావు అడ్డు తగుల్తూ అన్నాడు.

బలరామ్ వడగళ్ళలాంటి కళ్ళతో అతని మొహాన్ని తీక్షణంగా, పరిశీలనగా చూశాడు.

"విశ్వకర్మారావ్, మగతోడుగా నువ్వుంటావా?" బలరామ్ సూటిగా ప్రశ్నించాడు.

విశ్వకర్మారావు బలవంతంగా చిరునవ్వు నవ్వాడు.

అరచేతిని హస్తసాముద్రికుడిలా క్షణకాలం చూసు
కున్నాడు. "భార్య చనిపోయాక, పదేళ్ళుగా ఇలాగే ఒంటరిగా ఉండిపోయాను. ఇప్పుడు హాయిగా జీవించడానికి అవకాశం చిక్కింది....కుంకుమని నాకు తోడుగా చేసుకొని, ఆమె తోడుగా....ఉంటానికి నాకు అభ్యంతరం లేదు....కుంకుమ....మీరు చెప్తే అంగీకరిస్తుంది...." అతని కంఠంలో ఆశా, సిగ్గూ పెనవేసుకొన్నాయి.

బలరామ్ పగలబడి నవ్వాడు. విశ్వకర్మారావు తటాలున తలెత్తి చూశాడు. "విశ్వకర్మారావ్, కుంకుమని నమ్ముకుంటే నువ్వు నెలతిరక్కముందే విభూతి రాసుకుని బైరాగుల్లో కలిసిపోతావ్? కుంకుమని మరిచిపో. నీ జేబుల్లో డబ్బు చేరుతుంది. ఏ పసుపునో, కాటుకనో కట్టుకుని గుట్టుగా బతుకు!" బలరామ్ నవ్వుతూ అన్నాడు. గజపతి, రాంజోగీ నవ్వారు.

"బాస్...." దెబ్బతిన్న విశ్వకర్మారావు ఏదో గొణగబోయాడు.

"విశ్వకర్మారావ్, యూ ఆర్ వేస్టింగ్ టైమ్. నువ్వు నకిలీ వస్తువుల ఎక్స్‌పర్ట్‌వి కుంకుమ లాంటి అసలు వస్తువుల్ని నీ చేతుల్లో పట్టుకోలేవు! గుర్తుంచుకో!" బలరామ్ కదిలించి వెళ్ళిపోయాడు....

## 14

సడెన్ బ్రేకుతో కారాపి, డిటెక్టివ్ టెంపో తన పక్కనే కూచున్న ఐ.జీ.ని చూశాడు.

"మీరు దిగిపొండి. ఫోను ముందు కూచోండి. ఏదైనా తెలియగానే తెలియజేస్తాం" అన్నాడతను.

"మిస్టర్ టెంపో, ఎక్కడి కెళ్తున్నారు?" ఐ.జీ.

ప్రశ్నించాడు.

"తెలీదు."

ఐ.జీ. ఆశ్చర్యంగా చూశాడు. "ఏం చేయాలనుకుంటున్నారు?"

"తెలీదు" టెంపో నవ్వుతూ అన్నాడు.

"మిస్టర్ టెంపో...." ఐ.జీ. అర్థంకానట్టు చూస్తూ ఆగాడు.

"ఏదో చెయ్యాలి. ఎక్కడికో వెళ్ళాలి మీరు రెస్టు తీసుకోవాలనుకొంటే ఎవర్నైనా తగిన ఆఫీసర్ని ఫోన్ ముందు కూచోబెట్టండి...."

"మిస్టర్ టెంపో, పర్వతం రోడ్డుని బ్లాక్ చేసినట్టే, సిటీ రోడ్లన్నీ బ్లాక్ చేయించి వుంటే బావుండేది. కంగారులో మరచిపోయాం. పైగా అసలు వ్యక్తులు అప్పటికి కిందికి దిగలేదని అనుకున్నాం...." ఐ.జీ. నిట్టూర్చాడు.

"నెవర్ మైండ్. ప్రవహించుకుపోయిన నీళ్ళ గురించి విచారించడం దండగ. ఏమీ జరగనట్టు పోలీసులు ఊరుకోడం మంచిది. స్వామీజీ ధరించిన కిరీటం అసలుదే అని అందరూ అనుకొంటున్నారని 'వాళ్ళు' అనుకోడం మంచిది" టెంపో నవ్వుతూ అన్నాడు.

"అయితే మీరే...."

"నేనే ప్రయత్నిస్తాను. ఏదో క్లూని ఆధారం చేసుకొని వాసన పట్టుకుంటూ వెళ్ళాలి!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"మిస్టర్ టెంపో, క్లూ ఏదీ లేదనుకుంటాను...." ఐ.జీ. సందేహిస్తూ అన్నాడు.

"అనవాళ్ళు లేకుండా ఎవ్వరూ అడుగులు వేయలేరు"

టెంపో నవ్వుతూ అన్నాడు.

ఐ.జీ. డోర్ తెరిచి కిందికి దిగాడు. "ఆల్ రైట్! మీ ప్రయత్నంలో మీరుండండి. మా వాళ్ళతో చర్చించి, మేం చేయాల్సింది చేస్తాం. నేను ఫోన్ దగ్గరే వుంటాను."

టెంపో కార్ని ముందుకి పోనిచ్చాడు. అతని కళ్ళు రోడ్డు రెండువైపులా యెవరికోసమో వెతుకుతున్నాయి. అయిదు నిమిషాల తర్వాత అతని కళ్ళు మెరిశాయి. వీధి లైటు కింద. మలుపు దగ్గరగా పేవ్ మెంటుమీద ఆ వ్యక్తి నిలబడ్డాడు. అతని వేళ్ళమధ్య సిగరెట్ కాలుతోంది. అతని దగ్గరగా కారాపి, టెంపో ఎడంచేత్తో డోర్ని తెరుస్తూ తోశాడు. వయిట్ డ్రస్‌లో వున్న ఆ వ్యక్తి కార్లో యెక్కి డోర్ని మూసేశాడు, కారు కదిలింది.

"ఏమిటి కథ?" డిటెక్టివ్ టెంపో రోడ్డుని చూస్తూ అడిగాడు.

"పువ్వులు సప్లై చేసే డజనుమంది వ్యక్తుల్ని కలుసుకున్నాను, మైసూరు మల్లెలు మన ప్రాంతంలో దొరకవన్న మీ అనుమానం మంచి పునాది! 'సిటీ ఫ్లవర్ సప్లైయర్స్'లో యెవరో బోలెడన్ని మైసూరు మల్లెలు ఆర్డరిచ్చారు. షాపు వాళ్ళు బెంగుళూరున్నించీ స్పెషల్ ఆర్డర్ మీద పాతికకిలోల మైసూరు మల్లెల్ని తెప్పించా ...."

"ప్రభంజనం, ఆర్డరిచ్చిన వ్యక్తి యెవరు?" డిటెక్టివ్ టెంపో అడ్డొస్తూ అడిగాడు.

"పల్చటి తెల్లచీరా, పల్చటి తెల్ల జాకెట్టూ...." ప్రభంజనం నవ్వుతూ అన్నాడు.

టెంపో చిన్నగా విజిల్ వేశాడు. "సో, అనదర్

ఫిమేల్ మెంబర్! పల్చటి తెల్లచీర జాకెట్ల కోసం మనం వెతకాలి!"

"టెంపోగారూ! అలాంటి పల్చటి తెల్లటి స్త్రీనూ దుస్తుల్ని యాక్సిడెంటల్ గా చూశాను...." ప్రభంజనం నవ్వుతూ అన్నాడు.

"ఎక్కడ? యిప్పుడు?" అప్రయత్నంగా బ్రేక్ నొక్కుతూ టెంపో ప్రశ్నించాడు.

"ఎవర్నో, యేదో అడగడానికి పబ్లిక్ బూత్ దగ్గర ఆగాను. బూత్ లో తెల్లచీరా, తెల్ల జాకెట్ కోకిల కంఠంతో...."

"కమాన్! ఆ సంభాషణ విన్నావా?" టెంపో అడ్డొస్తూ అడిగాడు.

"ఆలసిపోయి, బూత్ కి ఆనుకొని సిగరెట్ కాలుస్తూ నిలబడ్డాను....సంభాషణ—వన్ సైడెడ్ సంభాషణ—విన్నాను...." ప్రభంజనం తను విన్న సంభాషణని వివరించాడు.

డిటెక్టివ్ టెంపో ఆవేశంతో అతని చేతిని పట్టుకొన్నాడు.

"తరువాత?"

"తరువాత ఆమె యివతలికి వచ్చింది. ఆమె రాసుకున్న ఖరీదయిన సెంటు గాల్లో వ్యాపించింది. రోడ్ సైడ్ రోమియోలా ఆమెనే చూస్తూ ఉండిపోయాను. నా చూపుల్ని అపార్థం చేసుకొంది. కోపంగా కారును తోలుకెళ్ళిపోయింది...."

"ఆమె ఎలా వుంది?"

"కన్నార్పకుండా వారంరోజుల పాటు చూస్తూ

కూచోవచ్చు!" ప్రభంజనం నవ్వుతూ అన్నాడు.

టెంపో వోరగా అతన్ని చూశాడు. ప్రభంజనం చిన్నగా నవ్వాడు.

"బాబ్డ్ హెయిర్, పచ్చటి జామపండు లాంటి రంగు, నుదురు మీద నిర్లక్ష్యంగా తగిలించుకొన్న కుంకుమ...."

"....ప్రభంజనం.... కారు నెంబర్ చూశావా....?" టెంపో ప్రశ్నించాడు.

"నెంబరు కోసం చూశాను. నెంబర్ ప్లేటు లేదు...."

"కారుకి నెంబర్ ప్లేటు లేదంటే దానికి కారణం ఉంటుంది!" టెంపో ఉషారుగా అన్నాడు.

"అందుకే ఆమె గురించి నాకు అనుమానం వేసింది. పూలు కొన్న ఆడదీ, ఈమే ఒక్కరే అన్న అనుమానం నాలో నమ్మకంగా యేర్పడింది. అనుమానం ధృవపడ్డానికి కాస్త టైమ్ పట్టింది. ఆలోగా కారులో ఆమె మాయమయిపోయింది! అఫ్‌కోర్స్ ఆమె ఎడంవైపు రోడ్లోకి తిరిగింది...."

"లాభంలేదు! సిటీలో కారు వెళ్ళిన దారినిబట్టి గమ్యస్థానం కనుక్కోలేం! ఆల్‌రైట్! నేను కావాలన్న యితర వివరాలు...." టెంపో ఆగి సిగరెట్ ముట్టించాడు.

"హస్తలాఘవంతో సంబంధం వున్న పాత నేరా లన్నింటినీ పరిశీలించాను. వివిధ పత్రికల క్రైమ్ రిపోర్ట్సునీ పోలీసులు నమోదు చేసిన వివిధ నేరాల్నీ స్టడీ చేశాను. నకిలీ కిరీటం తయారుచేయడంలో ప్రదర్శించబడిన చాకచక్యం, నైపుణ్యం ఉపయోగించబడిన నేరాలేవీ యింత

వరకూ జరగలేదు....చివరికి మిగిలిన ఒకే ఒక మార్గంలో ప్రయత్నించాను. డూప్లికేట్ నగలు తయారుచేసి రహస్యంగా విక్రయించడంలో నిర్మల్ చంద్ పేరు పొందాడు. రెండు మూడుసార్లు అతని పేరు బైటికి వచ్చింది. కానీ, సాలిడ్ గా అతనిమీద యే రిపోర్టూ లేదు. నకిలీనగ తయారు చేయించే వ్యక్తిలా నటిస్తూ మరి కొంత వాకబు చేశాను...."

"ప్రభంజనం నిర్మల్ చంద్ అడ్రస్ యేమిటి?" డిటెక్టివ్ టెంపో అడ్డొస్తూ ప్రశ్నించాడు.

"టెంపోగారూ, నేను సేకరించిన సమాచారం ప్రకారం నిర్మల్ చంద్ జేబుదొంగ లాంటి వ్యక్తి. మనకి కావాల్సింది జేబుదొంగ కాదు; బ్యాంకుల్ని కొల్లగొట్టే ఘరానా వ్యక్తి...."

"ప్రభంజనం, దిగు. వెళ్ళి. ఐ.జీ. గార్ని కలుసుకో. ఒక ఇన్ స్పెక్టర్ని తోడుగా తీసుకో. కార్లో రోడ్లన్నీ తిరుగు. నువ్వు చూపిన నెంబరు లేని కారు ఎక్కడేనా దర్శనమిస్తుందేమో చూడు. నెంబర్ లెస్ కార్, నెంబర్ వన్ బ్యూటీ—ఏదీ కనిపించినా అటుక్కపో!"

"మీ రెక్కడికి కెళ్తారు....?" ప్రభంజనం ప్రశ్నించాడు.

"నువ్వు అడ్రస్ చెప్తే వొకసారి నిర్మల్ చంద్ ని చూసొస్తా!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"థర్టీన్, మరాఠీ లేన్. టూ టౌన్" ప్రభంజనం నవ్వుతూ అన్నాడు.

కారు స్టార్టయింది. ప్రభంజనం దిగాడు. కారు కదిలింది....

# 15

తలుపులు తోసుకొని కుంకుమ గదిలోకి దూరింది. టేబుల్ వెనక కుర్చీలో కూచున్న వ్యక్తి గభాల్న లేచి, ఎత్తుగా నిలబడ్డాడు. ఇన్‌స్పెక్టర్ యూనిఫామ్‌లో హుందాగా ఉన్నాడతను, పొట్టిగా కత్తిరించిన క్రాఫు, వెడల్పుగా పెదవుల చివర్లదాకా సాగిన మీసాలు. నవ్వుతూ చూశాడతను.

"రెడీ?" కుంకుమ ప్రశ్నించింది. వైట్ షర్టుని జీన్స్‌లోకి టక్ చేసిన కుంకుమని నవ్వుతూ రెప్పవేయకుండా చూశాడతను. మాట్లాడకుండా సన్నగా ఈల వేశాడు.

అతని వెనుకున్న తలుపు తెరుచుకుంది. ఇద్దరు పోలీసులు అతనికి యిరువైపులా ప్రత్యక్షమయ్యారు. గడ్డపారలు మింగిన వాళ్ళలా నిలబడ్డవాళ్ళని కుంకుమ క్షణకాలం చూసింది.

"లెటస్ గో!" అన్నాడతను.

కుంకుమ అతని దగ్గరగా నడిచి, అతనివైపు చెయ్యి చాచింది. టేబుల్ సొరుగులోకి చేతిని పోనిచ్చి అతను రివాల్వర్‌ని తీసి ఆమెకి అందించాడు. రివాల్వర్‌ని ఒకసారి చెక్ చేసి హాండ్‌బ్యాగ్‌లో పడేసుకుందామె. రిస్టువాచీ చూసుకుని, అతనికి ఎదురుగా వున్న కుర్చీలో కూలబడింది.

"ఆరు నిమిషాలు గడిచాక బయల్దేరదాం!" అందామె ఆవులిస్తూ.

"వన్ వన్ టూ, మిస్ కుంకుమకి టీ పట్టుకురా!" ఆ వ్యక్తి కూచుంటూ ఉత్తరువిచ్చాడు.

# 16

వెడల్పాటి నేలమాళిగలో పాత కుర్చీమీద కూచుని, విశ్వకర్మారావు గజపతినీ, రాంజోగినీ సాలోచనగా చూస్తూ సిగరెట్ వెలిగించాడు.

"వండిన అన్నం తినకుండా కూచోవాలనడం అన్యాయం!" విశ్వకర్మారావు ఉన్నట్టుండి అన్నాడు.

గజపతీ, రాంజోగీ తలలు ఊగించారు. విశ్వకర్మారావు దేన్ని గురించి అంటున్నాడో వాళ్ళకి తెలుసు.

"నిన్న రాజులా బతికి, ఇవాళ రాజులా బతుకుతున్న బలరామ్‌కి రేపట్నుంచీ చక్రవర్తిలా బతికే ఛాన్సుంది. బికారుల్లా బతుకుతున్న మనకి ఆ ఛాన్సు లేదు. రంభ లాంటి పెళ్ళాం ఉన్న నపుంసకుడిలా మనం బతకాలి! ఇది అన్యాయం....!" విశ్వకర్మారావు ఆవేశంతో అన్నాడు.

"ఔను, అది అర్థంలేని పని!" గజపతి తాళం వేశాడు.

విశ్వకర్మారావు అతన్ని ఎగతాళిగా చూశాడు. "అర్థం లేని పని గురించి నోరు మెదపకుండా గంగిరెద్దులా అక్కడ తలలు ఊపారేం?"

"విశ్వకర్మారావ్, అతనికి ఎదురుచెప్పే శక్తీ, తెలివీ మాకు లేవని నీకు తెలుసు!" గజపతి అయిష్టంగా అన్నాడు.

"తల వూపకుండా నీలాగే మాట్లాడి వుంటే మాకూ వాయిదాల పద్ధతి అనేవాడేగా? అయినా బలరామ్ సలహాలో ఎంతో నిజం ఉంది...." రాంజోగి మెల్లిగా అన్నాడు.

"కష్టార్జితాన్ని ఖర్చు పెట్టకుండా, కక్కుబతుకు

బతకమనడం అన్యాయం!" విశ్వకర్మారావు ఉక్రోషంతో అన్నాడు. "డబ్బున్న వ్యక్తిగా నటించడం బాగానే ఉంటుందిగానీ, ఉండీ, లేనట్టు బతకడం అసహ్యంగా ఉంటుంది!"

"ఆయన చెప్పినట్టే అంటూ మనది మనం తీసుకొని, మన జాగర్తలో మనం హాయిగా ఉంటే సరిపోతుంది!" గజపతి తెలివిగా అన్నాడు.

"మీ ఇద్దరికీ తెలీదు: ఇందులో ఇంకొక అన్యాయం కూడా ఉంది. సగం అతను తీసేసుకొని, తతిమ్మా సగంలో ఆ కుంకుమకి వాటా పంచి, తతిమ్మా రొట్టె ముక్కని మూడు ముక్కలు చేసి మన మొహాన గిరాటేస్తాడు!...." విశ్వకర్మారావు కంఠంలో అసూయ ధ్వనించింది.

ఇద్దరూ బరువుగా నిట్టూర్చారు.

"కిరీటాన్ని తయారుచేయడంలో వొళ్ళూ, తలా గుల్ల చేసుకోవచ్చింది మనం! ప్లాన్ చేయడం సులభమే. అసలుకి సరితూగే నకలు తయారుచేయడం తేలికపని కాదు. మనం ఎలా శ్రమించామో మీకు తెలుసు. మనకీ సమానంగా రావాలి. ఆ వగలాడి, కుంకుమ ఏం సాధించింది? అతని వొళ్ళో కూచోవడం తప్ప?" విశ్వకర్మారావు కసిగా అన్నాడు.

"శ్రమకి తగిన ఫలితం దక్కాలంటే, నేనో సలహా ఇస్తా!" విశ్వకర్మారావు సిగరెట్ పీకని కిందపడేసి దాన్ని చూస్తూ అన్నాడు.

రెండు తలలు అతన్ని ఆత్రంగా, ఆశగా చూశాయి.

"డబ్బు తీసుకొని అతనిక్కడికొస్తాడు. ఆ తరవాత ఇక్కణ్ణుంచీ మనం ముగ్గురమే బైటికి వెళ్తాం...."

విశ్వకర్మారావు ఆగి నవ్వుతూ చూశాడు.

గజపతీ, రాంబోగీ అయోమయంగా చూశారు. విశ్వకర్మారావు కుర్చీలోంచి లేచి వాళ్ళ దగ్గరగా జరిగాడు. నవ్వుతూ వాళ్ళ ముఖాల్లోకి తీక్షణంగా చూశాడు. అతని కళ్ళు నకిలీ కిరీటంలోని నకిలీ వజ్రాల్లా మెరుస్తున్నాయి.

"ఇకముందు మొత్తం సొమ్మునీ ముగ్గురం సమానంగా, ధర్మంగా పంచుకుంటాం" విశ్వకర్మారావు కంఠం ఊరిస్తూ అంది.

"విశ్వకర్మారావ్ ....బ ల రా మ్ ...." గజపతి తడబడుతూ అన్నాడు.

"బలరామ్—సగం వాటా కొట్టేసి మిగిలిందాంట్లో కుంకుమ వాటానీ, ఆమెనీ సొంతం చేసుకోవాలనే ఆలోచనలో వున్న బలరామ్—ఈ భూగృహంలో శాశ్వతంగా నిద్రపోతాడు!" విశ్వకర్మారావు సన్నటి కంఠంతో అన్నాడు.

"గుడ్ గాడ్!" రాంబోగి అరిచాడు. అతని ముఖం మీద చెమట బిందువులు ప్రత్యక్షమవుతున్నాయి. గజపతి కళ్ళు తడిగా చూస్తున్నాయి.

"మైడియర్ ఫ్రెండ్స్, అతని మూలంగా మనకి అపాయం తప్పదు. ఒకరూపాయి మనం ఎక్కువ ఖర్చు చేస్తే అతను మనల్ని బెదిరిస్తాడు. ఎంత పనైనా చేస్తాడు. పనయ్యాక కూడా అతని పెత్తనాన్ని నేను సహించను. మనలాంటివాళ్ళు బలరామ్‌లాంటి వాళ్ళకి ఎప్పటికైనా బలిపశువులు కాక తప్పదు! భవిష్యత్తుని తెలివి అనే అద్దంలో చూసి చెప్తున్నా. నా ప్లాను గురించి ఆలోచించండి; త్వరగా. ఆట్టే టైమ్ లేదు. మీరు సరే అంటే

అతను ఇవ్వబోయేదానికన్నా రెండింతలు అధికంగా మన వశం అవుతుంది! లక్షలాది రూపాయల గోడలతో నిర్మించబడే మీ భవిష్యత్తు అనే బంగారు మేడని ఒకసారి మీ మనో నేత్రంతో చూడండి!" విశ్వకర్మారావు నవ్వుతూ వేడిలోహంమీద మరో రెండు సుత్తిదెబ్బలు వేశాడు.

గజపతి, రాంయోగి ఒకర్నొకరు కాసేపు పరిశీలనగా చూసుకుంటూ వుండిపోయారు. ఇద్దరి మొహాల్లో యేదో ఆశ, యేదో భయం రెండురకాల రంగుల్లా ప్రత్యక్షమవుతున్నాయి.

"ఈ అడ్వెంచర్ కారణంగా దాదాపు నెలరోజులుగా మనం ఎవ్వరికంటూ పడలేదు. వాటాలు పంచుకొని మరో రాష్ట్రానికి జారుకుందాం. మనం ఇప్పుడే మాయమైనట్టు ఎవ్వరూ అనుకోరు!" విశ్వకర్మారావు నవ్వుతూ అన్నాడు.

"విశ్వకర్మారావ్....బలరామ్‌ని....బలరామ్‌ని.. ఎలా తుదముట్టిస్తావ్?" గజపతి మెల్లిగా ప్రశ్నించాడు. రాంయోగి తన చూపుల్తో ఆ ప్రశ్నని అండర్‌లైన్ చేస్తున్నాడు.

వాళ్ళిద్దరి నిర్ణయాన్ని తనకి తెలియచేస్తున్న గజపతి ప్రశ్న విశ్వకర్మారావుకి గిలిగింతలు పెట్టింది. అతను తళతళమంటున్న కళ్ళని వాళ్ళవైపు తిప్పాడు.

"అవలీలగా వజ్రాల్ని కోసిపారేసే నాకు అదో లెక్క కాదు!" అన్నాడు సగర్వంగా. "మనికి వాటాలు పంచడంలో మునిగిపోయిన అతన్ని క్షణంలో పైకి పంపేస్తాను. అది నాకొదిలేయండి. ఈ గదిలోంచీ, మరో గదిలోకి దారివుంది. మిమ్మల్ని అక్కడ వదుల్తాను.

సులభం, పారా ఉపయోగించి గొయ్యి తవ్వండి!" అంటూ విశ్వకర్మరావు గోడవారగా కదిలాడు. ఇద్దరూ అతన్ని నీడల్లా అనుసరించారు.

# 17

"వస్తున్నాడు. ఎవరూ అతన్ని వెంటాడ్డంలేదు" గదిలోకి ప్రవేశించిన మంగూ అన్నాడు. గుప్తా మొహం నవ్వుతో యెలాస్టిక్ మొహంలా సాగింది. ఆదరాబాదరా అతను మంచంమీంచి దిగాడు.

"స్ట్రాంగ్ రూమ్‌లో వుంటాను. అతన్ని మెట్లమ్మట తీసుకురా. లిఫ్ట్ ఉపయోగించొద్దు!" గుప్తా ఉత్తరువిచ్చాడు. మంగూ మడమలమీద మెల్లిగా వెనక్కి తిరిగాడు.

"మంగూ...."

మంగూ తలతిప్పి గుప్తా వైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"అతన్ని నా దగ్గర వదిలి ఇద్దరికీ ఆరంజిజూస్ పట్రా. తెలుసుగా?"

జవాబుగా మంగూ పళ్ళికిలించాడు. అవసరం అయితే గానీ మంగూ తన శరీరంలో యే అవయవాన్నీ ఉపయోగించడు. అత్యవసరం అయితేగానీ అతను తన నోటిని ఉపయోగించడు. కళ్ళూ, పళ్ళూ చెప్పలేనప్పుడే నోటిని ఉపయోగించాలని అతని నమ్మకం. అతని నమ్మకం గుప్తాకి ఎంతో నచ్చింది.

మంగూ వెళ్ళిపోయాక గుప్తా చూడీదార్ పైజామా మీద పొడుగాటి జుబ్బా ధరించాడు. చకచకా స్ట్రాంగ్ రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

మూసిన తలుపువైపే చూస్తూ గుప్తా సిగరెట్ వెలి

గించాడు. తలుపు మెల్లిగా తెరుచుకుంది. పొడుగ్గా, హుందాగా అవుపిస్తున్న బలరామ్ ఆకారం గుమ్మంలో ఫ్రేంమధ్య పెయింటింగ్‌లా ప్రత్యక్షమైంది. అతని పెద వులమీద చిరునవ్వు విజయగర్వంతో నాట్యం చేస్తోంది.

"వెల్‌కమ్!" గుప్తా ఉత్సాహంగా అరిచాడు.

బలారామ్ ఠీవిగా లోపలికి అడుగులు వేశాడు. అతని చేతిలోని నల్లటి బ్యాగ్ మీద గుప్తా చూపులు కేంద్రీక రించబడ్డాయి.

"పాలసముద్రాన్ని వొంటరిగా చిలికి అమృతభాండం సంపాయించావ్. కంగ్రాట్స్!" గుప్తా నవ్వుతూ అన్నాడు.

"ఇది అమృతభాండంకాదు; ఆదిలక్ష్మి!" బలరామ్ నవ్వుతూ సోఫా దగ్గరగా అడుగులువేసి కూచున్నాడు. అతను వొళ్ళో జాగ్రత్తగా పెట్టుకున్న సంచీని గుప్తా ఆకలిగా చూశాడు.

"బలరామ్, సరుకుని చూద్దాం...."

"మిష్టర్ గుప్తా. యూ నో బెటర్ దేన్ దట్! యూ నో ది రూల్స్!" బలరామ్ నవ్వుతూ అన్నాడు.

గుప్తా కళ్ళు చిట్లిస్తూ చూశాడు. "మిష్టర్ గుప్తా, నకిలీది తెచ్చి కొన్ని కోట్లకి మీకు అమ్మే ప్రయత్నం చేసేంత మూర్ఖత్వం నాలో లేదు! అసలు దాని స్థానంలో నకిలీది వుందని అక్కడ యెవరూ కనిపెట్టలేదనీ మీకు తెలుసు!" బలరామ్ నవ్వుతూ అన్నాడు.

"అఫ్‌కోర్స్...." అంటూ గుప్తా గుమ్మంలో నిలబడ్డ మంగూవైపు అదోలా చూశాడు. "నో రెంకిపోతోంది. చల్లగా ఏదేనా పట్రా" అంటూ అతను బలరామ్ ఎదు రుగా మరో సోఫాలో కూచున్నాడు, అతని కళ్ళని

బలరామ్ వొళ్ళోని సంచీ అయస్కాంతంలా లాగుతోంది.

ఆరెంజి జ్యూస్‌తో నిండిన రెండు పొడుగాటి గ్లాసు లున్న ట్రేని వాళ్ళ మధ్య వున్న టీపాయ్‌మీద పెట్టాడు మంగూ.

“మిస్టర్ గుప్తా, రొక్కం రెడీగా వుందా?” బలరామ్ ప్రశ్నించాడు.

“ఆఫ్ కోర్స్.... రెండు పెద్ద సూట్ కేసుల్లో సర్దాను” అంటూ గుప్తా మంగూ వైపు అర్థవంతంగా చూశాడు. మంగూ గోడవారగా జరిగి, వాల్ పేపర్లోని ఒక పేటర్న్‌మీద వేళ్ళతో తడిమాడు. గోడలా ఏర్పడ్డ అలమారలోంచీ రెండు పెద్ద సూట్ కేసుల్ని తీసి మంచంమీదికి చేరవేశాడు. వాట్ని తెరిచి, కొద్దిగా ముందుకి వాల్చాడు. నీట్‌గా పేర్చబడిన నోట్లకట్టల్ని బలరామ్ తృప్తికరంగా చూశాడు.

అతని కళ్ళు వడగళ్ళలా గుప్తావైపు చూశాయి. “మిస్టర్ గుప్తా, లెక్కపెట్టే వ్యవధీ నాకులేదు. నమ్మకంతో తీసికెళ్తాను. ఒక్క నోటు తక్కువైనా, అది మీ ఉద్దేశపూర్వకంగా జరిగిందని నేను అనుకుంటాను. ఆ తరువాత మిమ్మల్ని కల్సుకుంటాను. ఈ కలయికలో స్నేహభావం ఉండదు!”

గుప్తా కళ్ళు పెద్దవిచేసి చూశాడు. “అంత మొత్తంలో ఒకటో, రెండో తగ్గించడంవల్ల వొరిగేదేమీలేదు. నాతో బేరంచేసే వ్యక్తిని నేను దగా చేయను!”

“అది మీకే ఆరోగ్యకరం!” అంటూ బలరామ్ సంచీలోంచి కిరీటాన్ని తీసి సోఫాలో తన పక్కనే పెట్టుకున్నాడు. జిగేల్‌మంటున్న కిరీటాన్ని గుప్తా నోరు తెరిచి చూస్తూ వుండిపోయాడు. అతని కళ్ళు గోలీల్లా

పైకి పొడుచుకొని వున్నాయి. మెల్లిగా లేచి, కిరీటం దగ్గరగా సోఫామీద కూచున్నాడు. వణుకుతున్న చేత్తో కిరీటాన్ని తడిమాడు. వణుకుతున్న చేత్తో జేబులోంచి లెన్స్ తీసి కంటికి తగిలించాడు. కాసేపు వజ్రాల్ని పరీక్షగా చూశాడు. అతని మొహంమీద జిడ్డులా ప్రత్యక్షమవుతున్న చెమటని బలరామ్ చిరునవ్వుతో చూశాడు.

"మంగూ" .... గుప్తా కంఠం జీరగా ధ్వనించింది. మంగూ చక్రాలమీద కదుల్తున్నట్టు అతని దగ్గరగా జరిగాడు. గుప్తా మౌనంగా అతనికి లెన్స్ అందించాడు. మంగూ లెన్స్‌ని తన పాము కంటికి అతికించి, నిమిషం పాటు కిరీటాన్ని పరీక్షిస్తూ వుండిపోయాడు. లెన్స్ తీసి గుప్తాకి అందించాడు. అతనివైపు పళ్ళికిలించాడు.

"బలరామ్, క్రౌన్ ఈజ్ వోకే!" గుప్తా వుద్రేకంతో అన్నాడు. రెండు చేతుల్లో కిరీటాన్ని ఆశగా పట్టుకున్నాడు. గుప్తా మొహంలోని ఆశనూ, ఆత్రాన్నీ, ఆనందాన్నీ బలరామ్ నిర్లక్ష్యంగా గమనించాడు. మొదటిసారిగా ధనరాశిని చూస్తున్న నిరుపేదలా అవుపిస్తున్నాడు గుప్తా.

"మిస్టర్ గుప్తా, మీ తల పెద్దది. కిరీటం పట్టదు. వదిలేయండి!" అన్నాడు నవ్వుతూ.

గుప్తా తన ఆవేశాన్ని అదుపులో పెట్టుకుంటూ కిరీటాన్ని పెట్టేసి లేచి, ముందు కూచున్నచోట కూచున్నాడు.

"బలరామ్, గొంతు ఎండిపోతోంది. లెటస్ డ్రింక్ ఆరంజ్ జ్యూస్!" అంటూ ముందుకు వంగి బలరామ్ పైవున్న లోటాన్ని అందుకున్నాడు.

"నా గొంతుక తడిగానే వుంది!" బలరామ్

నవ్వాడు.

గుప్తా అతన్ని నవ్వుతూ చూశాడు. అతని నవ్వు కళ్ళలోకి పాకలేదని బలరామ్ కళ్ళు గ్రహించాయి.

“కమాన్! లెట్స్ సెలబ్రేట్!” గుప్తా వొణికే కంఠంతో ప్రోత్సహించాడు.

బలరామ్ ట్రేలో గుప్తా పెట్టిన లోటానీ, గుప్తా చేతిలోని లోటానీ తదేకంగా చూశాడు. “మిస్టర్ గుప్తా, పెద్ద యెత్తున డబ్బు చేతులు మారేటప్పుడు ఎదుటివ్యక్తి ఇచ్చే ఆతిథ్యాన్ని స్వీకరించడం ప్రమాదం!”

గుప్తా అర్థంకానట్టు చూశాడు. అతని కళ్ళల్లో వచ్చిన మార్పుని బలరామ్ తృప్తికరంగా గమనించాడు. “నీ అర్థం?”

“డబ్బే ప్రాణంగా జీవిస్తున్న మీకు నా అర్థం అర్థమై వుండాలి! ఓకే.. లెట్స్ నాట్ వేస్ట్ టైమ్..”

“యూ ఆర్ ఫూలిష్! బలరామ్, అనవసరంగా నన్ను అనుమానించి, అవమానిస్తున్నావ్! అయామ్ సారీ....” దగ్గరగా కదుల్తున్న బలరామ్‌ని చూస్తూ గుప్తా ఆపేశాడు.

బలరామ్ వేళ్ళు తటాలున గుప్తా చేతిలోని లోటాని చుట్టేశాయి. ఒడుపుగా అతని పట్టులోంచీ లోటాను విడిపించుకున్నాడు బలరామ్. ఎడంచేత్తో ట్రేలో వున్న లోటాని అందుకున్నాడు గుప్తా చేతిలోంచీ లాక్కున్న లోటాలోని జ్యూస్‌ని కొద్దిగా ట్రేలో పోసేశాడు. ట్రేనుంచీ అందుకున్న లోటాలోని జ్యూస్‌ని వెలితిగా వున్న లోటాలోకి వొంపాడు. వేడి ద్రవాన్ని చల్లారుస్తున్నట్టు నాలుగుసార్లు రెండు లోటాల్లోని జ్యూస్‌ని బాగా కలుపుతూ తిరగబోశాడు.

అయోమయంగా చూస్తున్న గుప్తా కళ్ళల్లోకి ఎగ

తాళిగా నవ్వుతూ చూశాడు. ఒక లోటాని అతనివైపు చాచాడు.

"గుప్తా. దీన్ని మొదట తాగు. తరువాత నేను తాగుతాను!" అన్నాడు బలరామ్ నవ్వుతూ.

గుప్తా చేతులు రెండూ కిందికి వేళ్లాడుతున్నాయి. అతను ఆందోళనతో చూశాడు" "నువ్వు....నువ్వు.... నన్ను....అవమానిస్తున్నావు...."

బలరామ్ సగర్వంగా నవ్వాడు. "నీ ఆతిథ్యం స్వీకరించి, స్పృహతోనో, ప్రాణాలతోనో ఇక్కడ కూలిపోడం నాకు ఇష్టంలేదు!"

గుప్తా మొహంలోని రక్తం పూర్తిగా ఇంకిపోయింది. ఉబ్బినట్టున్న అతని పెదవులు అదురుతున్నాయి.

"కమాన్! డ్రింక్!" బలరామ్ ఛాలెంజ్ చేస్తూ అరిచాడు. "తాగు! తాగి, ఇందులో విషం కలపలేదని నిరూపించు!"

గుప్తా కళ్ళు కంగారుపట్టిన భూతద్దాల్లా వున్నాయి. బలరామ్ అతన్ని నవ్వుతూ చూశాడు. "గుప్తా, ఆశ మనిషిని అభివృద్ధి చేస్తుంది. దురాశ దుఃఖంలో పూడ్చేస్తుంది! నీలాగా కోటీశ్వరుణ్ని కాకపోయినా, నేనెంతో నేర్చుకున్నాను! నువ్వింకా ఎదగాలి. నిర్ణయించుకున్న టైమ్‌లోగా డబ్బుతో నేను తిరిగి వెళ్ళకపోతే, నా శిష్యులు పోలీసులకి ఫోన్ చేస్తారు. స్వామీజీ కిరీటం పోయిందనీ, నీ దగ్గర వుందనీ ఇన్‌ఫామ్ చేస్తారు!"

బలరామ్ నవ్వుతూ ఆపాడు. గుప్తా వణికిపోతూ చూశాడు. అతని కళ్ళు బోనులో ఇరుక్కున్న ఎలక కళ్ళలా అటూ, ఇటూ చూస్తున్నాయి.

"గుప్తా, నేను కిరీటాన్ని తీసుకుంటాను. రెండు సూట్ కేసుల్నీ రైల్వేపోర్టర్‌లా నువ్వు మోసుకురా. నా కార్లో పెట్టు. కారు స్టార్టు చేసి గేటు దాటేముందు సంచీని తోటలోకి గిరాటేస్తాను. ఇక్కణ్నుంచీ వెళ్ళేముందు నీ మంగూని ఈ గదిలో పెట్టి తాళం వేస్తావ్, నువ్వు!"

"నో! ఆ డబ్బు పట్టుకుపో! కిరీటాన్ని ఇక్కడే వదిలేయ్. నేను ఈ గడప దాటాను!" గుప్తా కంఠంలో కంగారు పలికింది.

బలరామ్ సగర్వంగా నవ్వాడు. "నీలాగా నేను పార్టనర్ని మోసం చేయను. కిరీటాన్ని నేను జీర్ణం చేసుకోను. నాకు డబ్బు చాలు. కమాన్! కదులు!" అంటూ బలరామ్ కిందికివంగి లోటాల్ని ట్రేమీద పెట్టబోయాడు అతని మెడకి చల్లగా యేదో తగిలింది.

"లోటాల్ని కింద పెట్టొద్దు. గదంతా రక్తం చిందితే శుభ్రంచేసే వోపిక నాకులేదు! రెండు లోటల్లోని క్యాష్‌నీ తాగేయ్!" వెనకనుంచీ సన్నటి కంఠం హెచ్చరించింది.

బలరామ్ విగ్రహంలా క్షణకాలం నిలబడిపోయాడు. తలపైకెత్తి చూశాడు. గుప్తా మొహంమీద ఆనందం, గర్వం భరతనాట్యం చేస్తున్నాయి. రివాల్వర్ కొస అతని చెవికిందికి పాకి బలంగా నొక్కింది. బలరామ్ వోరగా చూశాడు. రివాల్వర్ని ఎడంచేత్తో పట్టుకున్న మంగూ గొగ్గిరిపళ్ళు అతన్ని వెక్కిరిస్తున్నట్టు అవుపిస్తున్నాయి. మంగూ పాము కళ్ళల్లో మృత్యువు నవ్వుతోంది.

"గొంతెండిపోతోంది. తాగు బలరామ్!" మంగూ

ఎగతాళిగా అన్నాడు. పకపకా నవ్వుతూ గుప్తా కిరీటం దగ్గరగా కదిలాడు. కిరీటాన్ని హెల్మెట్‌లాగా చేతి మధ్య ఇరికించి, బలరామ్ ఎదురుగా నడిచాడు. వెక్కిరింపుగా నవ్వుతూ చూశాడు.

"బలరామ్, నువ్వు ఇక్కణ్నుంచీ తిరిగి వెళ్ళవు. నీ శిష్యులు ఎవ్వరికీ యేమీ చెప్పలేరు. బహుశ ఈపాటికి వాళ్ళ నోళ్లు నొక్కేసి వుంటుంది!" గుప్తా నవ్వుతూ అన్నాడు.

## 18

లోపలికి వస్తున్న డిటెక్టివ్ టెంపోనీ, ప్రభంజనంనీ చూస్తూ ఐజీ ఆదరాబాదరా కుర్చీలోంచీ లేచాడు.

"ఎనీ డెవలప్‌మెంట్?" ప్రశ్నించాడతను.

"ఒక వ్యక్తిని ప్రశ్నించాలి. ఆరుగురు పోలీసులూ ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ నాతో రావాలి. అవసరమైతే ఆ వ్యక్తిని కస్టడీలోకి తీసుకోవాలి...." టెంపో అన్నాడు.

"ఎవరతను?" ఐజీ అడిగాడు.

"నగరంలో నకిలీ నగలు తయారుచేయించి సప్లై చేయడంలో నిర్మల్‌చంద్ పేరుపొందాడు. భార్యల్ని ఏమార్చి, వాళ్ళ అసలు నగల్ని నకిలీ నగలతో రీప్లేస్ చేసి, జూదంలోనో, గుర్రాలమీదో తగలేసే భర్తలకి నిర్మల్‌చంద్ వ్యాపారం వరప్రసాదం! నిర్మల్‌చంద్‌ని కలుసుకున్నాను...." టెంపో ఆగి, సిగరెట్ వెలిగించాడు.

"నిర్మల్‌చంద్ నకిలీ కిరీటం తయారుచేశాడా?" ఐజీ కంఠంలో ఆత్రం ధ్వనించింది. టెంపో చిన్నగా నవ్వాడు.

"అతను యజమాని, సుత్తీ, పట్టకారూ పట్టుకోడు. మెల్లిగా అతన్ని దువ్వాను. గతంలో ఒకతను అతని దగ్గర పనిచేశాడు. అతని చేతిలో తయారైన నకిలీనగ నుంచీ, అసలు నగను వేరుచేసి పోల్చుకోడం దాదాపు అసాధ్యం అన్నాడు నిర్మల్‌చంద్...."

"ఎవరతను?" ఐజీ అడ్డుతగిలాడు.

అతనిప్పుడు నిర్మల్‌చంద్ దగ్గర లేడు. రెండేళ్ళ క్రితం అతన్ని నిర్మల్‌చంద్ ఉద్యోగంలోంచీ పీకేశాడు. అతను ఉలిలాంటి వేళ్ళూ, కత్తిలాంటి బుర్రా వుండే వ్యక్తి. గుంటనక్క. చాలా పెద్దమనిషిగా చెలామణీ అయ్యే ఒక 'భర్తకి నిర్మల్‌చంద్ ఆజ్ఞప్రకారం అతను నకిలీ నగలసెట్ తయారుచేశాడు. ఆ భర్త నకిలీ నగల్ని బ్యాంక్ లాకర్లో పడేసి, అసలు నగల్ని ప్రియురాలికి ఇచ్చేశాడు. కొన్ని వారాల తరువాత నిర్మల్‌చంద్ శిష్యుడు ఆ భర్తగార్ని కల్సుకున్నాడు.

"నకిలీనగలు చేయించిన ఉద్దేశం అతని భార్యకి చెప్పే ఆలోచన తనకి వున్నట్టు చెప్పాడు. భర్త గడగడలాడిపోయాడు. అసలు విషయాన్ని రహస్యంగా ఉంచాలంటే తనకి ఫీజు యిచ్చుకోవాలన్నాడతను! ఈ బ్లాక్ మెయిల్ గురించి తరువా తరువాత నిర్మల్‌చంద్‌కి తెలిసింది శిష్యుణ్ని తన్నితగిలేశాడు...."

"మిస్టర్ టెంపో, అతనెవరు? ఎక్కడున్నాడు?" ఐ.జీ. ఉద్రేకంతో అరిచాడు.

"అతనికి మూడు పేర్లున్నాయి. ఒకే యిల్లు—ఒకే చిరునామా! ఉంది!" టెంపో నవ్వుతూ అన్నాడు.

ఐ.జీ. అర్థం కానట్టు చూశాడు. టెంపో నవ్వాడు.

"అతని ఇంటిని వెంటనే ప్రశ్నించాలి. ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్‌ని రమ్మనండి...."

ఐ జీ. మౌనంగా ఇంటర్‌కమ్ స్విచ్ నొక్కాడు.

• • •

డిటెక్టివ్ టెంపో కారుని రోడ్డువారగా, చీకటిగా ఉన్న చోట ఆపాడు. పక్కనే కూచున్న పృథ్వీరావ్‌ని చూశాడు.

"పృథ్వీరావ్, మనిద్దరం వెళ్దాం. నీ శిష్యులు చీకట్లో నిలబడతారు. నువ్వు సిగ్నల్ యిస్తే రంగంలోకి దూకుతారు...." అంటూ టెంపో కిందికి దిగాడు.

పృథ్వీరావ్ అతన్ని అనుసరించాడు....

రోడ్డుకి కొంచెం కొంచెం దూరంలో, చిన్న ప్రహారీ గోడలోపలున్న పాత యింటి ముందు టెంపో ఆగాడు. చుట్టూ చీకటి. చెవులు రిక్కించి, టెంపో తలుపుని చేత్తో తడిమాడు. వేళ్ళాడుతున్న తాళంకప్ప అతని చేతికి తగిలింది. ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ చేతిని జేబులోకి పోనివ్వాడు. టెంపో అతన్ని వారిస్తూ ఇంటి వెనుకవైపుకి నడిచాడు. కాస్సేపట్లో ఇద్దరూ పెంకుల వరండా కింద, పెరటి గుమ్మం ముందు నిలబడ్డారు.

టెంపో తలుపు తోశాడు. తలుపు కదల్లేదు. క్షణ కాలం చెవులు రిక్కించి విని, టెంపో జేబులోంచీ పెన్సిల్ టార్చ్ తీశాడు. బటన్ నొక్కి,తలుపు చెక్కల మధ్య వున్న సన్నటి సందుగుండా పరీక్షగా చూశాడు. లోపలి గొళ్ళెం నల్లగా అతనికి అవుపించింది. టార్చిని ఆర్పేసి టెంపో ఇన్‌స్పెక్టర్ వైపు తలవాల్చి, గుసగుసగా యేదో చెప్పాడు. ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ మౌనంగా జేబులోంచీ చాకుని తీసి, టెంపోకి అందిం

చాడు. వేలితో గుర్తుంచుకొన్న తలుపు కన్నంలోంచీ చాకుని లోపలికి దూర్చి, టెంపో ముందుకి వంగాడు.

రివాల్వర్ ని చేత్తో పట్టుకొని ఇన్ స్పెక్టర్ అలర్ట్ గా నిలబడ్డాడు ...

• • •

వర్షంలో తడిసిపోయినవాళ్ళలా, చెమటతో తడిసి పోయిన గజపతీ, రాంబోగీ ఆగి, విశ్వకర్మారావు వైపు అలసటగా చూశారు. వర్క్ ఇన్ స్పెక్టర్లా నిలడ్డ విశ్వకర్మారావు చెమటతో తడిసి, మెరుస్తున్న వాళ్ళ మొహాల్లోకి చూశాడు.

"మరో అరడుగు తవ్వితే చాలు. తల్లిగర్భంలో పాపలా అతను ఈ గోతిలో ఇరుక్కుపోతాడు!"

చూపుడు వేలితో నుదురుమీంచీ కారుతున్న చెమటని తుడుస్తూ గజపతి నిట్టూర్చాడు.

"విశ్వకర్మారావ్, అంతా అనుకొన్నట్టే జరుగుతుందంటావా? ఇంతకీ అతను ఇక్కడికి వస్తాడా?"

"వచ్చినట్టు! రాకపోతే మన ఆరు చేతులూ అతని మెడకి ఉరితాడు తగిలిస్తాయని అతనికి తెలుసు. అదీగాక, తను యెవరితో బేరం చేస్తున్నాడో మనకి తెలీకుండా అతను సీక్రెట్ గా వుంచాడు. అయితే ఈ విశ్వకర్మారావు నుండీ యెవడూ యేమీ దాచలేడు! కిరీటాన్ని యెవరికి యివ్వడానికి ప్లాన్ చేశాడో నే నెప్పుడో కనిపెట్టాను. చక్రవడ్డీకి డబ్బు తిప్పుతున్న గుప్తాకి అతను ఫోన్ చేయడం ఒకసారి నేను గమనించాను. మనకి టోపీ వేస్తే, అతనితో బాటు గుప్తా కూడా మునిగిపోతాడు!" విశ్వకర్మారావు నవ్వుతూ అన్నాడు.

"కమాన్, అరడుగు తవ్వేసి, కాసేపు విశ్రాంతి తీసుకుందాం!" అంటూ రాంబోగి గునపంతో తవ్వడం ప్రారంభించాడు....

* * *

తలుపు తోసుకొని డిటెక్టివ్ టెంపో చీకటిగా ఉన్న హాల్లోకి జరిగాడు. ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ అతన్ని అనుసరించాడు. టెంపో తలుపు మూసి గొళ్ళెం పెట్టేశాడు. ఊపిరి బిగబట్టి, స్తంభంలా ఇద్దరూ కాసేపు నిలబడ్డారు. హాలు రూపం లీలగా వాళ్ళకి ప్రత్యక్షమవుతోంది.

నిశ్శబ్దం బరువుగా వాళ్ళ చెవుల్ని కప్పేస్తోంది. టెంపో మెల్లిగా కదిలాడు. ఎడంవైపున్న తలుపు ముందు ఆగాడు. అపరిశుభ్రంగా ఉన్న ఇల్లు యేదో వాసనని లీలగా ఎగజిమ్ముతోంది.

టెంపో చెవిని తలుపుకి ఆనించాడు. నిశ్శబ్దం. టెంపో చెయ్యి తలుపుమీద ఆనింది. తలుపు కొద్దిగా జరిగింది. చేతిమీదికి కొద్దిగా బరువుని కేంద్రీకరించాడు. సన్నగా చప్పుడు చేస్తూ తలుపు లోపలికి కదిలింది. క్షణంలో ఇద్దరూ లోపల దూరారు. తలుపుని మూసి, టెంపో చెవులు రిక్కించాడు. ఇన్‌స్పెక్టర్ రావ్ ఊపిరి పీలుస్తున్న చప్పుడు నిశ్శబ్దాన్ని భంగం చేస్తోంది. నాలుగువైపుల్నుంచీ చీకటి వాళ్ళని చూస్తోంది. క్షణాలు గడుస్తున్నాయి. టెంపో చెయ్యి తటాలున ఇన్‌స్పెక్టర్ చేతిని తాకింది.

టెంపో మెల్లిగా ముందుకి కదిలాడు. గదిలో ఉక్కగా ఉంది. ఎదురుగా, నల్లటి తెరలోని తెల్లటి చుక్కలా యేదో టెంపో కళ్ళని ఆకర్షిస్తోంది. కాసేపట్లో

టెంపో ఆ చుక్క దగ్గరగా ఆగాడు. అతని అరచెయ్యి ఆ తెల్లటి చుక్కని కప్పింది. చేతిని దూరంగా తీశాడు టెంపో. నిర్మానుష్యంగా ఉన్న యింట్లోకి, చాలా కాలంగా ఎవ్వరూ కాపరంలేని యింట్లోకి తను ప్రవేశించాడన్న ఆలోచన టెంపోలోంచి ఎగిరిపోయింది. ఇంట్లో ఎవరో ఉన్నారు...

ఉద్రేకంతో టెంపో అరచేత్తో గోడలా వున్న ప్రదేశాన్ని తడిమాడు. లోహంలా యేదో అతని చేతికి చల్లగా తగులుతోంది. టెంపో తలని ఇన్‌స్పెక్టర్ వైపు వాల్చాడు.

"పృధ్వీ. లోపల యెవరో ఉన్నట్టుంది. రేకు తలుపులోని చిల్లుల్లోంచీ వెలుతురు చిన్న చుక్కలా ఇవతలికి దూరుతోంది!" అన్నాడతను తగ్గు స్వరంతో.

ఇద్దరూ చెవులు రిక్కించారు. టెంపో ఉలిక్కిపడ్డాడు. చుట్టూ పేరుకున్న నిశ్శబ్దాన్ని ఏదో చప్పుడు, చిన్న చప్పుడు క్రమబద్ధంగా భగ్నం చేయడం ప్రారంభించింది. రాతిమీదో, గట్టి నేలమీదో పడుతూ లోహం చేసే చప్పుడు!

"పృథ్వీ, డూ యూ హియరిట్?" టెంపో ప్రశ్నించాడు.

"యస్!" ఇన్‌స్పెక్టర్ కంఠం బుసకొట్టింది.

"లోపల యెవరో ఉన్నారు. ఏదో చేస్తున్నారు!" టెంపో ఉద్రేకంతో అన్నాడు; రేకుతలుపుని చేత్తో తోస్తూ.

తలుపు కదల్లేదు. "ఏం చేద్దాం?" ఇన్‌స్పెక్టర్ ప్రశ్నించాడు.

టెంపో ఆలోచిస్తూ మౌనంగా ఉండిపోయాడు. తెరవడానికి ఏ విధంగా ప్రయత్నించినా తలుపు చప్పుడు చేస్తుంది. ఇంటికి ముందూ వెనకా రెండే తలుపులున్నాయి. లోపలున్న వ్యక్తులు—లేక వ్యక్తి—బైట పడాలంటే ఆ రెండు తలుపుల్నే ఉపయోగించాలి. వీధి తలుపు బైట తాళం వేయబడింది. తాము ఉపయోగించిన పెరటి తలుపు ఒక్కటే ఇవతలికి దారి....

"పృథ్వీ, నీ శిష్యుల్ని తీసుకురా! ఇద్దర్ని యింటిముందు రెండువేపులా గోడ చాటులో రెడీగా ఉండమను. ఇద్దర్ని పెరటి తలుపు ముందు నిలబడమను. ఇద్దరిని యిక్కడికి తీసుకురా" టెంపో తగ్గుస్వరంలో సూచించాడు.

ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ మౌనంగా కదిలాడు. లయబద్ధంగా లోపల్నుంచి తనవేపు లీలగా దూసుకొస్తున్న చప్పుడుని ఏకాగ్రతతో వింటూ టెంపో నిలబడిపోయాడు. నిమిషాలు గడుస్తున్నాయి. ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ యిద్దరు పోలీసులూ కాస్సేపట్లో చప్పుడు కాకుండా అతన్ని చేరుకున్నారు.

"టెంపో, తలుపుని బలవంతంగా ఓపెన్ చేద్దామా?" ఇన్‌స్పెక్టర్ ప్రశ్నించాడు.

"దొంగతనంగా తెరవడానికి ప్రయత్నించినా, దొరతనంగా తట్టినా ఈ మెటల్ డోర్ చప్పుడు చేస్తుంది. తెలిసినవాళ్ళు తట్టినట్టు తలుపు తట్టుదాం!" టెంపో నవ్వుతూ అన్నాడు.

మరుక్షణం అతని చెయ్యి మెటల్ డోర్ని ధైర్యంగా తట్టింది.

# 19

బలరామ్ గుప్తాని, మంగూనీ వోరగా చూశాడు. నిర్భయంగా తన చేతుల వేళ్ళని వదులు చేశాడు. ట్యాన్‌తో వున్న రెండు గాజు లోటాలూ మొసాయిక్ మీద భళ్ళున శబ్దం చేస్తూ పగిలాయి. రివాల్వర్ కొన గుండ్రంగా అతన్ని చెవికింద దొల్చుకుపోతున్నట్టు నొక్కింది.

ఉక్రోషంతో మంగూ నిట్టూర్పడం అతనికి పాము బుసలా వినిపించింది.

"గుప్తా, నన్ను మోసం చేసి నువ్వు తప్పించుకోలేవు. కుంకుమ నీకోసం పని చేయడం ఎప్పుడో మానేసింది. నా దగ్గరకు చేరిన మూడో రోజునుంచీ ఆమె నా నీడగా మారిపోయింది. పైకి నీ సెక్రటరీలా నటించింది! తొందర పడి...."

"షటప్! ఇలాంటి బుకాయింపులు నేను చాలా విన్నాను! కుంకుమ అలా చేయదు. ఆమె గురించి నీకు తెలీదు...."

"చివరి క్షణంలో ఇలా పొరపాట్లు చేసి చాలామంది ఫెయిలయ్యారు. నామాట విను. నీకు కావాల్సింది నువ్వు తీసుకో; నాకు ఇవ్వాల్సింది నాకు ఇచ్చెయ్ ...." బలరామ్ వోరగా చూస్తూ అన్నాడు.

"నాకు అవ్వా బువ్వా రెండూ కావాలి! కిరీటం, పైకం రెండూ నాకే కావాలి. నీకు ఇవ్వాల్సింది మంగూ ఇస్తాడు!" అంటూ గుప్తా నవ్వుతూ మంగూవైపు చూశాడు.

"మంగూ, వాణ్ణి తీసికెళ్ళు. గది ఖరాబు కావడం నాకు ఇష్టంలేదు, వాడి శరీరాన్ని ఏం చేయాలో నీకు తెలుసు!"

మంగూ తలపంకిస్తూ, బలరామ్‌వైపు చూశాడు. అతని కళ్ళల్లో ఏదో మృగవాంఛ కత్తి కొనలా తళుక్కు మంటోంది.

"చేతులు పైకెత్తు. కదులు!" మంగూ కీచుగా అన్నాడు.

"గుప్తా. .." బలరామ్ ఏదో చెప్పబోయాడు.

మంగూ కుడిచెయ్యి అట్లకాడలా అతని నోటిమీద వాలింది. బలరామ్ పెదవులు చిట్లిపోయాయి. ఎర్రటి కళ్ళు ఆగ్రహాన్ని ఎగజిమ్మాయి. అతని పిడికిళ్ళు బిగుసుకున్నాయి. అతని చెవికింద వొత్తిడి ఎక్కువైంది. చిన్నగా చప్పుడైంది. రివాల్వర్ సేఫ్టీకాచ్ రిలీజ్ చేయబడిందని అతను గ్రహించాడు. అప్రయత్నంగా అతని పిడికిళ్ళు వదులయ్యాయి.

"చేతులు పైకెత్తు!" మంగూ కంఠం అతని చెవిలో గింగురుమంది.

బలరామ్ చేతులు ఎత్తేశాడు.

"కదులు!"

బలరామ్ కదిలాడు. గుప్తా గున్న ఏనుగులా కదిలి, తలుపుని లోపలికి లాగిపట్టుకున్నాడు. బలరామ్ ముల్లుకర్రపోటు తింటున్న ఎద్దులా కదుల్తున్నాడు. అతని మెదడులో శరవేగంగా ఆలోచనలు పాకుతున్నాయి. కుంకుమ మరో అరగంటదాకా తనకోసం యెదురు చూస్తుంది. ఆ తరవాతే ఆమె ఇటువేపు రావొచ్చు; అనుమానం కలిగితే!

రివాల్వర్ మెరుపులా కదిలి అతని వీపులో, ఎడంవైపున గుండె లెవల్లో గునపంలా గుచ్చుకుంది. మొరటుగా అతన్ని ముందుకు తోస్తున్నాడు మంగూ, సన్నగా

పొడుగ్గావున్న మంగూ బలరామ్‌ని భయపెట్టడంలేదు. అయితే అతని చేతిలోని రివాల్వర్ బలరామ్‌ని ఆందోళనతో నింపుతోంది. ఇందాకా మంగూ కళ్ళల్లో ప్రత్యక్షమైన యేదో రాక్షసవాంఛ, చంపాలన్న కోరిక అతన్ని కదకదలాడిపోంది.

"థాంక్స్ బలరామ్ గుడ్ బై!" తనని దాటి గుమ్మంలో దూరుతున్న బలరామ్‌ని ఎగతాళిగా చూస్తూ అన్నాడు గుప్తా. బలరామ్ ఆగే ప్రయత్నం చేశాడు. రివాల్వర్ అతన్ని కర్కశంగా ముందుకు నెట్టింది.

బలరామ్ గుమ్మం దాటాడు. మంగూ గుమ్మంలో వున్నాడు. ఇద్దరికీ మధ్య రివాల్వర్, దాన్ని పట్టుకున్న మంగూ చెయ్యీ వున్నాయి. గోడవైపునుంచీ యేదో చెయ్యి సమ్మెటలా, మంగూ ముంజేతిమీద దిగింది. అసంకల్పితంగా మంగూ కెవ్వుమన్నాడు. రివాల్వర్ అతని చేతిలోంచీ విసురుగా కిందపడింది. ఏం జరిగిందో అతను తెలుసుకునేలోగా మరో రివాల్వర్ అతని ఛాతీ మీద గుచ్చుకుంది. మంగూ విసురుగా గదిలోకి పడిపోయాడు.

బలరామ్ తటాలున వెనక్కి తిరిగాడు. రివాల్వర్ గొన అతని ఛాతీమీద ముద్దెట్టుకుంది. రివాల్వర్ని గురిపెట్టిన అపరిచిత వ్యక్తిని అతను ఆశ్చర్యంగా చూశాడు. పొట్టిగా కత్తిరించిన క్రాపు భారీ విగ్రహం. ఖాకీ యూనిఫాం.

"బలరామ్, నీ ఆట కట్టయింది! తిక్క వేషాలేమీ కుండా లోపలికి పద!" అన్నాడతను గంభీరంగా.

బలరామ్ ఉలిక్కిపడ్డాడు. గదిలోకి జొరబడిన ఇద్దరు కానిస్టేబుల్స్ గుప్తానీ, మంగూనీ రివాల్వర్స్‌తో

కంట్రోల్ చేస్తున్నారు. బలరామ్‌కి ఏమీ అంతుపట్టడం లేదు. పోలీసులు ఇక్కడికెలా వచ్చారు?

భారీ వ్యక్తి, ఇన్‌స్పెక్టర్ బలరామ్‌ని లోపలికి నడిపించాడు. కాస్సేపట్లో బలరామ్, గుప్తా, మంగూ యుద్ధఖైదీల్లా గోడకి నిలబెట్టబడ్డారు. మూడు రివాల్వర్లు ముగ్గుర్నీ కంట్రోల్ చేస్తున్నాయి. గుప్తా మొహంలో ఆశ్చర్యం, ఆందోళనా ప్రస్ఫుటంగా అవుపిస్తున్నాయి. పల్చటి జుబ్బా చెమటతో అతని శరీరానికి అతుక్కుపోతోంది. కిరీటాన్ని బొజ్జకి అదిమిపట్టుకున్న అతని చేతులు వణుకుతున్నాయి. హఠాత్పరిణామం ముగ్గుర్నీ ఒకే రకమైన ఆశ్చర్యంలో ముంచేసింది.

ఇన్‌స్పెక్టర్ గుప్తా దగ్గరగా జరిగాడు. కిరీటాన్ని అందుకొని టీపాయ్‌మీద పెట్టాడు. కింద చెల్లాచెదురుగా పడున్న గాజుముక్కల్ని ఓసారి చూసి, కిరీటాన్ని చిరునవ్వుతో గమనించాడు. తలెత్తి గుప్తావైపు చూశాడు.

"సో, వజ్రకిరీటంకోసం బ్రహ్మాండంగా ప్లాన్ చేశారన్నమాట!" నవ్వుతూ అన్నాడతను.

గుప్తా కళ్ళు అటూ ఇటూ కదిలాయి. "ఇన్‌స్పెక్టర్ నాకేం తెలీదు. ఇతను, బలరాం—కిరీటాన్ని పట్టుకొచ్చి బేరం పెట్టాడు. దశావతారానందస్వామికి వజ్రకిరీటం తయారుచేయబడ్డట్టు పేపర్లలో చదివాను. కిరీటాన్ని చూడగానే ఇతను దాన్ని కాజేశాడని గ్రహించాను. ఇతన్నీ, కిరీటాన్నీ అధికార్లకి అప్పగించే ప్రయత్నంలో నేనూ, మంగూ వున్నాం. సమయానికి మీరొచ్చారు."

బలరాం గుప్తాని వోరగా చూశాడు. గుప్తా సమయస్ఫూర్తి అతన్ని ఆశ్చర్యంతో నింపుతోంది. ఎగతాళిగా ధ్వనించిన నవ్వు అతని చూపుల్ని ఇన్‌స్పెక్టర్‌వైపు

తిప్పింది.

"మిస్టర్ గుప్తా, పావు గంటనుంచీ నీ గది ముందు నేనున్నాను. లోపల—జరిగిన నాటకాన్ని చక్కగా విన్నాను. నీకు అవ్వాబువ్వా కూడా కావాలిగా!" ఇన్‌స్పెక్టర్ నవ్వుతూ అన్నాడు.

గుప్తా ఉలిక్కిపడ్డాడు. దీనంగా చూశాడు. "ఇన్‌స్పెక్టర్ గారూ, నేను ఏ నేరమూ చేయలేదు. కిరీటాన్ని తస్కరించలేదు. వాడెవడో దొంగిలించినదాన్ని నా వద్దకు తీసుకొస్తే అది నా తప్పు కాదు! ఇందాకా మీరు విన్నదంతా నిజంగానే నాటకం. అతన్ని ఏమార్చడానికి యేదేదో వాగాను. ఈలోగా మీరే వచ్చారు. నాకు శ్రమ తప్పింది. కిరీటాన్ని, దొంగనూ మీరే పట్టుకెళ్ళిపోండి!"

గుప్తా కళ్ళల్లో అవుపిస్తున్న నక్క తెలివిని ఇన్‌స్పెక్టర్ చిరునవ్వుతో చూశాడు. మెల్లిగా మంచం మీదున్న సూట్ కేసుల్ని సమీక్షించాడు. మూతలు తెరిచి లోపలున్న నోట్లకట్టల్ని ఒకసారి చూసి, చూపుల్ని గుప్తా వైపు తిప్పాడు.

గుప్తా ఒకసారి గుటకలు మింగాడు. "అది....అది.... వేరే పనికి సర్దిన పైకం...." అన్నాడతను వణికే కంఠాన్ని అదుపులో వుంచుకోడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూ.

ఇన్‌స్పెక్టర్ చిన్నగా నవ్వాడు. ఇంతవరకూ తనని గుర్తించనట్టుగా ప్రవర్తిస్తున్న ఇన్‌స్పెక్టర్ని బలరామ్ ఆశ్చర్యంతో రెప్పవేయకుండా చూస్తున్నాడు. కిరీటం గల్లంతైన సంగతి అరగంట క్రితందాకా ఎవ్వరికీ తెలీదు. గుప్తా ఆ సంగతి తనకి రిపోర్టు చేయటానికి కొండమీద

ఎవర్నో వుంచాడని తనకి తెలుసు. మరి ఈ పోలీసులు ఎక్కణ్నుంచి ఊడిపడ్డారు?

విశ్వకర్మారావు, గజపతి రాంజోగి....కుంకుమ.... నలుగురి రూపాలూ అతని మనోయవనికమీద చకచకా ప్రత్యక్షమయ్యాయి. వాళ్ళెందుకు పోలీసులకి చెప్తారు? తడించిన వి సరిమీద ఎందుకు మట్టి చల్లుకుంటారు? ఎక్కడో, ఏదో పొరపాటుంది. చీటికీ మాటికీ ఇన్‌స్పెక్టర్ ఎందుకు క్రుకెడ్ గా నవ్వుతున్నాడు?

ఇన్‌స్పెక్టర్ సన్నగా వేసిన ఈల బలరామ్ ఆలోచనల్ని తెంచేసింది. కదులుతున్న తలుపు అతని దృష్టిని ఆకర్షించింది. అతను ఆశ్చర్యంతో నోరు తెరిచాడు....

## 20

“స్టాప్!” విశ్వకర్మారావు చిన్నగా అరిచాడు. గజపతి చేతిలోని పారా, రాంజోగి చేతిలోని గడ్డపారా కదలడం మానేశాయి. ఇద్దరూ ప్రశ్నార్థకంగా అతన్ని చూశాడు. తలని వోరగా వాల్చి ఏకాగ్రతతో వింటున్న విశ్వకర్మారావు వాళ్ళవైపు చూపుల్ని తిప్పాడు. చిరునవ్వు అతని పెదాల్ని చీల్చింది.

“అతనే! ...ఆయుధాల్ని పక్కన పెట్టేయండి. మొహాలూ, చేతులూ తుడుచుకోండి! సమయం చూసి పని ముగిస్తాను. తరవాత ఏం చేయాలో మీకు తెలుసు.. కమాన్!” అంటూ చిన్నగదిలోంచీ చకచకా కదిలాడతను.

గజపతీ, రాంజోగీ ఆదరాబాదరా అతన్ని అనుసరించారు. సన్నగా, ఇరుగ్గా వున్న మెట్లెక్కి మూసిన రేకుతలుపుముందు ఆగాడు విశ్వకర్మారావు. తలుపుమీద మళ్ళీ చప్పుడయింది.

"బాస్ ...." విశ్వకర్మారావు మెల్లిగా అన్నాడు. అతను తప్ప మరెవరూ లోపలికి రాలేరు. వీధి తలుపు తాళం చెవి అతనికిచ్చాడు తను.

"కమాన్! ఎంత సేపు?" అటువైపునుండీ వినిపించింది.

ఎంతో సేపు లేదు! విశ్వకర్మారావు తనలో నవ్వుకుంటూ గొళ్ళెంలాగి, తలుపు తెరిచాడు. క్షణంలో అతని మొహంమీది చిరునవ్వు మాయమైంది. గుమ్మంలో సూటూ బూటూ ధరించి నిలబడిన అపరిచిత వ్యక్తిని ఆశ్చర్యంతో చూశాడతను.

"ఎవరు? ఎందుకొచ్చారు?" కోపంగా గద్దించాడు విశ్వకర్మారావు.

డిటెక్టివ్ టెంపో మాట్లాడకుండా చూశాడు. తన ముందు నిలబడ్డ పొడుగాటి, సన్నటి వ్యక్తి గడ్డంనున్నగా గీయబడింది. అతని వెనక నుంచున్న ఇద్దరూ ఇప్పుడిప్పుడే షేవ్ చేసుకున్నట్టు అవుపిస్తున్నారు. టెంపోలో ఆలోచనలు జెట్ స్పీడులో సాగుతున్నాయి. వీరబ్రహ్మం.... సుబ్బారావు.... విశ్వకర్మారావు.....ప్రస్తుతం తనకి ఎవరు కావాలి?

"విశ్వకర్మారావుగారు...." క్షణంలో తను సెలెక్టు చేసుకున్న పేరుని టెంపో యాంత్రికంగా ఉచ్చరించాడు.

"నేనే. ఏం కావాలి? మీరెవరు? లోపలికి ఎలా వచ్చారు?"

"మీరొకసారి జ్ఞానపర్వతంమీదికి రావాలి. ఎమర్జెన్సీ! స్వామీజీ వజ్రకిరీటం గురించి మీరు వినేవుంటారు. కిరీటంలోని వజ్రాలు అసలువి కావు అని మా బాస్ అనుకుంటున్నారు. దాన్నొకసారి మీరు చూడ్డం మంచిదని మా బాస్...., ధీరజ్ మల్ — అనుకున్నారు...."

టెంపో ఆగాడు.

జ్ఞానపర్వతం పేరూ వజ్రకిరీటం అన్న పదం విశ్వకర్మారావు ముఖంమీదా, కళ్ళల్లో ప్రతిఫలింప చేస్తున్న మార్పుల్ని టెంపో జాగ్రత్తగా గమనిస్తున్నాడు. విశ్వకర్మారావు కళ్ళు అనుమానంగా చూస్తున్నాయి. నివురు కింద నిప్పులా ఏదో భయం ఆ అనుమానంకింద దాగి వుంది.

"నేను.... నేనిప్పుడు రాను.... వేరే పని వుంది...." విశ్వకర్మారావు తడబడుతూ అన్నాడు.

"పెద్ద పెద్ద వాళ్ళంతా అక్కడున్నారు. మీరు ఎక్స్‌పర్టు అని అందరికీ తెలిసింది. మిమ్మల్ని అరెస్టు చేసి తీసుకు రమ్మని విఐపీగారు ప్రత్యేకంగా చెప్పారు. మీకు తగిన పారితోషికం ఇవ్వబడుతుంది...." టెంపో నవ్వుతూ అన్నాడు.

విశ్వకరార్మావు ముఖం యెందుకో తెల్లగా పాలిపోయింది. అతని వెనకనుంచున్న ఇద్దరి ముఖాల్లో ఏదో కంగారు ప్రత్యక్షమవుతోంది.

"సారీ.... రేపొస్తాను...." విశ్వకర్మారావు మెల్లిగా అన్నాడు. కిరీటం నకిలీదని ఇంత త్వరగా వాళ్ళెలా పోల్చుకున్నారు? కొంపతీసి బలరామ్ వచ్చేస్తాడా? బలరాం ఇప్పుడే రాకూడదని లోపల్లోపలే అతను ప్రార్థించాడు.

టెంపో నవ్వుతూ వెనక్కి జరిగాడు. కన్నార్పకుండా విశ్వకర్మారావుని చూశాడు.

"ఓకే; ఇన్‌స్పెక్టర్, విశ్వకర్మారావుని కస్టడీలోకి తీసుకో. అతను మర్యాదగా వచ్చేలా లేడు!" టెంపో గంభీరంగా అన్నాడు. విశ్వకర్మారావు అయోమయంగా

చూస్తున్నాడు. ఇన్‌స్పెక్టర్! కస్టడీ!

గుమ్మంలో ప్రత్యక్షమైన ఇన్‌స్పెక్టర్నీ, ఇద్దరు పోలీసుల్నీ అతను కంగారుగా చూశాడు. ఇన్‌స్పెక్టర్ చేతిలో రివాల్వర్ మెరుస్తోంది.

"ముగ్గురూ చేతులు తలమీద పెట్టుకోండి. మెల్లిగా పైకి రండి!" ఇన్‌స్పెక్టర్ కంఠం ఖంగుమంది.

టెంపో పక్కకి జరిగాడు. పెన్సిల్ టార్చి వెలిగించి గోడని పరీక్షగా చూస్తూ కదిలాడు. కాస్సేపట్లో అతను స్విచ్ నొక్కాడు. గదిలో నలభై వాట్ల బల్బు బలహీనంగా వెలిగింది.

గోడకి ఆన్చి నిలబెట్టబడిన ముగ్గుర్నీ ఇన్‌స్పెక్టర్ రివాల్వర్‌తో కంట్రోల్ చేస్తున్నాడు. కోటుజేబు లోంచీ రివాల్వర్ యివతలకి లాగి టెంపో మెట్లమ్మట కిందికి దిగసాగాడు.

రెండు నిముషాల్లో టెంపో తిరిగొచ్చాడు. తెల్లగా పాలిపోయిన మొహాల్తో గోడకి బల్లుల్లా అతుక్కుపోయిన ముగ్గుర్నీ ఒకసారి చూసి, ఇన్‌స్పెక్టర్ వైపు తిరిగాడు.

"ఫ్రెష్‌గా తవ్విన గొయ్యి తప్పా, కింద యెవ్వరూ లేరు; ఏమీ లేదు!" అన్నాడు నవ్వుతూ. మెల్లిగా విశ్వకర్మారావు వైపు చూశాడు.

"విశ్వకర్మారావ్, వజ్రకిరీటం యెక్కడ?" టెంపో తటాలున ప్రశ్నించాడు.

విశ్వకర్మారావు ఉలిక్కిపడ్డాడు. దిక్కుతోచనట్టు చూశాడు. ముగ్గురి మొహాల్లో, పూసిన రంగులా అవుపిస్తున్న ఒకే రకం భయాన్ని టెంపో తృప్తికరంగా చూశాడు.

"వ....జ్ర....కి....రీ....టం.....ఏ....మి....టి....?"

విశ్వకర్మారావు తడబడుతూ అడిగాడు.

"నీతో బాటు బ్యాంక్ వ్యాన్‌లో పాలకర్యాన్‌లో కిరీటాన్ని తీసుకొచ్చిన నీ గురువు యెక్కడ?" డిటెక్టివ్ టెంపో విశ్వకర్మారావు కళ్ళల్లోకి కత్తితో కోస్తున్నట్టు అడిగాడు.

విశ్వకర్మారావు మళ్ళీ ఉలిక్కిపడ్డాడు. ఊపిరి పీల్చుకోవడం మరచిపోయి. అయోమయంగా చూశాడు. అతని పెదవులు వణకడం ప్రారంభించాయి. ఇన్‌స్పెక్టర్ చేతిలోని రివాల్వర్ అతని డొక్కలో నిర్దాక్షిణ్యంగా గుచ్చుతుంది.

"మాట్లాడు!" హుంకరించాడు ఇన్‌స్పెక్టర్. విశ్వకర్మారావు వెర్రివాడిలా చూశాడు.

"విశ్వకర్మారావ్, ఎవరతను?" టెంపో ప్రశ్నించాడు. విశ్వకర్మారావు మాటలు మరచిపోయాడు. విపరీతమైన ఆశ్చర్యం అతన్ని మూగవాణ్ని చేసేసింది.

"నేలమాళిగలో తవ్విన గొయ్యి ఎవరికోసం? అతని కోసమేనా?...." టెంపో మళ్ళీ ప్రశ్నించాడు; ఎగతాళిగా.

"కమాన్ స్పీక్!" ఇన్‌స్పెక్టర్ అరిచాడు.

"ఫర్వాలేదు, ఇన్‌స్పెక్టర్. అతను నా ప్రశ్నలకి కళ్ళతో సమాధానాలు చెప్తున్నాడు!" టెంపో నవ్వుతూ అన్నాడు. విశ్వకర్మారావు గాభరాగా చూశాడు.

"ఇన్‌స్పెక్టర్. కొన్ని ప్రశ్నలకి అతను నోటితో జవాబులు చెప్పాలి. ముగ్గుర్ని హెడ్‌క్వార్టర్స్‌కి తీసుకెళ్దాం. అక్కడ మీ పద్ధతుల్లో మీరు ప్రశ్నిస్తారు. కటింగ్ ప్లయర్ ఒక్కొక్క గోటినీ వొలిచిపారేస్తూంటే

విశ్వకర్మారావు ఒక్కో ప్రశ్నకి రాగయుక్తంగా సమాధానం చెప్తాడు. అవసరమైతే మూడు కటింగ్ ప్లయర్‌లు ఉపయోగించి ముగ్గురిచేతా బృందగానం పాడించండి! పదండి. పదండి. మనకి అట్టే టైమ్ లేదు!" టెంపో నవ్వుతూ అన్నాడు.

మొదటిసారిగా టెంపో అతిమ్మా యిద్దరివైపూ చూశాడు. ఇద్దరి మొహాలూ తెల్లగా వున్నాయి. ఒకతని కళ్ళల్లో తడి మెరుస్తోంది.

"విశ్వకర్మారావ్.... చెప్పెయ్...." గణపతి బొంగురుగా అన్నాడు. అతని కళ్ళల్లో తడి ఎక్కువైంది.

విశ్వకర్మారావు బరువుగా నిట్టూర్చాడు. "చెప్తే.... శిక్ష....పడకుండా....చూస్తారా....?" తడబడుతూ ప్రశ్నించాడతను.

"చూద్దాం. త్వరగా అంతా చెప్పెయ్!" టెంపో హెచ్చరించాడు.

"కిరీటాన్ని బలరామ్, గుప్తా దగ్గరికి తీసికెళ్ళాడు...." విశ్వకర్మారావు ప్రారంభించాడు. అయిదు నిమిషాల్లో తనకి కావాల్సిన ఇన్‌ఫర్మేషన్ని డిటెక్టివ్ టెంపో అతన్నుండీ గుంజుకున్నాడు.

"పృథ్వీరావ్, వైర్‌లెస్ మెసేజ్ పంపు. వీళ్ళని యిద్దర్నీ తీసికెళ్ళడానికి బాజాభజంత్రీలతో మీ వాళ్ళని దూసుకురమ్మను. ఇక్కడ తగినంతమందిని వుంచు. మనం వెళ్ళేక బలరామ్ ఇక్కడికి రావొచ్చు. అతనికి తూటాలతో స్వాగతం చెప్పే యేర్పాటు చేయ్! విశ్వకర్మారావు మనతో వస్తున్నాడు. అన్నట్టు కారు కోసం

గాలించవద్దని ప్రభంజనంకి చెప్పమను...." అన్నాడు చెంపో.

# 21

తలుపు తెరుచుకుంది; మూసుకుంది. కుంకుమ గదిలో ప్రత్యక్షమైంది. బలరామ్ గుండె వేగంగా కొట్టుకో సాగింది. కుంకుమ యిక్కడికి యెందుకొచ్చింది? తెరిచి ఉంచిన బోనులోకి ఎలుకలా ఆమె యిక్కడికి యెందుకొచ్చింది? గుప్తా కూడా తనలాగే కంగారుపడుతూ ఆలోచిస్తుంటాడని బలరామ్‌కి తెలుసు.

కుంకుమ సన్నటి నడుముమీద చేతు లుంచుకొని, అందర్నీ కలయజూసింది. ఆమె మొహంలో భయం లేదు. ఆశ్చర్యంలేదు. ఎర్రటి పెదవుల సందులోంచీ తెల్లటి పళ్ళు మెరుస్తూన్నాయి. కుంకుమ నవ్వు బలరాంని అర్థంకాని ఆందోళనతో నింపుతోంది.

"సో. ఎవ్విరిథింగ్ ఈజ్ అండర్ కంట్రోల్!" అందామె ఇన్‌స్పెక్టర్ని చూస్తూ. ఇన్‌స్పెక్టర్ సగర్వంగా నవ్వాడు.

"కుమ్.... కుమ్....!" గుప్తా ఆశ్చర్యంతో అరిచాడు.

కుంకుమ అతన్ని సూటిగా చూసింది. "షటప్!" ఆమె కంఠం పిస్టల్ షాట్‌లా ధ్వనించింది.

బలరామ్ రెప్ప వేయకుండా చూస్తున్నాడు. కుంకుమ.... కుంకుమ.... నాటకం ఆడింది! గుప్తాకీ, తనకూ ఒకేసారి వాత పెట్టింది! సందేహంలేదు. ఆమె పోలీసుల తరఫున మొదట్నుంచీ పని చేస్తూ తనతో, గుప్తాతో నటించింది! బిచ్!... బలరామ్ కసిగా ఆలోచిస్తున్నాడు. అతని పిడికిళ్ళు బిగుసుకొన్నాయి. బిగించిన పిడికిలితో కుంకుమ మొహంమీది నవ్వుని తుడిచేయా లనిపిస్తోం

జతనికి.

కుంకుమ వయ్యారంగా సూట్ కేసుల వైపు నడిచింది. కళ్ళు పెద్దవి చేస్తూ నోట్లకట్టల్ని చూసింది. "గుప్తాకి అంతా రెడీగా ఉంచుకున్నాడన్నమాట!" అందామె ఎగతాళిగా.

"ఇది....ఇది....అన్యాయం! నమ్మకద్రోహం!" గుప్తా కీచుగా అరిచాడు.

కుంకుమ అతన్ని ఎగతాళిగా చూసింది. "అలాగా!" అందామె నవ్వుతూ. ఆమె తల ఇన్ స్పెక్టర్ వైపు తిరిగింది.

"నా సహకారానికీ, సహాయానికీ ప్రతిఫలంగా ఆ సూట్ కేసుల్ని తీసుకొంటాను. కిరీటాన్నీ, ఆ రాజునీ, ఈ చక్రవర్తినీ మీరు స్వాధీనం చేసుకోండి!" అందామె బలరామ్నీ, గుప్తానీ చూపిస్తూ.

"నో!" గుప్తా బడితెదెబ్బ తిన్న బలిసిన పందిలా అరిచాడు. "ఆ డబ్బు....ఆ డబ్బు నాది! కిరీటాన్నీ, దొంగనూ పట్టుకెళ్ళిపోండి. నన్నూ, నా డబ్బునీ వదిలేయండి!"

"మిస్టర్ గుప్తా, నువ్వు నేరం చేశావ్. వజ్రకిరీటాన్ని దొంగసొత్తు దొంగతనంగా కొన్నావు...." ఇన్ స్పెక్టర్ ఏదో చెప్పబోయాడు.

"నో! నేను కొనలేదు! కొనే ప్రయత్నం కూడా చేయలేదు! వాడు అమ్మే ప్రయత్నం చేశాడు. అది నా తప్పుకాదు! నేను నేరం చేశానని మీరు నిరూపించలేరు" గుప్తా అరిచాడు.

ఇన్ స్పెక్టర్ చిన్నగా నవ్వాడు. "వజ్రకిరీటం కోసం నువ్వూ, బలరామ్ సాగించిన గూఢుపుఠాణీ మొదట్నుంచీ

మాకు తెలుసు. మిస్ కుంకుమ దాన్నంతా బుర్రకథలా కోర్టులో చెప్తుంది!"

గుప్తా నీళ్ళల్లో మునిగిపోతున్న ఈత రాని వ్యక్తిలా చూశాడు.

"సూట్‌కేసుల్ని నాకు ప్రెజెంట్ చేస్తే గుప్తా గురించి నేను 'నేను పూర్తిగా మరిచిపోతాను!" కుంకుమ నవ్వుతూ అంది.

బలరామ్ ఎర్రటి కళ్ళతో అయోమయంగా చూస్తున్నాడు. గుప్తా కళ్ళు మెరిశాయి. కోర్టులో పరువు ఖరాబు అవడం కన్నా బ్లాక్‌మనీలో మూడో వంతు పోవడం నయమే! పరువుంటే తను మళ్ళీ బరువెక్కొచ్చు....

"ఇచ్చేస్తాను! నన్నొదిలేయండి! నా గురించి పూర్తిగా మరిచిపొండి! ...." గుప్తా ఆవేశంతో ఆగ్రంగా అరిచాడు.

ఇన్‌స్పెక్టర్ పొట్టిగా వున్న క్రాపుని ఒకసారి గోక్కున్నాడు. గుప్తా వైపూ, కుంకుమ వైపు ఆలోచిస్తూ చూశాడు.

"ఒప్పుకోండి, ఇన్‌స్పెక్టర్. దొంగిలించబడిన కిరీటం, దొంగా మీకు చిక్కారు. గుప్తా గురించి మీ రెక్కార్డా అనక్కర్లేను! నేనూ అనను; నా పారితోషికం నాకిస్తే!" కుంకుమ నవ్వింది.

ఇన్‌స్పెక్టర్ తల పంకిస్తూ వుండిపోయాడు. "ఓ.కే" అన్నాడు చివరికి.

బలరామ్ తన కళ్ళనీ, చెవుల్నీ నమ్మలేకుండా ఉన్నాడు. కుంకుమ తెలివిగా సంపాయిస్తున్న పారితోషికంలో ఇన్‌స్పెక్టర్ వాటా యెంత? తోడుదొంగ,

లుచ్ఛా, నమ్మకద్రోహి, గుప్తా తెలివిగా తప్పించుకుంటున్నాడు! బలరామ్ పళ్ళు కొరుక్కొన్నాడు.

"ఇందులో గుప్తా హస్తం ఉంది. నేను నోరు మూసుకొని కూచోను. నేను మునిగితే, గుప్తా కూడా నాతోబాటు లోపలికంటా మునిగిపోతాడు!" అన్నాడతను కసిగా.

మొట్టమొదటిసారిగా మాట్లాడిన బలరామ్‌ని ఇన్‌స్పెక్టర్ కళ్ళు చిట్లిస్తూ చూశాడు.

"చెప్పే అవకాశం నీ కుండదు బాస్!" కుంకుమ ఎగతాళిగా అంది.

"ఏమిటి నీ అర్థం?" బలరామ్ అరిచాడు.

"పవిత్రమైన జ్ఞానపర్వతంమీద, ప్రత్యక్ష దైవ స్వరూపులైన స్వామీజీ వజ్రకిరీటాన్ని తస్కరించిన నీచుడి మాటను ఎవ్వరూ నమ్మరు, బలరామ్!" ఇన్‌స్పెక్టర్ గంభీరంగా అన్నాడు.

కుంకుమ నవ్వు ఆ మాటల్ని అండర్ లైన్ చేసింది.

బలరామ్ మౌనంగా ఉండిపోయాడు. అతనిలో. తెలివిగా తప్పించుకున్న గుప్తా గురించిన ఆలోచనలు సలుపు పుట్టిస్తూ సాగుతున్నాయి. కన్ను లొట్టపోయినా గుప్తాకి చావు తప్పింది. తనకి....శిక్ష....ఘరానా దొంగగా పబ్లిసిటీ. నిరంతరం తనమీద ఎర్ర టోపీల ఎర్ర కన్ను....

గుప్తా కడుపు మరో రకంగా మండుతోంది. బలరామ్‌కి పెద్దగా వాటిల్లే నష్టం లేదు. ఆ మాటకొస్తే నష్టమే లేదు! కొంతకాలం ప్రభుత్వ భోజనంతో జైలు శిక్ష. అంతే! తనకి అద్వాన్నా. సూట్ కేసుల్లోది కలిపి కోటికి పైగా తిరుక్షౌరం....

"ఇన్‌స్పెక్టర్, మీ వాళ్ళచేత ఈ సూటుకేసుల్ని

కార్లో పెట్టించండి. గుప్తా శరీరంకన్నా అవి బరువుగా వున్నట్టున్నాయి!" కుంకుమ కంఠం గుప్తా హృదయం మీద వాత పెట్టింది.

బలరాంని తన రివాల్వర్‌తో కంట్రోల్ చేస్తూ ఇన్‌స్పెక్టర్ దగ్గరగా నడిచాడు. "వన్ వన్ టూ, ఇతనికి బేడీలు వెయ్!" అంటూ ఆక్షేపణగా బలరాం కళ్ళల్లోకి చూశాడతను. "వెనక్కి తిరుగు!"

బలరాం మెల్లిగా వెనక్కి తిరిగాడు. రివాల్వర్ కొన అతని చెవి వెనక గుచ్చుకుంది. వెనుకనున్న అతని రెండు చేతుల్నీ కలుపుతూ బేడీలు క్లిక్‌మన్నాయి. రివాల్వర్ దూరంగా జరిగింది. ఏదో చెయ్యి అతని భుజంమీద బలంగా పడింది. విసురుగా అతను వెనక్కి తిప్పబడ్డాడు. ఇన్‌స్పెక్టర్ కళ్ళు అతన్ని తీక్షణంగా చూశాయి.

"మాస్టర్ బ్రెయిన్!" బిగించిన పళ్ళ సందుగుండా ఇన్‌స్పెక్టర్ ఉచ్చరించాడు. అతని ఎడమచెయ్యి తటాలున కదిలింది. అరచేతి వెనుకభాగం బలరాం ఎడమ చెంప మీద వాలి, ఫట్ మంటూ చప్పుడు చేసింది.

బలరాం బుగ్గ బూరెలా పొంగుతోంది. దవడలోంచీ రక్తం అతని నాలుకమీదికి జారింది. బలరామ్ ఆగ్రహంతో చూశాడు.

"ఇన్‌స్పెక్టర్, నిష్కారణంగా నామీద చేయి చేసుకున్నావ్. యూ హావ్ నో రైట్ టు...."

"షటప్! ఇక్కణ్నుంచీ తీసుకెళ్ళాక నీమీద కాలు కూడా చేసుకుంటాను, బాస్టర్డ్!" ఇన్‌స్పెక్టర్ హుంకరించాడు.

అతని సైగతో కానిస్టేబుల్స్ యిద్దరు రెండు వాటు

కేసుల్ని పట్టుకెళ్ళారు. ఏడుపుని దిగమింగుతూ గుప్తా సూట్ కేసుల్ని చూస్తున్నాడు. మంగూ అసంకల్పితంగా ఆబోతులా బుసకొట్టాడు.

"గుప్తా, నీ తరఫున నీ చింపాంజీ ఏడ్చేలా వుంది!" ఇన్‌స్పెక్టర్ నవ్వుతూ అన్నాడు. "గుర్తుంచుకో: నక్కిన పేనులా కిక్కురుమనకుండా పడుండాలి నువ్వు! నోరు తెరిస్తే జైలు తలుపు తెరుచుకొంటుంది! అర్థమైందా?"

జవాబుగా గుప్తా నోరు ఆదిమమానవుడి భాషలో ఏవో చప్పుళ్ళు చేసింది.

ఇన్‌స్పెక్టర్ బలరామ్‌వైపు చూశాడు. బలరామ్ చూపులు అతనిమీద లేవు. తనవేపు చూడకుండా వుంటానికి ప్రయత్నిస్తున్న కుంకుమను రెప్ప వేయకుండా చూస్తున్నాడతను. కుంకుమ యెందుకిలా చేసింది? న్యాయం, ధర్మం, వగైరా ఆదర్శాలా? అయితే సూట్ కేసుల్లోని భారీ మొత్తాన్ని ఎందుకు ఆశించింది? ఎందుకు? ఎందుకు?

బలరామ్ మెదడులో యేదో తళుక్కున మెరిసింది. కుంకుమ నిజాయితీగా వ్యవహరించడం లేదు. ఆమె చట్టంతో, పోలీసులతో సహకరించడంలేదు!

అంటే యీ గదిలో ఉన్న పోలీసులు పోలీసులు కారు!

అందుకే తనతో సహకరించిన యితర వ్యక్తుల గురించి ఇన్‌స్పెక్టర్ తనని ప్రశ్నించలేదు!

కుంకుమ అతనికి వాళ్ళ గురించి చెప్పివుండొచ్చు. అయినా, తమ ఒరిజినల్ ప్లాన్ ప్రకారం వాళ్ళు ఆ గదిలో లేరు. విశ్వకర్మారావు నేరమాళిగలో వున్నారు.

ఆ సంగతి కుంకుమకి తెలీసు!

బలరామ్ గుండె దడదడ కొట్టుకోసాగింది. నకిలీ పోలీసులు అసలు పోలీసుల్లా తనని జెయిల్లో పెట్టి కేసు పెట్టరు. తనని....తనని నిర్మూలిస్తారు! మొదటిసారిగా తన నుదురుమీద చెమటలు క్రమ్ముకున్నాయని బలరామ్ గ్రహించాడు. ఇరుకు పంజరంలో యిరుక్కున్న పిట్టలా అతని గుండె విలవిల్లాడసాగింది. శరీరాన్ని వడ్డించిన విస్తరిలా చేసి, తనని యేమార్చింది; మోసగించింది.

కుంకుమ.... మెల్లిగా తలని అతనివైపు తిప్పింది. ఆమె కళ్ళలో విజయగర్వం సరస్సులమీద సూర్యబింబంలా ప్రతిఫలిస్తోంది. ఏదో మెరుపు బలరామ్ దృష్టిని లాగింది. ఇన్‌స్పెక్టర్ — నకిలీ ఇన్‌స్పెక్టర్ — వజ్రకిరీటాన్ని జాగ్రత్తగా నల్లసంచీలో పెడుతున్నాడు.

"కుంకుమా...." బలరామ్ మెల్లిగా పిల్చాడు. కుంకుమ ఎగతాళిగా చూసింది. ఆమెని దగ్గరగా రమ్మని అతను తలాడిస్తూ సైగ చేశాడు. కుంకుమ తన శరీరాన్ని మెలికలు తిప్పుతూ అతని దగ్గరగా నడిచింది. బలరామ్ ఆమె విశాల నేత్రాల్లోకి తదేకంగా చూశాడు.

"కుంకుమా....నిన్ను నమ్మాను....నన్నెందుకు మోసం చేశావ్?" బలరామ్ మెల్లిగా ప్రశ్నించాడు.

అతని ఎర్రటికళ్ళనీ, పొంగిన బుగ్గనీ, పగిలి రక్తం చిమ్మిన పెదవుల్నీ కుంకుమ చిరునవ్వుతో చూసింది.

"కుంకుమా, అతను పోలీసు కాదు. నాకు తెలుసు. అతనికీ వాటా ఇద్దాము. నన్ను విడిపించు...." బలరామ్ సన్నటి కంఠంతో అన్నాడు.

కుంకుమ కళ్ళు పెద్దవిగా చేసి ఆశ్చర్యంగా చూసింది. మెల్లిగా ఆమె పెదవులు విచ్చుకున్నాయి.

కిరీటంలోని వజ్రాల్లా ఆమె పళ్ళు తళుక్కుమన్నాయి.

"ఇంటలిజెంట్ బాస్టర్డ్! నీ కళ్ళల్లో మునుపటి గర్వం, దర్పం లేవు. అయామ్ హాపీ!" కుంకుమ తగ్గుస్వరంలో అంది. ఆమె కళ్ళు అతన్ని వెక్కిరిస్తున్నాయి. క్షణకాలం అతని కళ్ళల్లోకి చూసి, ఆమె వెనుతిరిగింది. జీన్స్‌లోంచి కొట్టొచ్చినట్లు అవుపిస్తోన్న ఆమె పిరుదులు బలరామ్‌ని వెక్కిరిస్తూ గర్వంగా కదిలాయి.

"గుప్తా వీళ్ళు పోలీసులు కారు! దొంగపోలీసులు! కుంకుమతో కలిసి నాటకం ఆడుతున్నారు! నా డబ్బునీ, నీ కిరీటాన్ని తన్నుకుపోతున్నారు!" బలరామ్ బిగ్గరగా అరిచాడు. రెండడుగులు ముందుకు వేసి గుప్తావైపు ఆత్రంగా చూశాడు.

గుప్తా అయోమయంగా చూస్తోన్నాడు. మంగూ కళ్ళు మెరుస్తున్నాయి. తన మాటల్ని మంగూ అర్థం చేసుకొన్నాడని బలరామ్ గ్రహించాడు.

కిరీటాన్ని సంచిలో దోపిన ఇన్స్పెక్టర్ గిరుక్కున బలరాంవైపు తిరిగాడు. అతని కళ్ళు నిప్పులు చెరుగుతున్నాయి. వేగంగా బలరాంవైపు కదిలాడతను. చక్రాలమీద కదులుతున్నట్టు ముందుకి జరుగుతున్న మంగూ అతని దృష్టిని ఆకర్షించాడు. సంచీని ఎడంచేతిలోకి మార్చుకుని అతను కుడిచేతిని జేబులోకి పోనిచ్చాడు.

కుంకుమ గిరుక్కున వెనక్కి తిరిగింది. ఆమె చెయ్యి యెప్పుడు యెక్కడికి మారిందో చూడలేదు కానీ, బలరాం ఆమె చేతిలో ప్రత్యక్షమయిన రివాల్వర్ని గాభరాగా చూశాడు. కుంకుమ రెండు అంగల్లో బలరాంని సమీపించింది. ఆమె చెయ్యి గాలిలోకి లేచింది. రివా

ల్వర్ సుత్తిలా బలరాం ముఖం మీదికి గురి పెట్టబడింది.

"అందరూ కదలకుండా నుంచోండి!" గుమ్మంలోంచీ ఏదో కంఠం హెచ్చరించింది.

ఇన్స్పెక్టర్, కుంకుమా, వెనక్కి తిరగబోయారు.

"కదిలినవాళ్ళ ఒళ్ళు జల్లెడవుతుంది!"

గంభీర కంఠం కర్కశంగా హెచ్చరించింది. కుంకుమ చెయ్యి గాల్లో అచేతనంగా ఆగింది. ఓరగా చూస్తున్న ఆమె కళ్ళకి యువకో పోలీసాఫీసర్ విగ్రహం భారీగా అవుపిస్తోంది.

హఠాత్తుగా గదిలోకి వస్తున్న వ్యక్తుల్ని గుప్తా, మంగూ నివ్వెరపోయి చూస్తున్నారు. బలరామ్ కళ్ళు చెదిరినట్టయ్యాయి. పాలిపోయిన ముఖంతో చేతులకి బేడీలతో నిలబడ్డ శవంలా గుమ్మంలో నిలబడ్డ విశ్వకర్మారావుని అతను అయోమయంగా చూశాడు. మెల్లిగా గదిలోకి వస్తున్న ఇద్దరు వ్యక్తుల్నీ అతను ఎన్నోసార్లు చూసివున్నాడు. డిటెక్టివ్ టెంపో. క్రైంబ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్. గుమ్మంలో విశ్వకర్మారావు వెనక నలుగురు సాయుధపోలీసులు అలర్టుగా నిలబడ్డారు.

"కుంకుమా, రివాల్వర్ని కిందపడేయ్. చేతిని కదపకు. వేళ్ళని వొదులు చెయ్!" డిటెక్టివ్ టెంపో హెచ్చరించాడు. కుంకుమ వేళ్ళు వదులయ్యాయి. రివాల్వర్ కిందపడింది.

"చండీదాస్, నీ పోలీసాట పూర్తయింది. రెండు చేతులూ పైకెత్తి, మెల్లిగా ఇటువైపుకి తిరుగు!" టెంపో హెచ్చరించాడు. "కుంకుమా, నువ్వుకూడా!"

ఇన్ స్పెక్టర్లా నాటకం ఆడిన చండీదాస్, కుంకుమా వెనక్కి తిరిగి, భయంనిండిన కళ్ళతో చూశారు. ఇన్ స్పెక్టర్ పృథ్వీరావ్ చండీదాస్ దగ్గరగా నడిచాడు. రివాల్వర్ని గునపంలా అతని పొట్టలో గుచ్చాడు. అతని పాంటు జేబులోంచీ రివాల్వర్ని తీసి తన జేబులో పడేసుకున్నాడు. కుంకుమ కిందపడేసిన రివాల్వర్ని టెంపో అందుకున్నాడు. చండీదాస్ చేతుల్ని కిందికి దించి పృథ్వీరావ్ బేడీలు తగిలించాడు.

"చండీదాస్, కాన్ స్టేబుల్స్‌లా నటించిన నీ శిష్యులిద్దరూ సూట్ కేసుల్తో సహా బైట క్షేమంగా వున్నారు. నీ పేరూ, నీ కథా, నీ జాతకం అంతా చకచకా అమరంలా అప్పజెప్పేశారు!" డిటెక్టివ్ టెంపో నవ్వుతూ అన్నాడు.

సింహంతోలు కప్పుకున్న గాడిదని చూస్తున్న అసలు సింహంలా పృథ్వీరావ్ చండీదాస్‌ని చూస్తున్నాడు.

తన మొహంలోకి నిప్పులు కక్కుతూ చూస్తున్న ఇన్ స్పెక్టర్ పృథ్వీరావ్‌ని చండీదాస్ గుటకలు మింగుతూ చూశాడు.

"బలరామ్, నీవు నిస్సంకోచంగా టోపీ వేసే పార్టనర్స్‌ని ఎన్నుకున్నావ్. కుంకుమ నిన్ను ఏమార్చిందని తెలుస్తోంది. విశ్వకర్మారావూ, గజపతీ, రాంజోగీ నీకోసం నేలమాళిగలో రెడీగా గొయ్యి తవ్వి వుంచారు!" డిటెక్టివ్ టెంపో అన్నాడు. "నీవు మళ్లీ బేడీలు ధరించకుండా నించున్న గుప్తాని చూస్తోంటే, అతనూ నిన్ను చండీదాస్‌కి-నకిలీ ఇన్ స్పెక్టర్ చండీదాస్‌కి వేలంవేసి అమ్మేశాడని తెలుస్తోంది!"

బలరాం పెదవులు అదురుతున్నాయి. రెప్పవేయ

కుంఠా టెంపోని చూస్తూండిపోయా డతను.

"గుప్తా....నమ్మకద్రోహి! నాకు విషం యిచ్చే ప్రయత్నం చేశాడు!" బలరాం చాడీ చెపుతున్నట్టు అన్నాడు.

టెంపో చిన్నగా నవ్వాడు. "నువ్వు తయారుచేయించిన కిరీటంలాగే, నకిలీ పార్ట్‌నర్స్‌ని తయారుచేసు చేసుకున్నావ్!"

విగ్రహాల్లా నిలబడ్డ బలరాంనీ, గుప్తానీ, మంగూనీ, చండీదాస్‌నీ, కుంకుమనీ, డిటెక్టివ్ టెంపో కలయజూశాడు. అందరి మొహాల్లోనూ ఓటమి విశ్వరూపంలో దర్శనమిస్తోంది.

"పృథ్వీరావ్, నీ ఖైదీలందర్నీ కారులో ఇరికించలేవు. టెలిఫోన్ ఉపయోగించు. బాణసంచాతో సహా వ్యాను తెప్పించు!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"మిస్టర్ టెంపో, నేను........ నేరం........ చేయలేదు...." గుప్తా ప్రారంభించాడు. డిటెక్టివ్ టెంపో నవ్వు అతన్ని ఆపింది.

"గుప్తా, ఘరానా పెద్దమనిషిగా చెలామణీ అవుతున్న నీ మాటల్ని, సాధారణంగా యెవరేనా నమ్ముతారు. కానీ, వజ్రకిరీటం చేరానికి మొదట్నుంచీ నువ్వు పెట్టుబడి పెట్టావని విశ్వకర్మారావూ, అతని యిద్దరు మిత్రులూ స్టేట్‌మెంట్ ఇచ్చారు. కాసేపట్లో బలరాం కుంకుమా యిద్దరూ వాళ్ళతో శ్రుతి కలుపుతారు! చాలా కాలంగా దొంగలకి దొరలా రాణించిన నువ్వు దొంగగా దొరికిపోయావ్!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"టెంపో, ఐజీగారు నీతో మాట్లాడతారు...." ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ టెలిఫోన్ రిసీవర్ని టెంపోవైపు

చాచాడు.

టొంపో రిసీవర్ని చెవికి ఆనించాడు. అవేళ తో ఐజీ చెప్తున్న మాటల్ని చిరునవ్వుతో విన్నాడు.

"థాంక్స్. జ్ఞానపర్వతంమీదికి ఫోన్ చేయండి. వజ్రకిరీటం గురించి మీ నోటితో మీరే చెప్పండి! కాసేపట్లో అక్కడుంటాం. మీరూ పృథ్వీరావ్ కిరీటాన్ని కొండమీదికి తీసికెళ్ళండి...."

"... ... ...."

"అలాగే, నేనూ వస్తాను. అంతా కార్లో వివరిస్తాను...."

"... ... ...."

"యస్. స్వామీజీకి టోపీ వేసి, వజ్రకిరీటం కొట్టేయడానికి ప్రయత్నించిన వాళ్ళందరికీ అది ముళ్ళ కిరీటం అయింది!" టొంపో నవ్వుతూ అన్నాడు.

"... ... ...."

"ఐజీగారూ, అయామ్ సారీ. ఆశీర్వాదాలు అన్నం పెట్టవు! నేను ప్రయివేట్ డిటెక్టివ్‌ని. పాటుపడినందుకు ప్రతిఫలం కావాలి!" టొంపో నవ్వుతూ అన్నాడు. "అన్నట్టు ప్రభంజనంని అక్కడే ఉండమనండి. అడ్వెంచర్ సాగించిన వాళ్ళందర్నీ, వజ్రకిరీటాన్ని తిరిగి సంపాయించిన ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావునీ తన కెమెరాలో బంధిస్తాడు!" అంటూ టొంపో రిసీవర్ని పడేశాడు.

కెమెరా అనగానే బిక్కచచ్చిపోయిన వాళ్ళందర్నీ చిరునవ్వుతో చూస్తూ, ఉషారుగా సిగరెట్ వెలిగించాడు.

—: అయిపోయింది :—

# తెల్ల పావురం

## బొమ్మిడి అచ్చారావు

నూన్ షో వదిలారు.

శ్యామల థియేటర్ నించి బయటికొచ్చి రోడ్డెక్కింది ఎండ మాడ్చేస్తోంది.

మధ్యాహ్నం రెండుగంటలు దాటి పదినిమిషాలయింది. కాలినడక నే వెళ్తోంది.

రోడ్డు తిరిగేచోట ఓ నలభైయేళ్ళ స్త్రీ ఆమెను చూసి చిరునవ్వు నవ్వింది.

శ్యామల తెల్లబోయి చూసిందామె వంక. గతంలో ఎప్పుడూ ఆమెను చూసివుండలేదామె.

"నీ పేరు శ్యామల కదూ!?" చనువుగా అడిగిందామె.

"అవును, మీ కెలా తెలుసు?!...." అన్నది శ్యామల.

"నువ్వు గాంధీనగర్ వెళ్ళాలి. అవునా?"

తలూపింది శ్యామల.

"రిక్షాలో వెళ్దాం. నేనూ అటే వెళ్తున్నాను."

శ్యామల వారించేలోగా ఆమె రిక్షాను కేకేసింది. బేరమాడకుండా నే యెక్కి కూచుని, ఇంకా రోడ్ మీద అలాగే నిల్చుండిపోయిన శ్యామలను చూసి "దా, ఎక్కు" అన్నదామె.

"మీరు వెళ్ళండి. నేను నడిచే వస్తాను. నా కలవాటే!" అన్నది శ్యామల మొహమాటంగా.

"భలేదానివే! రిక్షా బాడుగ నువ్విర్వనక్కర్లేదు. దా, ఎక్కు మరి!" ఆమె తొందర చేసింది.

తప్పదన్నట్టు ఎక్కికూచున్నది శ్యామల.

"నా పేరు అరుంధతి. నాకు నీ వయసు కూతురుంది" అన్నదామె.

శ్యామల ఒదిగి కూచుంది. అరుంధతి చాలా అధునాతనంగా అలంకరించుకున్నది. ఆమె ఒంటిమీది నుంచి మత్తుగాలి పే పరిమళం గుప్పున శ్యామల నాసికాపుటాల్ని సోకింది. వయసుకితగ్గ అలంకరణ చేసుకోలేదు అరుంధతి అనుకున్నదామె.

"నీకు సినిమాలంటే బాగా ఇష్టమనుకుంటాను!" అన్నది అరుంధతి.

శ్యామల నవ్వి వూరుకుంది.

"నాకూ ఇష్టమే! వచ్చిన ప్రతి సినిమా చూస్తాను. అయితే డబ్బులు మా ఆయన్ని అడగను. నేనే సంపాదించుకుంటాను" చెప్పింది అరుంధతి.

"అదెలా?" అప్రయత్నంగా అడిగింది శ్యామల.

అరుంధతి చిన్నగా నవ్వి, "తర్వాత చెపుతాను. నీ కూడా మీ ఆయన్నడగకుండా డబ్బులు సంపాదించాలని వుంటే ఇప్పుడే చెపుతాను" అన్నది.

శ్యామలకి ఆమె మాటలు రుచించలేదు. భర్తకి తెలియకుండా, భార్య ఎలా సంపాదించగలుగుతుంది? అలా సంపాదించే డబ్బు ఆమెకేం సుఖమిస్తుంది? ఊహూ! ఆ ఆలోచనే రుచించలేదామెకు.

రిక్షా తాపీగా రోడ్డుమీద దొర్లుతోంది.

అరుంధతి శ్యామల ముఖంలో మారుతున్న రంగుల్ని గుర్తుపట్టింది.

"ఏ కోరికా తీరకుండా, ప్రతి పైసాకి భర్తమీద ఆధారపడటం దుర్భరం సుమా! చివరికి పావలా మల్లెపూలు కొనుక్కోవాలన్నా భర్త గారి నడగాలి. ఛ.... ఛ....అంతకన్నా బానిస బతుకు మరోటి లేదు."

శ్యామల అప్పటికీ మాట్లాడలేదు.

శ్యామల భర్త బాబూరావు ఏదో గవర్నమెంటు ఆఫీసులో జవానుగా పని చేస్తున్నాడు. అతను తెచ్చే జీతం వాళ్ళిద్దరికీ, ఇద్దరు పిల్లలకి చాలీ చాలకుండా వుంటోంది. ఒక్కోసారి నిత్యావసరాలకే చాలడు. ఇక సినిమాలు, షికార్లు అంటే యెలా సరిపోతుంది? శ్యామల కెన్నో తీరని కోరికలున్నాయి. అయినా జీవితంలో రాజీపడిపోయి బతికేస్తోంది.

ఇద్దరు పిల్లలు స్కూలు చదువుకొచ్చారు. ఉదయం పోయి సాయంత్రం నాలుగ్గంటలకి యింటికొస్తారు. భర్త తొమ్మిది గంటలకి పోయి ఆరుగంటలకి తిరిగొస్తాడు సాయంత్రం. ఈ లోపల శ్యామలకి కాలక్షేపం కాక పిచ్చెత్తి పోయినట్టుంటుంది. ఆ ఒంటరితనం నుంచి తప్పించుకోవటానికి మార్నింగ్ షోలకి వెళ్తుంటుంది.

ఇప్పుడలాగే వెళ్ళి అరుంధతి కళ్ళబడింది.

"నీ కిష్టమయితే ఆ మార్గం చూపిస్తాను. ఇష్టం లేక

పోతే యీ విషయం యింతటితో మరచిపో!" అంది అరుంధతి.

ఇంతలో రిక్షా శ్యామల ఇల్లు సమీపించింది.

శ్యామల, రిక్షా ఆపించి దిగుతూ, "తర్వాత చెబుతాను" అంది.

అరుంధతి చిన్నగా నవ్వి, తలూపింది.

రిక్షా ముందుకి కదిలింది.

శ్యామల సాయంత్రంవరకూ ఆలోచిస్తూనే గడిపింది. అరుంధతి సూచించిన మార్గం ఆచరణీయంగా అనిపించటం మొదలెట్టింది. అసలింతకీ అరుంధతి యేం చెప్పదలచుకొంది?

స్పష్టాస్పష్టంగా, ఆదేమిటో శ్యామల మనసుకి తాకింది. గుండె ఝల్లుమన్నది. మగాడికి తెలియకుండా, ఆడది సంపాదించే మార్గం ఒక్కటే! ఒళ్ళమ్ముకోవటం!....

కంపరంగా అనిపించింది శ్యామలకి.

ఛ! ఛ! తనా స్థితికి దిగజారదు, ఎన్నటికీ తనా మార్గాన వెళ్ళదు, వెళ్ళలేదు. నీతిగా గంజి తాగటమే తన కానందం. పడుపు సొమ్ముతో వచ్చే పంచభక్ష్య పరమాన్నం తనకొద్దు. తనకి నీతి ముఖ్యం.

శ్యామల ఈ నిర్ణయానికొచ్చాక నిమ్మళంగా ఉండగలిగింది. అంతవరకు మెదడుని ఆలోచనలు తొలిచివేసి మనసుని చిరాకుపరిచాయి.

ఇంతలో స్కూలునించి పిల్లలు తిరిగొచ్చారు.

ముద్దులొలికే ఆ చిన్నారుల ముఖాలు చూడగానే ఆమెలో అంతవరకు ఏ మూలో వున్న సందిగ్ధం పూర్తిగా

ఎగిరిపోయింది.

పిల్లలిద్దర్నీ ప్రేమతో దగ్గరకు తీసుకొంది శ్యామల.

## 2

“మీరు తెచ్చే సొమ్ముతో ఇంట్లోకి సరుకులే రావటం లేదు. సరదాలు తీర్చుకోవటం కూడానా?” ఈసడింపుగా అంది సరళ.

రాజారావు చిరాగ్గా చూశాడు భార్యవంక.

“చూడు సరళా! మనం భాగ్యవంతులం కాము. నేను చేసే ఉద్యోగం గజిటెడ్ ఆఫీసర్ కాదు. ఓ సామాన్యమైన ప్రయివేట్ కంపెనీలో చిన్న గుమాస్తాని. నెలకి అయిదువందల లివ్వటమే గగనం మా యజమానికి. అది కాదని వదులుకొంటే మళ్ళీ ఆ మాత్రం ఇచ్చే ఉద్యోగం దొరకటం జరిగేపని కాదు. వచ్చిందాంతో నే సరిపెట్టుకోవాలి. తృప్తి లేకపోతే ఎంత తెచ్చుకున్నా సరిపోదు” అనునయంగా చెప్పబోయాడు.

“ఇప్పుడు మనిద్దరికే చాలటంలేదు మీ ఆదాయం. రేపు మనకి పిల్లలు పుట్టుకొస్తారు. వాళ్ళ అవసరాలు చూడాలి. వాళ్ళని పెంచి పెద్దవాళ్ళని చెయ్యాలి. అన్నిటికీ డబ్బుతోనే పని.”

“నిజమే! వాళ్ళు అదృష్టవంతులయితే నా జీతం పెరగొచ్చు. ఎప్పుడూ ఒకేలాగే వుంటుందా? ఈ లోపల అవకాశాలు వస్తే యే గవర్నమెంటు ఉద్యోగమో వెతుక్కొంటాను....”

“అవకాశాలు మిమ్మల్ని వెతుక్కొంటూ రావు. మీరే వాటిని వెతుక్కొంటూ వెళ్ళాలి. కాని మీరు యేమాత్రం ప్రయత్నం చెయ్యరు. మీ కాలి దగ్గరకే రావాలి అన్నీను.”

"సరళా! ఇప్పుడే కదా కష్టపడి ఆఫీసు నుంచి వచ్చాను!? రాగానే, నీ నస ఏమిటి? నాకు మనశ్శాంతి ఉండక్కర్లేదా?"

"కడుపు శాంతి స్తేనే కదా, మనసు శాంతించేది!? ముందు కడుపునిండా మూడుపూటలు తినగలిగే దారి చూపించండి.... ఆ తర్వాత మనసు గురించి ఆలోచించవచ్చును."

రాజారావుకి చర్రున కోపమొచ్చేసింది.

"మీ నాన్న నిన్ను నాకు కట్టబెట్టే బదులు, పెద్ద ఆఫీసర్ నెవర్నయినా చూసి చెయ్యాల్సింది నిన్ను. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. నేను సంపాదించే దానితో సంసారం గడపలేకపోతే నన్ను వదిలేసి వెళ్ళిపో!" అంటూ చెప్పులు వేసుకొని విసురుగా బయటకు వెళ్ళిపోయాడు.

"పట్టి గొడ్డుకు అరుపు లెక్కువ. సంపాదన లేదు గానీ, పెళ్ళాం మీద విరుచుకుపడ్తున్నాడు. ఏమన్నా చెల్లుతుందనే అహంకారం. మగవాడినన్న పొగరు...."

వెనుక నుంచి సరళ గొణుగుతూనే వుంది. కాని అప్పటికే రాజారావు రోడ్డెక్కి యెటో వెళ్ళిపోతున్నాడు.

వెనుతిరిగి లోనికొస్తున్న సరళ ఎవరో పిలుస్తున్నట్టనిపించి తలతిప్పి చూసింది.

గుమ్మంలో యెవరో అపరిచిత స్త్రీ నిల్చుని వుంది!

"ఎవరండీ మీరు? యెవరు కావాలి?" అనడిగింది సరళ.

ఆమె చిన్నగా నవ్వి, "నువ్వే కావాలమ్మా సరళా" అంది.

"నా పేరు మీకెలా తెలుసు? మిమ్మల్ని యెక్కడా చూసినట్టులేదు!" అంది ఆశ్చర్యంగా సరళ.

"నా పేరు అరుంధతి. నీ గురించి నాకు చాలా తెలుసు. చాలీచాలని సంపాదన నీ భర్తది. నిత్యావసరాలే తీరని గడ్డు పరిస్థితి.... అంతా తెలుసు నాకు" నవ్వింది ఆమె.

సరళ విస్తుపోయి చూసింది. "ఇలా కూర్చోండి. అంతా విన్నారన్న మాట!?....ఏవో ఆర్థికసంబంధమైన యిబ్బందులు. ప్రతి యింట్లోనూ సహజంగా ఉండేవే కదా!" అంది.

అరుంధతి చెక్క కుర్చీలో కూచుంటూ, "నిజమేనమ్మా. ఆర్థికపరమైన యిబ్బందులు ప్రతి యింటా ఉంటాయి. కొందరు తెలివిగా వాటినుంచి తప్పించుకుని సంసారాన్ని సుఖమయం చేసుకొంటుంటారు. చాలా మంది దుఃఖభాజనం చేసుకుంటారు. నువ్వు తెలివైనదానివనే అనుకొంటున్నాను" అంది.

సరళ వెంటనే ఏమీ చెప్పలేదు.

"ఇంతకీ మీను చెప్పేదేమిటి?"

"భర్తకి ఆదాయంలో చేదోడువాదోడుగా ఉండటం భార్య బాధ్యత."

"నేను పెద్దగా చదువుకోలేదు. చేద్దామన్నా ఉద్యోగ మెవరిస్తారు?"

"నేను!"

"మీరా....?" ఆశ్చర్యంతో సరళ కళ్ళు విశాలమయ్యాయి.

"అవునమ్మా, నేనే! మామూలుగా ఆఫీసుల్లో పని మల్లే గంటల తరబడి కష్టపడనక్కర్లేదు. అసలా మాట

కాస్త కష్టమే కాదు సుఖమే! సుఖమైన సంపాదన మార్గం!"

సరళ అనుమానంగా చూసిందామె వంక.

"చాలీచాలని సంపాదనతో ఏ కోరికా తీరకుండా నిత్యం దరిద్రంలో మునిగిపోయే కంటే, మనకి చేతనైన రీతిలో చేతనైనంత సంపాదించటం మంచిది కదా!" అంది అరుంధతి.

"ఎలా?" అడిగింది సరళ.

"చెప్తాను. నీ కిష్టమైతే.... బలవంతం లేదు.... నువ్వు కావాలంటే నే చెప్తాను. నీ భర్తకి తెలియకుండా, అతను ఆఫీసునించి ఇంటికి తిరిగొచ్చేలోపల నీ పని పూర్తి చేసుకోవచ్చు. ఆ ఆదాయంతో నీ కావాలసినవన్నీ కొనుక్కోవచ్చు. నీకు తీరని కోరికలేమైనా వుంటే తీర్చుకోవచ్చు. ఏమంటావు?"

సరళ మనసు పరిపరివిధాల పోతోంది.

ఏం చెప్పబోతోం దీమె? అసలు ఈమె ఎవరు? తన సమస్యల్ని తీర్చటానికి ఎందుకు సిద్ధపడింది. తనకి ఆర్థిక సమస్యలున్నట్టు ఈమెకేలా తెలుసు?! కేవలం చాటు నుంచి విని గ్రహించిందా?

"అసలు మీరు చెప్పబోయే మార్గమేమిటి?"

"తీరా చెప్పాక అఫెండవకూడదు. సరేనా?!"

"చెప్పండి...."

అరుంధతి దగ్గరగా వచ్చి సరళ చెవిలో చెప్పింది.

సరళ ముఖం ఎర్రబడింది ఆ మాటలు వినగానే. ఆమె ఒంట్లో సన్నగా ప్రకంపనలు పుట్టాయి. ముఖంలో రంగులు మారాయి. ముక్కుపుటాలు అదిరాయి.

అరుంధతి ఆమెని పరీక్షగా చూస్తోంది. ఆమె మన

సులో చెలరేగుతున్న సంక్షోభాన్ని అంచనా వేస్తోంది.

"ఇందులో బలవంతమేమీ లేదు. నీ ఆర్థిక పరిస్థితిని చూసి బాధ కలిగి నీకీ మార్గాన్ని సూచించాను. ఇప్పుడైనా నీ కిష్టం లేకపోతే మానెయ్యవచ్చు."

సరళ ముఖం గంభీరముద్ర దాల్చింది.

"నే నెప్పట్నుంచి రావాల్సి వుంటుంది?" అంది స్థిరంగా.

అరుంధతి ముఖంలో ఆనందవీచికలు కదలాడాయి. భావయుక్తంగా నవ్వింది.

"రేపట్నుంచీ మొదలు పెడదాం" అంది.

సరళ మౌనంగా ఆలోచిస్తోంది.

## 3

ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజినుంచి బయటికొస్తున్న గోపాల్‌ని చూసి పలకరింపుగా నవ్వాడతను.

గోపాల్ మొహమాటంగా నవ్వాడు.

"నా పేరు స్వామి....నువ్వు ఎంప్లాయిమెంట్ కోసం ఈ ఆఫీసు చుట్టూ కాళ్ళరిగేలా తిరుగుతున్నావు, ఇంటర్వ్యూ కోసం పడిగాపులు కాస్తున్నావు. ఇంటర్వ్యూ వస్తే యింటికి తెలియపరుస్తారు కదా. ఆఫీసు చుట్టూ తిరగటం దేనికి?"

"ఒక్కొక్కసారి పోస్టల్ ఆలస్యంవల్ల ఇంటర్వ్యూ తేదీ దాటిపోయాక యింటిమేషన్ అందవచ్చుననే భయంతో ప్రతిరోజూ వచ్చి కనుక్కొని వెళ్తున్నాను" అన్నాడు గోపాల్.

"అంటే.... ఉద్యోగాలు అంత విరివిగా దొరికిపోతున్నాయనుకుంటున్నావా? రోజూ ఖాళీలు వచ్చేస్తున్నాయని, వాటిని వెంటనే భర్తీ చేసేస్తున్నారని,

ఇంటిమేషన్ అందక అవకాశం పోతుందనీ నీ ఉద్దేశమను కుంటాను!?"

"నిరుద్యోగిని కదండీ! ఆశపడటం సహజం."

"కాని ప్రస్తుతపరిస్థితుల్లో ఉద్యోగం—అందునా గవర్నమెంటు ఉద్యోగం దొరకటం అంత తేలికేం కాదు. దానికెంతో ప్రొసీజర్ వుంది. ఉత్తర దక్షిణాలు కావాలి. కేవలం ఆశపడినంతమాత్రాన ఉద్యోగం వచ్చెయ్యదు."

"ఏం చెయ్యమంటారండీ! నాన్నగారు మరో నాలుగు నెలల్లో రిటైర్ కాబోతున్నారు. ఇంట్లో పెళ్ళికెదిగిన చెల్లెళ్ళు ఇద్దరున్నారు. చదువుకుంటున్న తమ్ముళ్ళు ముగ్గురున్నారు. వీళ్ళందరికీ నాన్న తెచ్చే వెయ్యిరూపాయల జీతమే ఆధారం. ఆయన రిటైరయ్యేలోపల యేదోక ఉద్యోగం చూసుకోవాలని నా తాపత్రయం."

"నీ ఉద్దేశం మంచిదే! కాని ఉద్యోగాలు అంత తేలిగ్గా దొరకవు. మనమే ఏదో చిన్న చిన్న పనులు చేసి డబ్బు సంపాదించుకోవాలి ఉద్యోగం దొరికే వరకు."

"చిన్న చిన్న పనులా? చదువుకున్నాను కదా— కూలినాలి చేయటానికి మనసొప్పదు. దానికి సిద్ధపడినా చదువుకున్నవాడిని ఆ పని చెయ్యలేనని ఎవరూ కూలిపని ఇవ్వరు. రెంటికీ చెడిన రేవడిలాంటి స్థితి"

"చిన్నపనులంటే కూలిపనులు కాదు, నా అభిప్రాయం. నీ చదువుకి, నీ ఆత్మాభిమానానికి సరిపోయే పని చేసుకోమని! అలాంటి పనేదైనా దొరికితే చెయ్యటానికి నీ కభ్యంతరమా?"

"అభ్యంతరమా? భలే అన్నారు!? ఎగిరి గంతేసి చేస్తాను. నాక్కావలసింది యేదోవిధంగా డబ్బు సంపా

దించి, మా నాన్నగారికి ఆర్థికంగా సాయపడటం! అంతే."

"'ఏదోవిధంగా' సంపాదించటం! కరెక్టు, నీకా మార్గం చూపిస్తాను. నాతో వస్తావా?"

"ఎక్కడికి?"

"చెప్తాను. నామీద నమ్మకముంటే నాతో రా! ఏం చెయ్యాల్సిందీ ఎలా చెయ్యాల్సిందీ చెప్తాను."

"మీమీద నాకు నమ్మకముంది."

"వెరీగుడ్! నువ్వు నాకు బాగా నచ్చావు. ఇక నీ కుటుంబానికి నువ్వొక పెద్ద ఎస్సెట్ అవుతావు. నీ చెల్లెళ్ళకి పెళ్ళిళ్ళు, నీ తమ్ముళ్ళ చదువు పూర్తవుతాయి."

"చాలు. నాకంతకన్నా కావలసిందిలేదు" తృప్తిగా అన్నాడు గోపాల్.

స్వామి చిరునవ్వు నవ్వాడు.

## 4

"నగరంలో ఇప్పటివరకు ముప్ఫయిమంది నిరుద్యోగ యువకులు, పన్నెండుమంది వివాహిత మహిళలు అంతర్థానమయ్యారు. దాదాపు వారంరోజుల వ్యవధిలోనే వీరందరు అదృశ్యమయ్యారు. మా డిపార్టుమెంట్ ని తికమకపరచి, అంతుచిక్కని కేసుగా, మాకో సవాల్ లా నిలిచిందీ కేసు" చెప్పాడు ఇన్ స్పెక్టర్ శ్రీనివాస్.

డిటెక్టివ్ కిరణ్ సాలోచనగా చూశా డతని వంక.

శ్రీనివాస్ ఫైల్ అతనికందించాడు. అందులో అంతర్థానమైన యువకుల, మహిళల ఫోటోలు, వాటి కింద వాళ్ళ వివరాలు వున్నాయి.

"నిరుద్యోగ యువకుల అంతర్ధానం గురించి రిపోర్టులు

తర్వాత వాళ్ళ ఇళ్ళకు వెళ్ళి ఇన్వెస్టిగేట్ చేశావా."

"చేశాను."

"అందులో ఏమైనా ఆసక్తి కలిగించే అంశాలేమైనా గమనించావా?"

"దాదాపు అందరు గ్రాడ్యుయేషన్ పూర్తి చేసిన వాళ్ళే. నలుగురు పోస్టుగ్రాడ్యుయేట్స్, ఇద్దరు ఇంజనీరింగ్ గ్రాడ్యుయేట్స్‌కూడా వున్నారు. అందరిదీ ఒకటే సమస్య—ఆర్థిక సమస్య!"

"వాళ్లు అంతర్థానమైన రెండురోజుల తర్వాత వాళ్ళ ఇళ్ళకు ఎవరో అజ్ఞాత వ్యక్తులు డబ్బు తెచ్చి ఇచ్చారట. అయితే వాళ్ళ వివరాలు మాత్రం చెప్పలేదట."

"మరి ఆ వివాహిత స్త్రీల విషయం....!?"

"అది మాత్రం ఇంకా పజిల్ లాగానే మిగిలిపోయింది. వాళ్ళ భర్తలు ఆర్థికంగా వెనకబడి వున్నవాళ్ళే. చిన్న చిన్న ఉద్యోగాలు, ప్రయివేట్ కంపెనీల్లో ఉద్యోగాలు చేస్తూన్నవాళ్లు!"

"వాళ్ళ భర్తలకు కూడా డబ్బు అందచేయబడిందా?"

"లేదు."

"వాళ్ళ సంసార జీవితాల్లో అసంతృప్తి, అవగాహన లోపించటం, మనస్పర్థలువంటివి ఏమైనా వున్నాయా?"

"ఉన్నాయేమో తెలీదు, వాళ్ళు మాత్రం అలాంటివేమీ లేవని చెప్పారు. భార్యల చిన్న చిన్న కోరికలు తీర్చలేకపోవటంతప్ప వాళ్ళమధ్య మరే గొడవలూ లేవని తేలింది."

కిరణ్ కొద్దిక్షణాలు మౌనంగా వుండిపోయాడు.

ఈ యువతుల్ని యెవరు తీసుకుపోయారు? బలవంతాన

తీసుకుపోవటం జరగలేదని, వాళ్లు ఇష్టపూర్వకంగానే యెక్కడికో వెళ్ళిపోయింటారని అర్థమవుతోంది— వాళ్ళ తరఫున సొమ్ము వాళ్ళ ఇళ్ళకు అందడం గురించి ఆలోచిస్తే.

అందరూ నిరుద్యోగులే. అందరూ యువకులే. ఈ దేశంలో నిరుద్యోగులకు కొదవలేదు. కాని, ఒకేసారి ముప్పయిమంది అంతర్ధానం కావటం, రెండునెలల తర్వాత వాళ్ళ ఇళ్ళకు డబ్బు అందజేయబడటం—అంతా ఓ ప్లాన్ ప్రకారం జరిగినట్టు కనిపిస్తోంది.

ఆ యువకుల్ని యెవరు మాయం చేశారు? ఏమాశించి?

కణతలు రుద్దుకున్నాడు కిరణ్.

సంసారం చేసుకుంటున్న స్త్రీలని కూడా ఆ మనుషులే మాయం చేశారా? లేక వేరు వేరు ముఠాలు చేసిన పనా? పెళ్ళికాని అందమైన యువతులు అంతర్ధానం కావటం సర్వసాధారణంగా జరిగేదే! అందుకు సరయిన కారణాలుకూడా వుండొచ్చు.

కాని, కొన్నాళ్ళు భర్తలతో కాపరం చేసిన ఆడవాళ్ళతో ఎవరికి యెలాంటి పనిపడిందా?

తల విదిలించాడు కిరణ్.

"ఎలాగైనా ఈ కేస్ ట్రేక్ చెయ్యాలి బ్రదర్. ఇది మా డిపార్టుమెంట్ ప్రెస్టేజ్ కి సంబంధించిన విషయం. ఇప్పటివరకు యేవిధమైన క్లూ దొరకలేదు. అసలు వీళ్ళందరూ మాయంకావటానికి మోటివ్ కూడా యేమీ అంతుబట్టలేదు. చాలా అరుదైన కేసు" చెప్పాడు శ్రీనివాస్.

కిరణ్ సాలోచనగా చూశాడతనివంక.

"ఈసారి ఆ స్త్రీల యిళ్ళకు వెళ్ళొద్దాం" అన్నాడు.
శ్రీనివాస్ తలూపాడు.

## 5

క్యాషియర్ ఇచ్చిన నోట్లకట్టలని బ్రీఫ్‌లో సర్దుకున్నాడు పరాంకుశం.

డబ్బు విషయంలో తన దగ్గర పని చేస్తూన్న సిబ్బందిని నమ్మడు పరాంకుశం. అందుకే చిన్న ఆటో మొబైల్ షెడ్‌ని ఈ రోజు నగరంలోకల్లా పెద్ద ఆటోమోటివ్ లిమిటెడ్ సంస్థగా యెవరూ ఊహించనంత ఎత్తుకి అభివృద్ధి చేశాడు. తను ఎదిగాడు, తన సంస్థలో కొన్ని వేలమందికి ఉపాధి కల్పించాడు.

అయితే పరాంకుశం న్యాయంగా సంపాదించింది చాలా తక్కువ. అసలు న్యాయం అనే మాటకు అతని డిక్షనరీలో అర్థమే లేదు!

ఆ రోజు వర్కర్సుకి పే డే! ప్రతి నెలా మొదటి తేదీన ఠంచనుగా జీతాలు చెల్లిస్తాడు పరాంకుశం. అది యెన్నో యేళ్ళుగా వస్తూన్న ఆచారం. అయితే పని వాళ్ళ శ్రమకు తగ్గ జీతమిస్తూన్నాడా అంటే లేదనే చెప్పాలి! బోనస్‌లు, ఇంక్రిమెంట్లు వంటివి వర్కర్సు కివ్వటంవల్ల వాళ్ళలో సోమరితనాన్ని పెంచినట్టే అవుతుందని అతని అచంచల విశ్వాసం.

అలాంటి పరాంకుశం, కేషియర్ ఇచ్చిన కొత్త నోట్లకట్టలని కూడా ప్రతి నోటూ విడకుండా లెక్కించి గాని బ్రీఫ్‌లో సర్దుకోలేదు.

డ్రైవర్‌నికూడా వెంట తెచ్చుకోడు పరాంకుశం క్యాష్ డ్రా చేసేటప్పుడు డ్రైవర్ డబ్బాళతో తనని యెక్కడో యేక్సిడెంట్ చేసి డబ్బు పట్టుకుని పారి

పోతాడని అతని అనుమానం.

అనుమానం ముందుపుట్టి పరాంకుశం తర్వాత పుట్టాడని చెప్పుకుంటారందరు.

బ్యాంక్ నించి సరాసరి తన ఫ్యాక్టరీకి కారును తోలుకొని వెళుతున్నాడు పరాంకుశం.

ఊరికి బాగా చివరగా ఇండస్ట్రియల్ యేరియాలో వుం డతని ఫ్యాక్టరీ! మధ్యలో దాదాపు యెనిమిది కిలో మీటర్ల దూరం పూర్తిగా నిర్మానుష్యంగా, యెలాంటి కట్టడాలు లేకుండా వుంటుంది.

సిటీ లిమిట్స్ దాటి జనావాస ప్రాంతం దాటి సర్రున సాగిపోతోంది కారు.

సరిగ్గా అప్పుడే అతని మెడమీద చల్లగా తగిలింది.

పరాంకుశం పైప్రాణాలు పైనే ఎగిరిపోయాయి. అది రివాల్వర్ మొన అని అతనికి తెలుసు! అయితే తన కార్లో తనతోబాటు మరో మనిషి ప్రయాణం చేస్తున్న విషయం తెలియదు.

"కారు ఆపి పక్కగా నిలబెట్టు" అన్నది వెనక నుంచి కర్కశమైన గొంతు.

పరాంకుశం వెంటనే ఆపలేదు కారు.

అతని మెడకి రివాల్వర్ గొట్టం బాగా ఒత్తుకున్నది.

పరాంకుశం వెన్నులో చలిపుట్టింది. ప్రాణభయం అతని నరనరాన పాకి, అతని కాళ్ళు బ్రేకని అదిమాయి.

కీచుమని శబ్దం చేస్తూ కారాగింది. వెనక కూచున్న వ్యక్తి రివాల్వర్ మడమతో పరాంకుశం నెత్తిమీద కొట్టాడు.

అంతే, పరాంకుశం తల పక్కకు వాలిపోయింది.

"ఏం చేద్దాం ఇతన్ని?" అడిగాడు అంతదాకా రివా

ల్యర్‌ని పరాంతకానికి గురిచేసి వుంచిన దిలీప్.

గోపాల్ చిన్నగా నవ్వి, "స్వామి ఆదేశం మేరకు మనం ఈ కార్లో యితన్ని ఇలాగే నడిరోడ్డుమీద వదిలేసి బ్రీఫ్‌లోని సొమ్ము మన గోతాములో వేసుకొని మన కార్లో వుడాయించటమే!" అన్నాడు.

చేతులకి గ్లోవ్స్ వేసుకున్నారిద్దరు. బ్రీఫ్‌లోని నోట్ల కట్టలను తమ వెంట తెచ్చిన గోతాములో సర్దుకుని కారు దిగారు.

అక్కడికి పది మీటర్ల దూరంలో బ్రౌన్ కలర్ మారుతీ కారు సిద్ధంగా వున్నది.

గోపాల్, దిలీప్ మారుతి కారు సమీపించారు. ఓసారి కారు లోపల పరీక్షగా చూసుకొని, ఎవరూ లేరని నిర్ధారణ చేసుకున్నాక కారెక్కారు. గోపాల్ డ్రైవింగ్ సీట్లో కూచున్నాడు. దిలీప్ వెనక సీటుకింద గోతాము దాచాడు.

మరుక్షణం మారుతీకారు మహావేగంగా సిటీవైపు దూసుకుపోయింది.

## 6

"ఏమాలోచించుకున్నావు?" అన్న మాటవిని దిగ్గున తలెత్తి చూసింది శ్యామల.

ఎదురుగా చిరునవ్వుతో అరుంధతి!

ఆమెను చూడగానే ఒంటిమీద తేళ్ళు, జెర్రులు పాకినట్టు అనుభూతి చెందింది శ్యామల..

"నాకు ఈ జీవితమే బావుంది. నా భర్త తెచ్చే సంపాదనతో హాయిగా గడిచిపోతుంది. నాకు పెద్దగా కోరికలేవు. మీ అవసరం యెప్పటికీ రాదు, రాకూడదని కోరుకుంటున్నాను."

శ్యామల మాటలకు అరుంధతి నవ్వింది.

"చాలా పిచ్చిదానివి నువ్వు. నేను నిన్ను కాని పని చెయ్యమన్నానా? నీ భర్తకు తెలియకుండా సంపాదించే మార్గం చెపుతానన్నాను, కాని చెప్పలేదు కదా!? అదేమిటో తెల్సుకోవాలని కూడా నీకనిపించటం లేదా?"

"భర్తకి తెలియకుండా ఆడది సంపాదించే మార్గమేమిటో నాకు తెలుసు!"

"అందుకే నువ్వు పిచ్చిదానివన్నాను. అదేమిటో చెప్పనా?"

"వద్దు, వద్దు. వినే ఓపికూడా లేదు నాకు. అదేమిటో నాకు తెలుసు. మీరు వెళ్ళొచ్చు."

"నీకు తెలిసిందేమిటో చెప్పు."

"ఆ నీతిమాలిన మాట నేను నా నోటితో ఉచ్చరించలేను."

"అక్కడే పొరబడుతున్నావు. నేను నిన్ను నీతిమాలిన పనేదీ చెయ్యమని అడగలేదే! గౌరవప్రదంగా, నీ నీతి నియమాలకు, ఆత్మగౌరవానికి భంగంలేని పనే అది...."

శ్యామల విచిత్రంగా చూసింది దామె వంక.

"అవునమ్మా, నా మాట నమ్ము....ఇలా నా దగ్గరగా రా....ఒక్క క్షణం నీ చెవినిలా పారెయ్...." అంటూ మెల్లగా గొణిగింది శ్యామల చెవిలో.

ఆ మాట వింటూనే శ్యామల నిటారుగా అయింది. ఆమె శరీరం సన్నగా కంపించింది. ఆశ్చర్యంతో ఆమె విశాల నేత్రాలు మరింత విశాలమయ్యాయి.

"ఆ పని నావల్లనవుతుందంటావా? అమ్మో నాకు భయం!" అన్నది గొంతు పెకల్చుకుని.

"భయం దేనికి పిచ్చిపిల్లా! నువ్వొక్కదానివే కాదు

కదా, నీలాంటి అమ్మాయిలు చాలామంది వున్నారు. వాళ్ళందరితోను కలిసి ఈ పనిలో పాల్గొనటం చాలా ఆనందంగా వుంటుంది నీకు... ఏమిటి, వస్తావా?"

శ్యామల కాసేపు మౌనం వహించింది.

"నీ పిల్లలిద్దరి భవిష్యత్తు ఉజ్వలంగా వుండాలని నీకు కోరిక లేదా? వీటన్నిటికీ కావలసిన డబ్బు చాలా సునాయాసంగా నీకు లభించే మార్గం ఇది తప్ప మరొకటి లేదు."

అరుంధతివైపు స్థిరంగా చూసి, "నేను సిద్ధమే! ఎప్పుడు రావాలి?" అన్నది శ్యామల.

అరుంధతి నవ్వి. "ఈ రోజునుంచే!" అన్నది.

## 7

"అంతర్ధానమైన యువకుల యిళ్ళకు సమానంగా డబ్బు అందచెయ్యబడింది. అంటే ముప్పయిమంది యువకుల్ని ఒకే ముఠా మాయంచేసిందని అర్థమైపోయింది. అయితే మాయమైన స్త్రీల విషయంలో అలా జరగలేదు. అసలు వాళ్ళ ఇళ్ళలో డబ్బు అందచెయ్యటంగాని వాళ్ళ భర్తలకు వాళ్ళగురించిన క్షేమసమాచారం అందచెయ్యబడటంగాని జరగలేదు. దీన్నిబట్టి రెండు ముఠాలు ఇందులో పనిచేస్తున్నాయని గ్రహించవచ్చు" అన్నాడు డిటెక్టివ్ కిరణ్.

శ్రీనివాస్ అతనివంక సాభిప్రాయంగా చూశాడు.

అంతక్రితమే వాళ్ళిద్దరు అంతర్ధానమైన యువకుల, మహిళల ఇళ్ళకు వెళ్ళి ఎంక్వయిరీ పూర్తిచేసుకుని వచ్చారు.

"ఈ వారంరోజుల కాలంలోను దేశంలోని ఎయిర్ పోర్ట్సునుంచి, నౌకాశ్రయంనుంచి ఎవరెవరు ఏయే తేదీల్లో

ప్రయాణించినదీ, విదేశాలకు ఎంతమంది ప్రయాణించినదీ వివరాలు సేకరించు. మాయమైన యువకులు మహిళల పేర్లు మారిపోయి వుండొచ్చు. వాళ్ళ వయసులు, తక్కిన ఫిజికల్ ఐడెంటిఫికేషన్స్ బట్టి మనం ఇన్వెస్టిగేట్ చేయాల్సి వుంటుంది" చెప్పాడు కిరణ్.

"అంటే వాళ్ళను విదేశాలకు తరలించి వుండొచ్చునని నీ అనుమానమా?"

"కావచ్చు. ఎన్ని విధాల అవకాశాలున్నాయో అవన్నీ మనం వెరిఫై చేసుకోవాలి. అంతర్థానమైనవాళ్ళు నగరంలోనే వుంటే ఏదొక సమయంలో తమవాళ్ళని చూడటానికో తను క్షేమవార్త తెలియచెయ్యటానికో తమ ఇళ్ళకు వచ్చి వుండేవాళ్ళు...."

ముప్పయ్యేళ్ళ యువకుడు లోనికొచ్చి డిటెక్టివ్ లకి నమస్కరించాడు.

"నా పేరు బాబూరావు సార్! నా భార్య శ్యామల కనిపించటంలేదు" అన్నా డతను.

డిటెక్టివ్ కిరణ్ ఎలర్టుగా అయాడు. శ్రీనివాస్ అతన్ని కూచోమని చెప్పి, "వివరంగా చెప్పండి!" అన్నాడు.

బాబూరావు గొంతు సవరించుకుని, "నేను అటెండర్ గా పనిచేస్తూన్నాను సార్, మెడికల్ డిపార్టు మెంట్లో. నా భార్య శ్యామల. మా కిద్దరు పిల్లలు. ఈ రోజు సాయంత్రం నేనొచ్చేసరికి పిల్లలిద్దరు ఇంట్లో బిక్కు బిక్కుమంటూ వున్నారు. శ్యామల పక్కింటి వాళ్ళకు తాళం యిచ్చి వెళ్ళిందట. సాయంత్రానికల్లా తిరిగొచ్చేస్తానని చెప్పిందట. ఉదయం నేను ఆఫీసుకి వెళ్ళిన గంటకే వెళ్ళిందట. ఇప్పటిదాకా తిరిగిరాలేదు.

నాకేదో అనుమానంగా వుంది" అన్నాడు.

"ఏదైనా సినిమాకి వెళ్ళిందేమో!?"

"అలాంటిదేమైనా ఉంటే ముందుగా నాతో చెప్తుంది సార్! సాధారణంగా మార్నింగ్ షోలకే వెళ్తుంది. పిల్లలు వచ్చేస్తారని మేట్నీషోకి వెళ్ళదు. ఎప్పుడైనా ఫస్టుషోకయితే అందరం కలిసే వెళ్తాం. మేట్నీకి వెళ్ళినా ఈపాటికి వచ్చేయాలి కదా!? రాత్రి ఎనిమిది కావస్తోంది కదా సార్!" అన్నాడు బాబూరావు.

శ్రీనివాస్ నోట్ చేసుకుంటున్నాడు.

"ఎప్పుడైనా ఇలా చెప్పకుండా వెళ్ళటం జరిగిందా?"

"లేదు సార్, ఇదే మొదటిసారి!"

"మీమధ్య యేమైనా పోట్లాటవంటిది జరిగిందా నిన్న రాత్రిగాని, అంతక్రితంగాని?"

"అలాంటిదేంలేదు సార్! ఎప్పుడైనా అది లేదు, ఇదిలేదని సాధిస్తూంటూంది. నాకొచ్చే జీతంతో అవన్నీ కొనలేనని మందలిస్తూంటాను. ఆమె కూడా అలాగే సర్దుకపోతుంది. అంతకిమించి మరే విషయంలోను మా మధ్య మనస్పర్థలు రావు...." చెప్పాడు బాబూరావు.

"ఆమె ఫోటో, వయసు వగయిరా వివరాలు కావాలి" అన్నాడు శ్రీనివాస్.

బాబూరావు ఫోటో ఇచ్చి వివరాలు చెప్పి వెళ్ళటానికి లేచాడు.

"ఆమెకి తెలిస్తే వెంటనే మీకు తెలియపరుస్తాం. ఈ లోపల మీ కేమైనా ఇన్ఫర్మేషన్ తెలిస్తే మాకు

తెలియజెయ్యండి" అన్నాడు శ్రీనివాస్.

బాబూరావు సెలవుతీసుకొని వెళ్ళిపోయాక, "పదమూడో మహిళ అంతర్థానమయ్యింది. పైగా ఇద్దరు బిడ్డల తల్లి!" అన్నాడు శ్రీనివాస్.

కిరణ్ సాలోచనగా తలూపి, "ఇప్పటివరకూ అందరు వివాహితులైన మహిళలే రికార్డయ్యారు. పిల్లల తల్లులు పదిమంది ఉన్నారు. తక్కిన ముగ్గురికి సంతానం లేదింకా. అయితే అందరూ యిరవై—యిరవై అయిదేళ్ళ మధ్య వయస్కులు కావటం గమనించాల్సిన అంశం....!" అన్నాడు.

శ్రీనివాస్ అరచేతుల మధ్య తల పట్టుకొని కూచున్నాడు.

సరిగ్గా అప్పుడే ఫోన్ మోగింది. అందుకొని వెంటనే అటెన్షన్‌లోకి వచ్చేశాడు. "ఆఁ....అలాగే సర్...." అంటూ అన్నిటికీ వినయంగా ఊకొడుతూ చివర్న ఫోన్‌లోనే నమస్కారం పెట్టేసి రిసీవర్ క్రెడిల్ చేసి కిరణ్ వైపు తిరిగి, "కమిషనర్ నించి. ఈ కేసు విషయంలో ఎలాంటి ప్రోగ్రెస్ లేకపోవటం క్షమార్హం కాదని తల వాచేలా చీవాట్లేసి, ఎక్స్‌ప్లనేషన్ కాల్ ఫర్ చెయ్యాల్సి వుంటుందని హెచ్చరించారు."

కిరణ్ మందహాసం చేశాడు.

సరిగ్గా అప్పుడే ఫోన్ మోగింది. శ్రీనివాస్ భయంగా చూశాడు దానివైపు. ఫర్వాలేదు, తీసుకోమన్నట్టు చూశాడు కిరణ్.

శ్రీనివాస్ ఫోనెత్తి "హల్లో క్రైమ్‌బ్రాంచ్!" అన్నాడు మెల్లిగా.

"నేను 'పరాంకుశం ఆటోమోటివ్స్ లిమిటెడ్' నుంచి

పరాంకుశం మాట్లాడుతున్నాను. మీరు వెంటనే ఇక్కడికి రావాలి. మూడులక్షల నలభై వేలు దొంగలు దోచేశారు. నన్ను నడిరోడ్డుమీద కొట్టిపడేశారు. ఇక్కడికొచ్చాక వివరాలు చెపుతాను. ప్లీజ్. వెంటనే రండి!"
అవతల్నుంచి యెంతో కంగారుగా వినిపించింది.

కిరణ్ కి కూడా వినిపించింది స్పష్టంగా.

"ఇప్పుడే వస్తున్నాము!" అంటూ ఫోన్ పెట్టేసి కిరణ్ వైపు చూశాడు శ్రీనివాస్.

కిరణ్ రెండుక్షణాలేదో ఆలోచించి, "పద నేనూ వస్తాను" అన్నాడు.

సిబ్బందితో శ్రీనివాస్ జీప్ లోను, వెనగ్గా తన టయోటాలో కిరణ్ — ఇండస్ట్రియల్ యేరియా వైపు సాగిపోయారు.

## 8

"సరుకు నిఖార్సేనా?" అడిగాడు సేట్, గుంభనంగా నవ్వుతూ.

అతని చూపులు తోడేలు చూపుల్లా వున్నాయి. కళ్ళు చిరుతకళ్ళలా తళ తళా మెరుస్తూన్నాయి. కోడిపిల్ల నెత్తుకుపోవటానికి కాచుకొన్న డేగలా వున్నాడు.

అరుంధతి నవ్వింది.

"చూసుకోండి సేట్ జీ, యెప్పుడైనా తఖరారు వచ్చిందా?" అంది.

సేట్ జీ శ్యామలవంక చూశాడు. శ్యామల చైనా సిల్క్ చీరలో నిలువెల్లా మెరిసిపోతోంది. సేట్ జీ చూపులు ఆమెను నఖశిఖపర్యంతం గుచ్చి గుచ్చి చూస్తున్నాయి.

శ్యామల కిది చాలా ఇబ్బందిగా ఉంది. ఒంటికి కారం

రాసుకున్నట్టుంది. అయినా భరించాలి, తప్పదు!

"సేట్ జీ, సరిగా చూసుకున్నారా?" అన్నది అరుంధతి.

అప్పుడు పడింది సేట్ దృష్టి శ్యామల చేతిలోని నగ మీద.

దాన్ని చేతిలోకి తీసుకొని అటు ఇటు చూసి గీటు చూడకుండానే, "ఏభై వేలు చేస్తుంది. అంతకన్నా ఇచ్చేదిలేదు" అన్నాడు.

శ్యామల అతని కళ్ళలోకి చూసి మనోహరంగా నవ్వింది.

సేట్ పెదాలు తడుపుకున్నాడు.

"మరో పదివేలిస్తాను, అంతే!" అన్నాడు.

"డెభై అయిదు చేసుకోండి సేట్ జీ!" అన్నది శ్యామల.

"నువ్వడిగావు కాబట్టి ఒప్పుకుంటున్నాను" అంటూ నగ కేష్ బాక్స్‌లో పడేసి, వందరూపాయల నోట్లు లెక్కించి శ్యామల కిచ్చాడు. ఇస్తూ కావాలనే ఆమె చేతిని మృదువుగా తాకాడు.

శ్యామల అందంగా సిగ్గుపడింది.

"ఏమైనా వీలవుతుందా?" అన్నాడు సేట్ అరుంధతితో గుసగుసగా.

అరుంధతి సేట్ చేతిమీద సన్నగా గిల్లి, "సాయంత్రం ఆరుగంటలకి కబురు పెడతాను. హోటల్ ఇంపీరియల్ రూం నెంబర్ ఫార్టీఫైవ్‌కి వచ్చేయండి!" అన్నది.

సేట్ ఆనందంగా తలూపి, శ్యామలవంక ఆరగా చూశాడు.

అప్పుడు సాయంత్రం నాలుగ్గంటలయింది.

బయటికొచ్చి కారెక్కారు శ్యామల, అరుంధతి.

కార్లో నే డబ్బు అరుంధతి చేతి కిచ్చేసింది శ్యామల.

"నన్ను మా యింటివద్ద దిగబెట్టండి. ఈ పాటికి పిల్లలు స్కూల్ నుంచి వచ్చేసి వుంటారు" అన్నది శ్యామల.

అరుంధతి చిన్నగా నవ్వి "అప్పుడేనా? యిప్పటికి మనం అనుకొన్న పని సగం మాత్రమే అయింది. సాయంత్రం ఆరుగంటలతో పని పూర్తవుతుంది. ఆ తర్వాత వెళ్ళిపోవచ్చును" అంది.

"అప్పటికి మా వారు ఆఫీసునించి తిరిగొచ్చేస్తారు. మా వారు రాకముందే వెళ్ళిపోతే యెలాంటి సమస్య రాదు."

"ఇప్పుడు కూడా యెలాంటి సమస్య రాదు. మేట్నీ సినిమా చూసి యింటికి తిరిగొచ్చానని చెప్పుకోవటానికి వీలుగా వుంటుంది. దూరంగా వున్న సినిమా పేరు చెప్పు. నడిచివచ్చేటప్పటికీ ఆ టైము అవుతుంది కదా! ఎలాంటి అనుమానం రాదు మీ ఆయనకి."

శ్యామల అయిష్టంగానే ఒప్పుకున్నది.

తనేమి తప్పు చెయ్యకపోయినా ఆమె మనసు యేదో తప్పుచేసిన భావనతో నలిగిపోతోంది. భర్తకి తెలియకుండా అలా స్వతంత్రించి వ్యవహరించటం తప్పని అంతరాత్మ పదేపదే హెచ్చరిస్తోంది.

"ఇదిగో, ఈ పదివేలు నీవి!" అరుంధతి వందరూపాయల నోట్లు శ్యామల గుప్పెట్లో పెట్టింది.

అన్ని నోట్లు ఒక్కసారి యెప్పుడూ చూడకపోవటంతో ఆనందంతో ఆమె కళ్ళు పెద్దవయ్యాయి. అంత

వరకు ఆమెను భయపెట్టిన సంశయాలన్నీ మాదిపించెల్లా యెగిరిపోయాయి. ఏదోకి సమాధానం చెప్పుకోవచ్చునని ధీమా ఆమెలో చోటు చేసుకున్నది.

హోటల్ ఇంపీరియల్ ముందు కారాగింది.

రూం నెంబర్ ఫార్టీ ఎయిట్ కి లిఫ్ట్‌లో వెళ్ళారు అరుంధతి, శ్యామల,

ఒక్కసారిగా తన అంతస్తు పెరిగిపోయినట్టనిపించింది శ్యామలకి నాలుగో అంతస్తు చేరుకోగానే.

"బాగా విశ్రాంతి తీసుకో! కాఫీ తెప్పిస్తాను. టిఫిన్ యేది కావాలో ఆర్డరివ్వు బోయ్ తెస్తాడు" అన్నది అరుంధతి.

శ్యామలకి బాగా ఆకలిగా ఉంది. ఉదయం భర్త ఆఫీసుకి వెళ్ళాక యేదో యింత తిన్నది. ఆ వెనువెంటనే అరుంధతి వచ్చి ఇలా తీసుకొచ్చేసింది.

టిఫిన్ తిని కాఫీ తాగింది శ్యామల.

కళ్ళ మీదకి నిద్ర కూరుకుపోస్తున్నట్టనిపించింది.

అరుంధతి అంతకితమే పనిమీద యెక్కడికో వెళ్ళింది. సరిగ్గా ఆరుగంటలకి తిరిగొస్తానని చెప్పింది. లోపల బోల్టు పెట్టుకోమన్నది. ఆమె చెప్పినట్టే చేసింది శ్యామల.

మగతగా నిద్రపడుతున్న సమయంలో మెల్లగా తలుపు తట్టిన సవ్వడి వినిపించి లేచి కూచున్నది శ్యామల.

తలుపు తెరిచింది!

ఎదురుగా చిరునవ్వుతో అరుంధతి!

"చెప్పిందంతా గుర్తుంది కదూ! ఏమాత్రం తేడా రాకూడదు" అన్నది అరుంధతి.

శ్యామల మౌనంగా తలూపింది. ఆమెకు లోలోపల

చాలా భయంగా వుంది. తనేదో విషవలయంలో చిక్కుకుపోతున్నట్టు అనిపించసాగింది.

పదే పదే భర్త పిల్లలు గుర్తొస్తున్నారు. వాళ్ళకేదో అన్యాయం చేస్తూన్నట్టు అనిపిస్తోంది. ఓపక్క పదివేల రూపాయలు ఆమెను పెద్ద ప్రలోభంలో పడేస్తూంటే, మరోపక్క రకరకాల అనుమానాలు మనసును నొక్కి పడ్తున్నాయి.

అరుంధతి ధైర్యం చెప్పి వెళ్ళిపోయింది.

సరిగ్గా మరో పదినిమిషాలకి మళ్ళీ తలుపుమీద చిన్నగా శబ్దమయ్యింది.

శ్యామల తలుపు తెరిచింది.

ఎదురుగా సేఠ్ జీ! ఖరీదైన విస్కీవాసన, ఖరీదైన సెంటువాసనతో మిళితమై ఒక్కసారిగా గుప్పున ఆమె నాసికాపుటాలను సోకింది.

నోరంతా రక్తంలా పాన్ నలుగుతోంది అతని పళ్ళ మధ్య.

తలుపులు దగ్గరగా మూసి బోల్టు పెట్టాను.

శ్యామలకి గుండె దడ హెచ్చింది. ఎందుకు ఒప్పుకున్నానా అని పదేపదే తనని తాను నిందించుకుంటోంది.

సేఠ్ జీ బాగా దగ్గరగా వచ్చి ఆమె నందుకోబోయాడు, తుమ్ బహుత్ సుందర్ దిఖ్ తీహో!" అంటూ.

అతని పట్టుకు చిక్కకుండా దూరంగా జరిగింది శ్యామల.

సేఠ్ జీ నవ్వుతూ దగ్గరకొస్తూన్నాడు. అతని రెండు చేతులకు అయిదేసి చొప్పున వజ్రపుటుంగరాలు ఫ్లోరసెంట్ వెలుగులో ధగధగ మెరిసిపోతున్నాయి.

మెళ్ళో చాలా బరువైన చైయిన్ లాల్చీ మీదుగా

వేలాడుతోంది. చెవులకి డైమండ్స్ పొదిగిన పోగులున్నాయి — కవచకుండలాలకి మల్లే. అవికూడా చాలా బరువుగా ఊగుతున్నాయి చెవులను కిందికిలాగుతూ.

సేఠ్ జీ శ్యామలను దొరకబుచ్చుకున్నాడు. మనసులో భగవంతుడ్ని స్మరించుకుంటోంది శ్యామల.

ఆమెను బలంగా పట్టుకొని పడక దగ్గరకు నడిపించుకు పోయాడు సేఠ్ జీ.

సరిగ్గా అప్పుడే తలుపుమీద టకటకమని శబ్దమయ్యింది.

సేఠ్ జీ, శ్యామల ఉలిక్కిపడ్డారు.

సేఠ్ జీ వారించబోయేంతలో శ్యామల తలుపులు తెరిచింది.

బయట పోలీస్ ఇన్ స్పెక్టర్, నలుగురు కాన్ స్టేబిల్సు నించుని వున్నారు.

వాళ్ళని చూడగానే సేఠ్ పైప్రాణాలు పైనే పోయాయి.

బిలబిలమంటూ లోపలికొచ్చి వాళ్ళిద్దర్ని చుట్టుముట్టేశారు పోలీసులు.

# 9

పరాంకుశం చెప్పిందంతా శ్రద్ధగా విన్నాడు డిటెక్టివ్ కిరణ్.

పరాంకుశం తలమీద బాండేజీ వున్నది. బాండేజీ పైకి ఎర్రగా రక్తం చిందివున్నది.

పరాంకుశం చాలా దిగులుగా వున్నాడు. డబ్బు పోగొట్టుకున్నందుకు బాగా డీలాపడిపోయాడు. నిజానికి ఆ మొత్తం అతనికి ఓ లెక్కలోది కాదు. అయినా ఒక్కసారిగా మూడులక్షల నలభై వేలు పోగొట్టుకోవటం

అతన్ని బాగా కంగదీసింది.

"మిమ్మల్ని యే స్పాట్‌లో బెదిరించారో అప్పుడు మీరే స్థితిలో వున్నారో అదంతా వివరంగా మాకు చూపించండి" అన్నాడు కిరణ్

పరాంకుశం తన కారులో దొంగలు తనని అటకాయించి గాయపరిచిన ప్రాంతం దగ్గరకు తీసుకువెళ్లాడు.

సరిగ్గా ఆ కారు ఆగిన ప్రదేశానికి పదిమీటర్ల దూరంలో యేదో వస్తువు హెడ్‌లైట్ల వెలుగుల్లో మెరుస్తూ కనిపించింది కిరణ్‌కి.

రెండంగల్లో అక్కడికి చేరుకుని ఆ వస్తువును అందుకున్నాడు.

అది వెండి డాలరు!

దానిమీద స్వేచ్ఛగా గాల్లో ఎగురుతున్న తెల్లటి పావురం బొమ్మ వున్నది.

డాలర్‌ని వెనక్కి తిప్పాడు కిరణ్.

'సర్వ మానవ సౌభ్రాతృత్వం మన ధ్యేయం' అన్న అక్షరాలు మిలమిల మెరుస్తూన్నాయి.

కిరణ్ కొద్దిసేపటివరకు ఆ బొమ్మను, అక్షరాలను చూస్తూ నిల్చుండిపోయాడు.

అతని దృష్టిని నేలమీద స్పష్టంగా కనిపిస్తూన్న టైరు గుర్తులు ఆకర్షించాయి.

ఒంగి చూశాడు. చాలా చిన్న కారు కొంతసేపు అక్కడ ఆగివున్నట్టు గుర్తించాడు.

అంత చిన్న కారు ఏమయి వుంటుంది?

వెంటనే స్ఫురించింది — మారుతి కారు! అంటే, దుండగులు బహుశా ఆ కారులో డబ్బు తీసుకొని పారి

పోయి వుండాలి.

అయితే, ఆ డాలరు అర్థమేమిటి? దొంగలు శాంతి కాముకులు, సర్వ మానవ కళ్యాణంకోసం పాటుపడే విశాల హృదయాలూ అనుకోవాలా?

ఏదో అర్థం నిగూఢమయి వుంది ఆ బొమ్మలో. ఏమిటది?

దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు కిరణ్.

అతని దృష్టి నేలమీద పొడవుగా జాడపడిన నల్లటి మరకలమీద పడింది.

అవి ఆయిల్ మరకలు—డీజిల్ ఆయిల్ మరకలు! ఏ కారణంచేతనో ఆయిల్ టాంక్ చిల్లుపడి, ఆయిల్ దారిపొడవునా కార్తూపోయింది.

ఆ మరకలు సిటీకిపోయే దారినే సూచిస్తూన్నాయి.

కిరణ్ పెదాలమీద చిరునవ్వు లీలగా మెరిసింది. చాలా ముఖ్యమైన క్లూ దొరికింది!

కిరణ్ శ్రీనివాస్ వంక తిరిగి, "మనకి దొంగల జాడ చాలా తేలిగ్గా దొరికిపోయింది. వెంటనే బయల్దేరటమే తరువాయి" అన్నాడు.

శ్రీనివాస్ తన సిబ్బందితో జీప్ ఎక్కాడు. కిరణ్ పరాంకుశంవైపు చూసి, "త్వరలోనే మీ సొమ్మును తిరిగి స్వాధీనం చేసుకొని మీకు అప్పగిస్తాం. మీరిక ఇంటికి వెళ్ళండి" అన్నాడు.

పరాంకుశం ముఖంలో ఆశారేఖ మెరిసింది.

"మీ ఋణం వుంచుకోను" అన్నాడు.

ముందు కిరణ్ టయోటా, వెనకగా శ్రీనివాస్ జీప్ ఆయిల్ మరకల జాడలో బయల్దేరాయి.

# 10

"వచ్చావా శ్యామూ, నీకోసం ఎదురుచూసి చూసి, ఇంతక్రితమే పోలీస్ రిపోర్టుకూడా ఇచ్చాను" అన్నాడు బాబూరావు.

భార్యను చూడగానే అతనంతవరకు అనుభవించిన టెన్షన్, ఆరాటం, మనోక్షోభ అన్నీ మరచిపోయాడు.

శ్యామల అంతదాకా నిద్రపోకుండా తనకోసం ఎదురుచూస్తూన్న పిల్లలిద్దర్ని అక్కున చేర్చుకున్నది. పిల్లలిద్దరు మళ్ళీ అమ్మ కనిపించదేమోనన్నంత తమకంతో తల్లి నల్లుకుపోయారు.

"అన్నం తిన్నారా బాబూ!" అంటూ పిల్లల బుగ్గలు పుణికి ముద్దాడింది.

"సినిమాకి వెళ్ళావా శ్యామూ!" భార్య ముఖంలోకి ప్రేమగా చూస్తూ అడిగాడు బాబూరావు.

"లేదండీ!... ఏమండీ. మీకు తెలియకుండా నేనో పని చేశాను. నన్ను క్షమిస్తారు కదూ....!?"

"నువ్వు తప్పుపనేదీ చెయ్యవని నాకు తెలుసు శ్యామూ!.... చెప్పమని నిన్ను బలవంతపెట్టను. చెప్పాలనుకుంటే చెప్పు, లేకుంటే ఆ సంగతి మర్చిపో!"

"అదేంకాదు, మీకు చెప్పితీరాలి!"

"అలాగే చెపుదువుగాని, ముందు స్నానంచేసి భోం చెయ్యి. ఏ టైంలో వస్తావోనని వంటచేసి సిద్ధంగా వుంచాను. పిల్లల్ని తినమంటే నువ్వొస్తేనేగాని తినమని భీష్మించుక్కూచున్నారు. వాళ్ళకి నచ్చచెప్పలేక సతమతమవుతుంటే నువ్వొచ్చావు."

"అలాగా, చాలా టైమయ్యింది. ముందు పిల్లలకి అన్నాలు పెట్టాకనే నా స్నానపానాలు!" అంటూ

పిల్లలని లోపలి గదిలోకి తీసుకువెళ్ళింది శ్యామల.

వాళ్ళకి అన్నాలు పెట్టి ముందు గదిలోకి వచ్చి నోట్లు తీసి భర్తకందించి, "ఇవి జాగ్రత్తగా పెట్టండి" అన్నది.

బాబూరావు ఆశ్చర్యాన్నణుచుకుంటూ ఆ డబ్బువైపు భార్యవైపు మార్చి మార్చి చూశాడు. అతని కళ్ళల్లో కోటి సందేహాలు, శతకోటి సంశయాలు గుర్తించింది శ్యామల.

"మీకంతా వివరంగా చెపుతాను. నన్ను మనస్ఫూర్తిగా క్షమిస్తానని మాటివ్వండి" చేయి సాచింది శ్యామల.

ఆ చేతినందుకోకుండానే, "చెప్పు!" అన్నాడు బాబూరావు.

శ్యామల అతని ముఖంలో వచ్చిన మార్పులని శ్రద్ధగా గమనించింది. చిన్నగా నిట్టూర్చింది.

చెప్పటం మొదలుపెట్టింది.

# 11

"వెల్ డన్ బాయ్స్! నాకు అన్నివిధాల మీ సహకారాన్ని అందించారు, చాలా సంతోషం. ఇదిగో మీ షేర్ ...." నోట్లకట్టలు అందించాడు స్వామి.

గోపాల్, జలీవ్ అతనిచ్చే నోట్లు అందుకోలేదు.

"కమాన్ ఫ్రెండ్స్. తీసుకోండి. మీ మాట మీరు నిలబెట్టుకున్నారు. మీ కిస్తానన్న పారితోషికాలు చెల్లించవలసిన బాధ్యత నామీద వుండిపోయింది..." అన్నాడు స్వామి.

"వద్దు సార్! ఇదికూడా మీ దగ్గరే వుంచండి. లోకంలో ఒకపూటకూడా తిండిలేనివాళ్ళు యెందరో వున్నారు. వాళ్ళ సంక్షేమానికి ఉపయోగించండి. మీ

సాహచర్యంవల్ల మాకూ కొంత పరోపకార బుద్ధి అలవడింది. మేమెలాగైనా బతగ్గలం. బతకలేక, చావలేక నికృష్టంగా రోజులు వెళ్ళదీస్తూన్న దరిద్రనారాయణుల కోసం మీరు పడ్తున్న శ్రమ, కృషి మావ జీవితంలో గొప్ప అనుభవాన్ని నేర్పాయి. ఆ అనుభవసారంతో మా జీవితాలు చక్కదిద్దుకుంటాం" అన్నాడు దిలీప్.

"మిమ్మల్ని చూస్తూంటే నాకు చాలా ఆనందంగా వుంది.... ఈ రోజు మీరు ఓ స్వార్థపరుడు, శ్రమజీవుల రక్తాన్ని మధుపానంలా పీల్చుకుని కోటికి పడగలెత్తిన మనసులేని యజమాని అయిన పరాంకుశాన్ని మోసంచేసి డబ్బు దోచుకున్నారు. అయితే ఇది నిజానికి మోసం కాదు, పాపం అసలే కాదు. యే పనివాళ్ళు రక్తాన్ని చెమటగా మార్చి తన వైభవానికి కారకులయ్యారో వాళ్ళని అలక్ష్యంచేసి, అతి తక్కువ జీతాలిచ్చి వాళ్ళ కడుపులు మాడ్చి వాళ్ళ భార్యాబిడ్డల ఉసురుపోసుకుంటున్న ఓ రాక్షసుడికి తగిన బుద్ధి చెప్పారు. ఓ గుణపాఠం నేర్పారు.

దిలీప్, గోపాల్ చెమ్మగిల్లిన కళ్ళు తుడుచుకొని, "పరాంకుశంలాంటి రాక్షసులు ఈ దేశంలో చాలా మందున్నారు. వాళ్ళందరికి గుణపాఠం నేర్పాలి. వాళ్ళ అన్యాయార్జితాన్ని న్యాయంగా యెవరికి చెందాలో వాళ్ళకి సమానంగా పంచాలి. అందుకు మా వంతు కృషి, సాయం మమ్మల్ని చెయ్యనివ్వండి సార్!" అన్నాడు ఆవేశంగా.

"అరుంధతీ....!" అంటూ పిలిచాడు స్వామి.

అరుంధతి లోనికొచ్చింది. "ఆ అమ్మాయి లందర్నీ పంపించేశావు కదూ....!?" అన్నాడు స్వామి.

"వాళ్ళు వెళ్ళవని మొండికేసి కూచున్నారు. అతి కష్టంమీద నచ్చచెప్పి ఇప్పుడే పంపించాను" అన్నది అరుంధతి.

"ఇప్పటికే చాలా ఆలస్యమయింది అరుంధతీ! సంసారం చేసుకుంటున్న ఆడవాళ్ళు కదా! భర్తలు అనుమానించి వాళ్ళను విడిచిపెట్టేస్తే ఆ పాపం మనల్ని చుట్టుకుంటుంది" ఆవేదనగా చెప్పాడు స్వామి.

"ఏరోజు కారోజు ఆ పిల్లల్ని వెళ్ళిపొమ్మని చెప్తూండేదాన్ని, కాని వాళ్ళు మన సంస్థను వదిలి వెళ్ళవని, ఇక్కడి ఆశయాలు వాళ్ళ మనసును తాకుతున్నాయని, లేనివాళ్ళకు సాయపడటంలో తమ వంతు పాత్ర తాము కూడా వహిస్తామని ఉండిపోయారు. చివరికీ రోజు అందర్నీ జాగ్రత్తగా వాళ్ళ ఇళ్ళకు చేర్చాం" అన్నది అరుంధతి.

"గుడ్! మగపిల్లలు ఎన్నిరోజులున్నా ఫరవాలేదు. ఆడవాళ్ళ విషయంలో యేరోజు కారోజు ఇళ్ళకు పంపి తీరాలి, గుర్తుంచుకో!" అన్నాడు స్వామి.

సరిగ్గా అప్పుడే డిటెక్టివ్ కిరణ్, శ్రీనివాస్ ఆ గదిలోకి అడుగుపెట్టారు.

"హేండ్సప్! ఎవరూ కదలొద్దు" అన్నాడు కిరణ్ రివాల్వర్ సూటిగా స్వామికి గురిచేస్తూ.

అంతక్రితమే ఆ భవనం చేరుకున్నారు డిటెక్టివ్ సిబ్బంది. జయిల్ మరకలు ఆ భవనంముందు వరకువచ్చి ఆగిపోయాయి.

గారాజ్‌లో బ్రౌన్ కలర్ మారుతి కారు కనిపించింది.

ఆ భవనంముందు 'అనాధ శరణాలయం' అన్నబోర్డు వేలాడుతోంది. అంత పెద్ద భవంతిలో అనాధశరణాలయం యెవరూ నిర్వహించరు. కిరణ్ అనుమానం బల

పడింది.

శ్రీనివాస్‌తో మెల్లిగా లోపలికి ప్రవేశించాడు. కాపలా వున్న ఇద్దరు యువకులు పరుగెత్తి లోపలకు ఇన్‌ఫర్మేషన్ అందివ్వబోయేంతలో వాళ్ళని పోలీసులు అదుపులోకి తీసుకున్నారు.

ఎదురుగా హాలులాంటి పొడవైన నడవా కనిపించింది వాళ్ళకు. గోడ పైభాగంలో వెండి మలాము చేసిన పావురం స్వేచ్ఛగా యెగురుతున్నట్టు చిత్రింపబడింది. దానికింద మిలమిల మెరుస్తూన్న వెండి అక్షరాలు— 'సర్వ మానవ సౌభ్రాతృత్వం మన ధ్యేయం' అని.

దాంతో కిరణ్, శ్రీనివాస్ బృందానికి సందేహం విడిపోయింది.

సరిగ్గా అప్పుడే లోపల హాల్లోనించి మాటలు విని పిస్తూండటంతో ఆగిపోయి విన్నారు కిరణ్, శ్రీనివాస్‌లు.

గోపాల్ దిలీప్‌లతో స్వామి జరుపుతున్న చర్చ, అరుంధతితో స్వామి ఆడవాళ్ళ గురించి ఆడుగుతున్న సంగతులు వాళ్ళ చెవిన పడ్డాయి.

వెంటనే రంగంలోకి దిగారు.

కిరణ్‌ని, పోలీసుల్ని చూడగానే ఒక్క క్షణం స్వామి, అరుంధతితోబాటు ఆ హాల్లో వున్న వారందరు నిర్ఘాంతపోయారు.

అయితే ఎవరూ తప్పించుకుపోయే ప్రయత్నం చెయ్య లేదు.

అందరు చేతులు పైకెత్తి నిల్చున్నారు.

"కమాన్ ఇన్‌స్పెక్టర్! మావల్ల కావలసిన సహాయ మేదైనా ఉందా?" అన్నాడు స్వామి చిరునవ్వు

నవ్వుతూ.

"నువ్వు చేస్తున్న అక్రమ వ్యాపారం గురించి మాకు తెలిసిపోయింది. నిరుద్యోగ యువకుల్ని, సంసారం చేసుకుంటున్న స్త్రీలని ట్రాప్ చేసి తీసుకొచ్చి వాళ్ళద్వారా లక్షలు సంపాదిస్తున్నావు. వాళ్ళకి దొంగతనాలు, మోసాలు నేర్పిస్తూన్నావు. ఇది క్షమించరాని నేరం" అన్నాడు కిరణ్ సూటిగా స్వామి కళ్ళలోకి చూస్తూ.

స్వామి యేమాత్రం తొణకలేదు.

"నిజం సార్! మీరు చెప్పిందాంట్లో అసత్యంగాని, అతిశయోక్తిగాని లేవు. ఈ యువకుల్ని వాళ్ళ యిష్టం మీదే తీసుకొచ్చాను. అలాగే మహిళలని కూడా. అందుకు వాళ్ళకి పారితోషికాలు చెల్లించాం కూడా" అన్నాడు.

"వాళ్ళ ద్వారా లక్షలు ఆర్జించి కొన్ని వేలు వాళ్ళ మొహాన కొడుతున్నావు. నువ్వు ఆ డబ్బుతో కులుకుతున్నావు..."

"స్టాప్ ఇట్ ఇన్స్పెక్టర్! ఆ డబ్బుతో ఏంచేస్తున్నానో ఇలా చూడండి...." అంటూ స్టీలు అల్మయిరానుంచి పెద్ద పెద్ద చిఠాలు, రెండు పుస్తకాలుతీసి టేబిల్ మీద పెట్టాడు స్వామి.

"ఇవి చూడండి, మీకే అర్థమవుతుంది" అన్నాడు గంభీరంగా స్వామి.

కిరణ్ ఆ పుస్తకాలని పరిశీలించాడు.

వివిధ అనాథశరణాలయాలకు, విద్యాసంస్థలకు, యే ఆధారంలేని స్త్రీల సంక్షేమానికి, స్త్రీ సదనాలకి ఇంకా యెన్నోరకాల ప్రజాహిత సంస్థలకి ఎప్పుడెప్పుడు యెంత మొత్తంలో విరాళాలు ఇచ్చినదీ వివరంగా

రాయబడి వున్నది అంకులో.

శ్రీనివాస్ కూడా పరిశీలనగా చూశాడు.

స్వామి గొంతు విప్పాడు.

"నేను మోసం చేసినదీ, దొంగతనాలు చేయించినదీ సామాన్యుల్ని కాదు. బడా బడా వ్యాపారుల్ని, బడుగు వాళ్ళని అణగదొక్కి వాళ్ళను మెట్లుగా చేసుకొని సమాజంలో అత్యున్నత స్థాయిని అధిరోహించిన మిలియనీర్స్‌ని — నేను వాళ్ళనుంచి సంపాదించిన మొత్తం వాళ్ళు ఎగ్గొట్టిన ఆదాయపు పన్నులో పదోవంతు కూడా వుండదు. వాళ్ళ ఇనప్పెట్టెల్లో మూలుగుతున్న సొమ్మును బయటికి తీసి, పీడితులకి, బాధితులకి పంచిపెడుతున్నాను."

"స్టాపిట్! నువ్వు చేస్తున్నది పెద్ద నేరమని నీకు తెలియదా? చేతనైతే నీ సొంత సొమ్ముని వాళ్ళందరికీ ఖర్చుపెట్టు. లేకుంటే కష్టించి సంపాదించి దాన్ని వాళ్ళకివ్వు — అంతేగాని అన్నెం పున్నెం యెరగని యువకులని మోసం, దగా నేర్పి వాళ్ళచేత హింసాత్మక కార్యకలాపాలు చేయిస్తావా? సంసారాలు చేసుకుంటున్న స్త్రీల జీవితాలతో ఆడుకుంటావా....?"

కిరణ్ గొంతు తీవ్రంగా పలికింది.

"మీరు పొరబడుతున్నారు. నేను స్త్రీల జీవితాలతో ఆడుకోవటంలేదు. లోకంలో వున్న కాముకులైన ధనవంతుల్ని వాళ్ళద్వారా ఆకర్షింపచేసి హోటల్స్‌కి రావించి, నా దగ్గరున్న యువకుల్ని పోలీసు వేషాల్లో పంపించి వాళ్ళని అరెస్టు చేయించినట్టు నటించి, వాళ్ళనుంచి వీలైనంత సొమ్ము రాబట్టి అనక వదిలేస్తున్నాను. పరువు భయంతో ఆ ఖరీదైన కాముకులు తమని నిలువు

దోపిడీ చేసినా నోరెత్తకుండా పోతున్నారు. మళ్ళీ ఈ జన్మలో భార్యతప్ప పరాయి ఆడదాని ఒంటిమీద చెయ్యి వెయ్యగల ధైర్యం చెయ్యరు వాళ్ళు.”

“కాని, అందుకోసం సంసారాలు చేసుకుంటున్న స్త్రీలే కావలసివచ్చారా నీకు?”

“క్షమించాలి! వాళ్ళయితే తెలివిగా వ్యవహరించగలుగుతారు. జీవితంతో బాగా రాజీపడిపోయిన మధ్యతరగతి ఆడవాళ్ళనే కావాలని ఎన్నుకున్నాను. అయితే గుండెలమీద చేయి వేసుకుని చెప్తున్నాను, వాళ్ళ నెవర్నీ మలినం చెయ్యటంగాని చెయ్యించటంగాని జరగలేదు. చివర్లో వాళ్ళ కష్టానికి తగిన ప్రతిఫలం ముట్టచెప్పి వాళ్ళ ఇళ్ళకు క్షేమంగా చేర్పించాం కూడా ... చాలామంది మాతోనే వుండిపోయి ప్రజాహిత కార్యక్రమాల్లో తాము కూడా పాల్గొంటామని, తిరిగి తమ ఇళ్ళకు వెళ్ళటానికి విముఖత చూపించారు. ఈ గొడవతో వాళ్ళందరికీ యెంతగానో నచ్చచెప్పి పంపేశాము” చెప్పాడు స్వామి.

“కాని ...నువ్వు చేసిన ప్రతి పనీ చట్టానికి వ్యతిరేకమైనదే! శిక్షార్హమైనదే! ఒక సామాజిక హితైషిగా నువ్వు చేసిన పనుల్ని హర్షించగలనుగాని, నువ్వు ఎన్నుకున్న మార్గాన్ని హర్షించలేను, గర్హిస్తున్నాను. చట్టం విధించబోయే శిక్ష ననుభవించటానికి సిద్ధంగా వుండండి. నువ్వు, నీ అనుంగు చెలికత్తె అరుంధతీను. నీతోబాటు ఈ యువకులకి కూడా శిక్ష తప్పదు....” చెప్పాడు రాజ్.

స్వామి, అరుంధతి రెండు చేతులు జోడించి నమస్కారం పెట్టి, “మా ఇద్దరికి ఉరిశిక్ష విధించినా మహదానందంగా ఉరికంబమెక్కుతాం. కాని ఈ నిరుద్యోగ

యువకుల్ని శిక్షకు గురిచేసి వాళ్ళ కుటుంబాలకి ఆధారం లేకుండా చెయ్యకద్దు" అంటూ వేడుకున్నారు.

"మీ ప్రేరణవల్ల వాళ్ళు ప్రవర్తించినందుకు శిక్ష తక్కువపడేలా చెయ్యగలము గాని, చట్టానికప్పగించకుండా వదిలేది లేదు, మిష్టర్ శ్రీనివాస్, నీ పని కానివ్వు" అన్నాడు డిటెక్టివ్ కిరణ్.

స్వామి, అరుంధతి చేతులు ముందుకు చాచారు.

అయితే వాళ్ళిద్దరి కళ్ళలోను దివ్యకాంతులు మెరుస్తూన్నాయి. తాము చేసిన పరోపకార చింతన వాళ్ళ పెదాలమీద సంతృప్తితో కూడిన చిరునవ్వు రూపంలో తళుక్కుమన్నది.

శాంతికి సాంకేతమైన పావురం స్వేచ్ఛగా గాల్లో ఎగుర్తోంది!

—: అయిపోయింది :—

సీరియల్

వి.యస్.రావ్



(గత సంచిక తరువాయి)

ఇద్దరు వ్యక్తులూ—విభీషణ్, భరత్—పక్క పక్కనే ముడుచుకొని పడుకున్నారు. కాళ్ళవేళ్ళూ, చేతుల వేళ్లూ వాచిపోయి, ఎర్రగా అవుపిస్తున్నాయి. గోళ్లు వుండాల్సినచోట ఎర్రటి పుళ్ళున్నాయి వాళ్ళ తలల దగ్గరా, పాదాల దగ్గరా రక్తం చుక్కల చుక్కలగా పడుంది. బోనులోకి వచ్చిన వ్యక్తి తమ శ్రేయోభిలాషి అని వాళ్ళు యెప్పుడో గుర్తించారు. ఇద్దరూ ఆవేశంతో లేచే ప్రయత్నం చేస్తూ ఆగారు.

మనోజ్ వాళ్ళని ఆశ్చర్యంతో చూశాడు. నాలుగు కాళ్ళమీద నించున్న జంతువుల్లా వున్నారిద్దరూ. గుండ్రటి ఇనుప రింగులు వాళ్ల మెడల చుట్టూ వున్నాయి. రింగులకి తగిలించబడిన లావుపాటి గొలుసులు కిందికి వేళ్ళాడు

తున్నాయి. గొలుసుల రెండో కొసలు నేలలోకి మాయమయ్యాయి.

మనోజ్ ఆశ్చర్యంతో కళ్ళు పెద్దగా చేశాడు. వాళ్ళు వీళ్ళని యెలా హింసించారో తనకి తెలీదుగానీ, ఇద్దర్నీ పశువులకి మల్లే, కుక్కలకి మల్లే గొలుసులతో కట్టేశారు. రెండడుగులకన్నా తక్కువ పొడవున్న ఆ గొలుసులు వాళ్ళకి కూచునే అవకాశం కూడా ఇవ్వవు!

మనోజ్ కిందికి వొంగి లావుపాటి వ్యక్తి మెడకివున్న రింగుని తడివిచూశాడు. సైకిల్ తాళంలాగా, ఆ రింగుకి తాళం యేర్పాటు చేయబడింది.

"తాళంచెవులు యెవరిదగ్గరున్నాయో తెలుసా?" మనోజ్ మెల్లిగా అన్నాడు.

లావుపాటి వ్యక్తి తల అడ్డంగా ఆడించాడు. "ఎవరు మాకోసం వస్తే వాళ్ళ దగ్గరుండేవి...." అతని కంఠం రాయిమీద రాస్తున్న తుప్పుపట్టిన డబ్బారేకులా ధ్వనించింది.

మనోజ్ బోనులోంచీ ఇవతలికి వచ్చి, స్పృహ లేకుండా పడున్న వ్యక్తి దగ్గరగా వొంగాడు. అతన్ని అటూ ఇటూ దొర్లిస్తూ అతని చొక్కా జేబుల్లో, పాంటు జేబుల్లో వెతకసాగేడు. అతని జేబులన్నీ ఖాళీగా వున్నాయి. తాళాలకోసం వెతుకుతున్న మనోజ్ ఉలిక్కిపడ్డాడు.

ఏవో అడుగులు మెత్తగా, వేగంగా ధ్వనిస్తున్నాయి. అతను తటాలున తలెత్తి చూశాడు. అతని గుండె ఒక్కసారి కొట్టుకోడం మానేసింది.

ఇందాకా తను నడిచివచ్చిన నడవగుండా జోరుగా నడిచివస్తోంది ఎత్తుగా బలంగా వున్న బుల్ డాగ్ ....!

కింద అచేతనంగా పడున్న వ్యక్తి పాంటుజేబులోంచీ కటాలున తన చేతిని ఇవతలికి లాగాడు మనోజ్. అప్పటికే బుల్ డాగ్ అతనికి నాలుగడుగుల దూరంలో వుంది.

మనోజ్ శిలావిగ్రహంలా కూచుండిపోయాడు. రెండు ఎర్రటి కళ్ళు నిప్పుకణాల్లా, కాలిన లోహం గోళీల్లా అతన్ని చూస్తున్నాయి. రక్తంలో ముంచినట్టున్న నాలుక కిందికి వేళ్ళాడుతోంది. బుల్ డాగ్ మొరగలేదు; తన యజమాని హెచ్చరించలేదు. శత్రువుని బెదిరించే ప్రయత్నం చేయలేదు.

ఎదురుగా వున్న శత్రువుని యెదుర్కోగలిగిన ధైర్యం వున్న బుల్ డాగ్ మొరగదని మనోజ్ కి తెలుసు. తను కదలనంతకాలం అది తనని యేమీ చేయదు. కదిలితే, కదిలే ప్రయత్నంచేస్తే బుల్ డాగ్ తనమీదికి ఒక్కసారిగా సింహంలా లంఘిస్తుంది. ఏం జరుగుతోందో తను ఊహించేలోగా దాని పళ్ళమధ్య తన పీక ఇరుక్కుపోతుంది. నిర్భయంగా, నిర్లక్ష్యంగా నించున్న బుల్ డాగ్ ని చూస్తోంటే, అది బాగా ట్రెయినవ్ చెయ్యబడిన జంతువులా ఖచ్చితంగా అర్థమవుతోందతనికి.

నుదురుమీంచీ చెమట అతని కళ్ళమీదికి కారసాగింది. చొక్కా వీపుకి అతుక్కుపోతోంది. అప్రయత్నంగా మనోజ్ చెయ్యి కదిలింది.

బుల్ డాగ్ కొంచెం ముందుకి కదిలింది. దాని కళ్ళు అగ్నిగోళాల్లా మెరుస్తున్నాయి. తలుపు తెరిచిన బోనులో వున్న వాళ్ళిద్దరూ కంగారుతో యేవో అర్థంకాని శబ్దాలు చేస్తున్నారు. మనోజ్ ఆందోళనతో బుల్ డాగ్ నే చూస్తూ, ఆలోచిస్తూ వుండిపోయాడు. ఎన్నిగంటలైనా

బుల్ డాగ్ తనని కనిపెట్టి కాపలాకాస్తుందని అతనికి తెలుసు.

తను ఊహించని విధంగా రంగంలోకి అడుగుపెట్టిన బుల్ డాగ్ వల్ల తన శ్రమంతా వృధాఅయ్యేలా వుంది.

బుల్ డాగ్ ని యెదుర్కోడానికి తను తయారుగానే వచ్చాడు. కానీ, ఈ విధంగాకాదు! నిమిషాలు గడిచి పోతున్నాయి. హాలు తలుపు తెరిచివుంచి నందువల్ల బుల్ డాగ్ లోపలికి జొరబడింది. ఆలస్యం అయితే ఎవరేనా రావొచ్చు.

మొహంమ్మీద కారుతున్న చెమటని తుడుచుకోవాలనిపిస్తోందతనికి. అసంకల్పితంగా అతని చెయ్యి కొంచెం పైకి లేచింది. బుల్ డాగ్ ఏదో సిగ్నల్ ని పాటిస్తున్నట్టు ముందుకి కదిలింది. మనోజ్ చెయ్యి అతని తొడమీద పడింది. బుల్ డాగ్ ఆగింది.

మనోజ్ రెప్పకొట్టకుండా బుల్ డాగ్ కళ్ళలోకి చూస్తున్నాడు.

బుల్ డాగ్ అతన్ని ఎర్రగా, నిర్లక్ష్యంగా చూస్తోంది. దాని నిర్లక్ష్యం, అది పాటిస్తున్న నిశ్శబ్దం మనోజ్ ని ఆందోళనతో నింపుతున్నాయి. ఆరిపోతున్న పెదవుల్ని తడుపుకోడానికి అతను నాలుకను కదిపాడు. నాలుకకీ, అంగుడికీ మధ్య ఏదో అతుక్కున్నట్టుంది. పిప్పరమిట్!

శబ్దంకాకుండా మనోజ్ పిప్పరమిట్ ని చప్పరించసాగేడు. ఆరిపోతున్న నోరు యిప్పుడు హాయిగా వుంది. మనోజ్ ఉలిక్కిపడ్డాడు.

బుల్ డాగ్ ముక్కుపుటాలు గమ్మత్తుగా కదిలాయి. అది మెల్లిగా అతనివైపు అడుగులు వేయసాగింది. మనోజ్ కి గుండె రాయిలా మారిపోతున్నట్టనిపించింది.

చేతిలో ఏ ఆయుధాన్నీ వుంచుకోనందుకు అతను తనని తిట్టుకున్నాడు.

కనురెప్పల మీదికి జారుతున్న చెమటని విదిలిస్తూ రెప్పల్ని ఒకసారి మూశాడు. ఉన్నట్టుండి అతని శరీరం గగుర్పొడిచింది. అతని చేతులమీదా, మెడమీదా వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి. ఏదో ఊపిరి వెచ్చగా అతని మొహానికి తగుల్తోంది. మనోజ్ కంగారులో కళ్ళు తెరిచాడు.

బుల్ డాగ్ మూతి అతని మొహానికి దగ్గరగా, చాలా దగ్గరగా వుంది. అదోవిధమైన వాసన అతని ముక్కుల్లోకి జొరబడుతోంది. గుండె డప్పులా మోగడం ప్రారంభించింది. నోరు కొద్దిగా తెరిచి, ఊపిరితిత్తుల నిండా గాలి పీల్చుకొని వొగర్చడం ప్రారంభించాడతను.

బుల్ డాగ్ మూతి అతని పెదాలకి తగిలింది. ఏదో పసికడుతున్నట్టు ముక్కుని కదుపుతోందది. మనోజ్ మెదడులో ఏదో మెరుపులా మెరిసింది. అతనిలోని కంగారు తగ్గింది. బుల్ డాగ్ ని తన నోట్లో నానుతున్న పిప్పర్ మిట్ వాసన ఆకర్షించింది! దానికి తియ్యటి పిప్పర్ మిట్ కావాలి! గుడ్ గాడ్!

మనోజ్ అప్రయత్నంగా పిప్పరమిట్ ని నాలుక కొన మీదికి జరుపుతున్నాడు. మెల్లగా క్రిందపడేశాడు.

బుల్ డాగ్ వేగంగా పిప్పరమిట్ ని అందుకుంది. తృప్తికరంగా, వేగంగా బుల్ డాగ్ నములుతున్న చప్పుడు వినిపించిందతనికి.

మెల్లిగా .... మెల్లిగా .... కదలిక తెలీకుండా, స్లో మోషన్ లో మనోజ్ చెయ్యి కదిలించాడు. ఎన్నో గంటలు

గడిచాయని అతను అనుకుంటున్న క్షణాల్లో అతని చేతికి జేబులోని పిప్పరమిట్స్ దొరికాయి. మెల్లిగా అతని చెయ్యి యివతలికి వచ్చింది.

బుల్ డాగ్ అతని నోటిని మళ్ళీ మూడ్డం ప్రారంభించింది. మనోజ్ రెండు పిప్పరమింట్లని అరచేత్తో దాని నోటిముందు వుంచాడు. బుల్ డాగ్ ఆత్రంలా వాటిని నాలుకతో లాక్కుంది. నాలుక తడి తగిలి మనోజ్ చెయ్యి వణికింది. బుల్ డాగ్ నోరు గరగర చప్పుడు చేస్తోంది.

చేతిలోంచీ అయిదారు పిప్పరమింట్లని గోడదాకా పొడుగ్గా చల్లాడు మనోజ్. అతని ఊహ నిజమైంది.

బుల్ డాగ్ తలవాల్చుకుని వాటిని అందుకుంటూ, నములూ ఏకాగ్రతతో ముందుకి వెళ్తోంది!

మనోజ్ మెరుపులా కదిలాడు. రెప్పపాటులో కటకటాల లోపలికి దూరి, తలుపు లాగేశాడు. బరువుగా నిట్టూరుస్తూ ఇద్దరు బందీలని చూశాడు.

వాళ్ళ మొహాల్లో ఆశ్చర్యం, ఆందోళనా కలిసి కనిపిస్తున్నాయి. వాళ్ళిద్దర్నీ చిరునవ్వుతూ చూస్తూ, మనోజ్ నడుంలో దోపిన డార్ట్ గన్ తీశాడు.

ఏదో శబ్దం అతని దృష్టిని ఆకర్షించింది. మనోజ్ తలతిప్పి చూశాడు.

బుల్ డాగ్ కటకటాల్ని ముందరి కాళ్లతో రాస్తూ అతన్నే ఆశగా చూస్తోంది. మనోజ్ జేబులో మిగిలిన పిప్పరమింట్స్ని కటకటాలగుండా దూరంగా విసిరాడు. బుల్ డాగ్ నూతనోత్సాహంతో వాటిమీదికి విజృంభించింది. మరుక్షణం డార్ట్ బుల్ డాగ్ మెడలో లోతుగా గుచ్చుకుంది. తృప్తికరంగా పిప్పరమెంట్స్ నములుతున్న

పక్క మెల్లగా కిందికి వాలిపోయింది.

మనోజ్ వెనుదిరిగాడు. సైలెన్సర్ అమర్చిన రివాల్వర్ని సంచీలోంచీ తీశాడు.

"మీ గొలుసుల్ని తూటాలతో తెగ్గొడతాను, కదలకుండా వుండాలి!" అన్నాడు వాళ్ల దగ్గరగా నడుస్తూ.

"జాగ్రత్త" లావుపాటి వ్యక్తి బొంగురుగా అన్నాడు.

"త్వరగా.... ఈ నరకంలోంచీ బైటపడాలి!" అతని సహచరుడు ఆత్రంగా అన్నాడు.

మనోజ్ చేతిలోని రివాల్వర్ రెండుసార్లు సన్నగా చప్పుడు చేసింది. ఇద్దర్నీ బంధించిన గొలుసులు నేల మీద చచ్చిన పాముల్లా పడున్నాయి. కంఠానికి తగిలిన కడియాల్లా రింగులు వాళ్ళ మెడల్ని ఇంకా చుట్టే ఉన్నాయి. ఇద్దరూ పక్కపక్కనే నిలబడి అటూ ఇటూ తూలుతున్నారు.

"నువ్వు ..." లావుపాటి వ్యక్తి విభీషణ్ అనుమానిస్తూ ఆగాడు.

"పరిచయాలు తరవాత. ముందు ప్రాణాలు దక్కించుకోండి!" అంటూ మనోజ్ ముందు హాల్లో టేబుల్ మీంచీ తీసుకున్న రెండు రివాల్వర్లని వాళ్ళకి చెరొకటి ఇచ్చాడు. "అడ్డొచ్చినవాళ్ళని అంతం చేయండి!కమాన్ !"

మనోజ్ సన్నటి నడవమ్మట పరుగు ప్రారంభించాడు.

సాధారణ పరిస్థితిలో వాళ్ళిద్దరూ పరుగెత్తలేరని అతనికి బాగా తెలుసు. వాళ్ళ కాళ్ళు వేళ్ళు పచ్చడి చేయబడ్డాయి. కానీ ఇది సాధారణ పరిస్థితి కాదు!

వొగురుస్తూ పరుగెడుతున్న వాళ్ళ అడుగుల చప్పుడు వింటూ మనోజ్ వేగంగా వెళ్ళసాగాడు.

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల ౯ వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్ట్‌లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 90/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించ నవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. ఇంకా నెలనెలా, రెండేసి నెలలకు V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 0/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

**పూర్తి వివరాలకై 'అపన' చూడండి!**

ఎవ్వరూ ఎదురవనందుకు సంతోషిస్తూ మనోజ్ తోటలోకి వెళ్ళే చివరి తలుపుముందు ఆగాడు.

కేసీపట్లో ఇద్దరి వూగుర్పులూ వెనకనుంచీ అతనికి వినిపించాయి. లోపల ప్రవేశించేటప్పుడు తను తలుపుకి చేసిన కన్నం దగ్గరగా చెవిని వుంచి క్షణకాలం జాగ్రత్తగా విన్నాడతను. చల్లటి గాలి అతని చెవిని తాకుతోంది.

మనోజ్ నిలబడి, వాళ్ళవైపు తిరిగాడు. "ఈ తలుపు తీశాక మెట్లు దిగి, తోటలోకి ప్రవేశించాలి. చీకట్లో నా వెంట మీరు జాగ్రత్తగా, వేగంగా పరుగెత్తాలి' తాడమ్మట గోడపైకి ఎగబాకాలి. అవతలివైపుకి దిగాలి' ఆ తరవాత...."

"తరవాతది తరవాత. ముందు ఇక్కణ్నుంచీ వెళ్ళిపోవాలి!" సన్నటి వ్యక్తి, శరత్ అడ్డొస్తూ అన్నాడు.

"తరవాత, నేను ఆగేదాకా మీరు పరుగెత్తుతూనే వుండాలి!" అతని మాట వినిపించుకోకుండా అన్నాడు మనోజ్. మెల్లిగా తలుపుని కొంచెం లాగాడు. తల దూర్చి కాసేపు చీకట్లోకి చూస్తూ వుండిపోయాడు.

"కమాన్!" అంటూ తలుపుని మరికొంచెం తెరిచి, మెట్లమ్మట కిందికి దిగసాగాడు. ఇద్దరూ నీడల్లా అతన్ని వెంబడించారు.

లావుగా పొట్టిగా వున్న విభీషణ్ మనోజ్‌ని అంటిపెట్టుకుని, అతని వెనక బుల్‌డాగ్‌లా పరుగెడుతున్నాడు. ఇద్దరికీ మూడడుగుల దూరంలో వెనగ్గా భరత్ పరుగెడుతున్నాడు.

ఎడంవేపునుంచీ మూసుకొస్తున్న ఆకారాన్ని వాళ్ళెవ్వరూ చూడలేదు. కవాతు చేస్తున్న సైనికుల అడుగుల చప్పుడులా-గడ్డిలో మెత్తగా ధ్వనిస్తున్న తమ

అడుగుల శబ్దం మూలంగా తమ పక్కనుంచీ వస్తున్న మెత్తటి అడుగుల శబ్దాన్ని ఎవ్వరూ వినలేదు.

చిన్న పొక్కపైనుండీ అటువేపు జాగ్రత్తగా దూరబోయిన భరత్ అసంకల్పితంగా కెవ్వుమన్నాడు. వెనకవైపున వున్న అతని కుడికాలు యేదో చట్రంలో బిగుసుకున్నట్టనిపించింది. తూలిపడబోతూ, ఆగి, అతను తన కాలివైపు కంగారుగా చూశాడు.

పిక్కల్లోంచీ యేదో మంట. సలుపు జరజరా పాకుతున్నాయి. తన కాలికి బంతిలా కరుచుకుని, బలంగా లాగుతున్న అల్సేషియన్ డాగ్‌ని అతను ఆందోళనతో చూశాడు. బలంగా కాలు విదిల్చాడు. పిక్కల్లోకి పళ్ళు లోతుగా దిగుతున్నాయి. భరత్ మళ్ళీ చిన్నగా అరిచాడు.

తన చేతిలోని రివాల్వర్ అతనికి తటాలున గుర్తొచ్చింది. కొద్దిగా కిందికి వొంగి, రివాల్వర్‌ని కుక్క తలకి గురిచూసి, కంగారుగా అతను ట్రిగ్గర్ నొక్కాడు.

చెవులు పగిలేలా చప్పుడైంది. రంపం పళ్ళు అతని కాలిమీద వదులయ్యాయి. అల్సేషియన్ నిర్జీవంగా గడ్డి నేలమీదికి వాలిపోయింది. చెమటలు కక్కుతూ, భరత్ పరుగు ప్రారంభించాడు.

రివాల్వర్ షాట్ విని, మనోజ్ తటాలున ఆగాడు. అతన్ని ఢీకొట్టుతూ విభీషణ్ వొగురుస్తూ నిలబడ్డాడు. కుంటుతూ తమవేపు వస్తున్న భరత్‌ని మనోజ్ గాభరాగా చూశాడు. గోడ నాలుగడుగుల దూరంలో వుంది. రివాల్వర్ శబ్దాన్ని భవనం ముందున్న వ్యక్తులు విని వుంటారు. ఛాండాలుడు! భరత్‌ని తిట్టుకుంటూ, మనోజ్ విభీషణ్‌ని గోడవైపు తోశాడు.

"కమాన్! అదిగో తాడు. పైకి పాకు!" మనోజ్ అరిచాడు, తగ్గుస్వరంలో.

తెప్పరిల్లిన విభీషణ్ గోడని సమీపించి, తాడు పట్టుకుని గబగబా పైకి పాకసాగేడు. మనోజ్ ఆత్రంగా భరత్ వైపు చూశాడు. అతనింకా పదడుగుల దూరంలో వున్నాడు. మనోజ్ క్షణంలో ఒక నిశ్చయానికి వచ్చి, తాడు వైపు గెంతేశాడు. విభీషణ్ గోడమీద పిల్లిలా వున్నాడు. మనోజ్ తాడుని పట్టుకుని పైకి పాకసాగేడు.

భవనం ముందువైపునుంచీ యేవో కేకలు వినిపిస్తున్నాయి. మనోజ్ గోడ పైభాగాన్ని సమీపించాడు. అతను దగ్గరకు రాగానే విభీషణ్ అమాంతం గోడ మీంచీ కిందికి దూకేశాడు. అతని ధైర్యానికీ, శక్తికీ ఆశ్చర్యపోతూ మనోజ్ గోడమీదికి చేరుకొని, తలని కిందికి వాల్చాడు. భరత్ తాడుని పట్టుకుంటూ పైకి చూస్తున్నాడు.

"కమాన్! వచ్చెయ్!" అంటూ మనోజ్ వేళ్ళతో గోడని పట్టుకొని అటువైపు కిందికి వేళ్ళాడాడు. పది అడుగుల గోడనుంచీ అయిదడుగుల పొడవుతో తను వేళ్ళాడుతున్నాడు. నేల తన పాదాలకి అయిదడుగుల దూరంలో వుంది. మనోజ్ వేళ్ళని వదులుచేస్తూ కిందికి దూకేశాడు.

అతని పక్కనే, విభీషణ్ కొలిమి తిత్తిలా బుస కొడుతూ నిలబడ్డాడు. మనోజ్ ఆదుర్దాతో పైకి చూస్తున్నాడు. కాసేపట్లో భరత్ నీడలా గోడమీద ప్రత్యక్షమయ్యాడు. అల్సేషియన్ అతన్ని గాయపరిచిందని మనోజ్ కి తెలుసు. అతను కిందికి దూకగలడా?

(సశేషం)

